ఎమెస్కో ప్రచురణ

# ఎమెస్కో వచన రామాయణం

శతావధాని కోట వీరాంజనేయ శర్మ






# ఎమెస్కో వచన రామాయణం

## (మూడవ సంపుటం)

రచన :

శతావధాని కోట వీరాంజనేయశర్మ

**MSCo**

191

యం. శేషాచలం & కంపెనీ

మచిలీపట్నం — సికింద్రాబాదు

EMESCO VACHANA RAMAYANAM — Vol-3
As retold by
SATAVADHANI KOTA VEERANJANEYA SARMA



*Second Edition :*
AUGUST, 1984

*Publishers :*
M. SESHACHALAM & CO.,
Machilipatnam, Secunderabad




*Cover Design :*
BAPU

*Printers :*
Pushpa Printers,
Hyderabad-500 044.

Price : Rs. 6-00

Distributors :
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS
3237, Rashtrapati Road, Secunderabad-500 003

స్వామి ! భవత్కృపాప్రబలసంగతి రెండవసంపుటంబునున్
భూమి భవాత్మదేవు పదముల్ స్పృశియింపఁగనుంచెనాను గో
దామయసూనషట్లుగను; పావని! మూఁదఘసంఘటంబునున్
దామర పంపితా! భవబంధహరంబుగఁ వ్రాయఁజూసుమా.

## సీతకు నారచీరలిచ్చిన కైకను రాజు దుర్భాషలాడుట

ఇంతలో నారవసనాలు ధరించిన నారీరత్నం సీత వచ్చి భర్త ప్రక్కన నిల్చుంది. అందరూ దశరథుణ్ణి అనరాని మాటలన్నారు. అచటి వారల ఆక్రందనాలు రాజును కడుపులో చేయి పెట్టి కలచినట్లయింది. కొరివి పెట్టి కాల్చినట్లుగా కైకను చూచి "ఓసీ! కులపాంసనీ! నీ హృదయం ఇనుమా? వజ్రమా? ఆ బంగారు తల్లి శరీరం కనబడుతుంటే నీకు సిగ్గులేదా? నీవు అసలు దానివి కావా? నీకు నేనిచ్చిన వరాల్లో నా కోడల్ని నారచీరెల్తో అడవికి పంపుతానని అనలేదు. కనుక సీత సర్వాభరణభూషితురాలై ఆత్మ పతిని అనుసరిస్తుంది. కాటికి కాళ్ళు చాచిన నేను, కామాంధుడనై ఘోరమైన పాపం చేశాను. నా మాటే నన్ను కాల్చివేస్తున్నది. వెదురు తనలో వున్న అగ్నితో తన్నే దహించుకున్నట్లు, పరమపావనుడైన రాముణ్ణి వనవాసానికి త్రోసినందుకే రౌరవాది నరకాలు సంప్రాప్తమౌతుంటే, మహాసాధ్విని ఈ విధంగా అవమానించి దుఃఖం పాలు చేస్తే యముడు నీకోసం తన శిక్షా స్మృతులనే సవరించుకోవలసి వుంటుంది. ఛీ! నీతో నాకేమి పని? ఈ రాజ్యంతో అంతకంటే పనిలేదు. నేను అడవికి మారుగా, ఆ పరలోకానికే పోతా. గురుదేవులు చెప్పినట్లుగా జానకి నారచీరెలు ధరించటం పూర్తిగా నేను నిరోధిస్తున్నాను. నీవు కోరలేదు. నేనియలేదు. నాకసత్యదోషం రాదు" అంటూ మూర్ఛలో మునిగారు.

## తల్లిని కాపాడమని తండ్రిని రాముడు వేడుకొనుట

మూర్ఛిల్లిన తండ్రిని ఉపచారాలతో సేదదీర్చి, తల్లి వంక దీనంగా చూస్తూ తండ్రిని వేడుకున్నాడు. "జనకా! మాటిమాటికీ మనస్సు పాడు చేసుకుంటున్నారు. ఏది ఏమైనా, మీరు ఋజువర్తనులన్న కీర్తికళంకం

రావటం నేను సహించలేను. కని పెంచి పెద్దవాణ్ణిచేసిన తల్లిదండ్రుల మాట చెల్లించని కొడుకులు పుట్టినా, గిట్టినా ఒకటే. నేను మనసా, వాచా, కర్మణా మీపట్ల ఏ దోషం చేయలేదు. ఇకమీదకూడా చేయను. అమ్మ ఇంతవరకు ఏ దుఃఖం ఎరుగదు. ఈనాటినుండీ పుత్రశోకంలో క్రుంగి పోతుంది. వయోవృద్ధురాలు. నాకై ఏడ్చిఏడ్చి మరణిస్తుందేమో. ఆ పని జరగకుండా ఆమెను ఓదార్చవలసిన భారం మీమీదవుంది. ఊరటకోసం చెప్పుకుంటానికైనా మాసుమిత్రమ్మ కూడా అదేస్థితిలో వుంటుంది. ఈ ఇద్దరూ మీకు రెండునేత్రాలు. నేను తిరిగివచ్చేవరకు వారి సంరక్షణ భారం మీరేవహించాలి. కాబట్టి మీరింక దిగులుమాని, ధైర్యంతో కావలసిన పనులన్నీ చేయించండి. ఇక్కడవున్న తల్లులందరూ నాకోసం బెంగపెట్టుకుంటారు. వీరిని ప్రేమతో పరామర్శించండి. గురుదేవా! మీరు సముద్రగంభీరులు. నాకై చెలియలికట్ట దాటకండి. ఏం జరుగ నున్నదో అదే జరుగుతుంది. అస్వస్థులుగానున్న తండ్రిగారినిమీఅమోఘ వాక్కులచే ఆరోగ్యవంతుల చేయండి. భరతుడురాగానే అతని ఇష్టం తెలుసుకుని అభిషంగాచేయండి. అమాత్యశ్రేష్ఠులూ, అయోధ్యాప్రభువుల ఆత్మస్వరూపులూఅయిన సిద్ధార్థ సుమంత్రాదిమంత్రిశేఖరులారా! జరిగిన సంఘటనలు తలపోయక, జరగవలసిన కార్యాలు తమసమ్మతితో జరుగ నట్లు చూడండి. మీఅందరి అపార గౌరవాభిమానాలకు పాత్రులమై నందుకు మేము మీకెంతో ఋణపడిఉన్నాము. ఈ అనంతకాలంలో పద్నాల్గేండ్లేమిలెక్క? తల్లులారా! మీరుకోరినట్లు మీకోడలు వుంటే నాకభ్యంతరంలేదు. నేనుఎన్నోవిధాల చెప్పాను. ఆమెనాతోరావటానికే నిర్ణయించుకుంది. ఆనిర్ణయం ఆమె చేసుకున్నదేకాని, నేనైనిర్బంధించ లేదు. ఇది ఒకపీడకలగా భావించిమరచిపోండి. త్వరలోసుఖసంతోషాలు లభించగలవు." మహాజనులను ఉద్దేశించి మాటలాడబోతుంటే అందరూ రామునిచుట్టూచేరి, "తండ్రీ! నీ గుణం ఎవరికివస్తుంది? పెండ్లికిపోయే వానిలాగా అడవికిపోతున్నావు. ఎంతనిగ్రహం. ఎంత ధర్మపాలనానిష్ఠ. నీ వనవాస సమయంలో, సర్వదేవతలూ నీకు సాయపడుదురుగాక"

అంటూ, అశ్రువులు కార్చారు. త్రెంపలేని పుత్రవ్యామోహబంధంతో దశరథుడు ఆర్తితో—

## మునివేషంలో వున్న రాఘునికి రాజు అశ్రునేత్రాల్లో అనుమతి ఇచ్చుట

"నాయనా! నావంటి తండ్రి జన్మజన్మాలకు పగవానికైనా వద్దు. ఎవరుచేసిన తప్పుకు వారే శిక్షకు పాత్రులవుతారు. రాజుచేసిన తప్పు రాజ్యానికే ముప్పు-అదే నేను చేశాను. అందర్నీ దుఃఖపెట్టాను. పాల వంటి వంశానికి విషబిందువునైనాను. నా పాపమంతా నీ సత్యదీక్షాగ్ని హోత్రంలో దహించావు. దిక్పాలవంటి బ్రాహ్మణుల్లో, సాటిరాజుల్లో తల వంపులు లేకుండా చేశావు. నిన్నేమని ఆశీర్వదించేది? అన్ని సద్గుణాలూ నీలోవున్నై. అన్ని శుభాలూ, అన్ని శక్తులూ, కలిసి పుంభావరూపంగా నీవుగా నిల్చినై. ఓంకారంపుచ్చరించకుండా వేదం ఎలా పఠించరో, అలాగే నీపేరు "శ్రీరామ" వ్రాయకుండా భవిష్యత్తులో లేఖకులు వ్రాయకుందురు గాక! నీ మూర్తి "శ్రీరామాలయం" లేని ఆలయం జనావాసాల్లో లేకుందురుగాక! ఆర్తులకూ, భక్తులకూ, నీ నామం "తారకం" స్మరణ మాత్రంచేతనే తరింపచేయుగాక! ఏ జన్మలో తల్లిదండ్రులకు బిడ్డల దూరంచేశానో ఆ ఫలం ఇప్పుడు ప్రతిరూపంగా అనుభవిస్తున్నాను. ఆ కర్మఫలంకూడా నీ చేతి నీళ్ళతో నశిస్తుంది. నాకు వుత్తమ లోకాలు ఇక నిరాఘాటంగాలభిస్తయి. మంత్రీ! సుమంత్రా! నీవు రామునికర్హమైన రథాన్ని పూన్చి తీసుకునిరా! నీవు వీరిని అందులో అధివసింపచేసి, జన పదాలు దాటించి, యోగ్యమైన ప్రదేశంలో విడిచిపెట్టిరా" అని ఆదేశించాడు. "ధర్మపరులకూ, తోడులేనివారికీ, మెతకవారికీ సాధువర్తనులకు ఇటువంటి ఫలాలేవస్తయి" అని సుమంత్రుడు అనుకుంటూ రథంసిద్ధంచేసి తెచ్చి రాజగృహం ముందు వుంచి, చేసినపని రాజుతో చెప్పాడు.

"సుమంత్రా! విత్తాధికారిని పిలిపించి, పద్నాలుగేండ్లకు సరిపడే బట్టలు, చీరెలూ, రవికలూ, ఆభరణాలూ, పసుపూ, కుంకుమా తెప్పించు. నాకోడలు అడవిలో ఏలోపంలేకుండా వుండాలి" అని మళ్ళీ ఆజ్ఞచేశాడు.

ఆ పని పూర్తికాగానే, కోడలిని పిల్చి, అనురాగంతో అన్నీ ఆమెకు అందచేశాడు. ఆమె అందుకుని, తగుమాత్రంగా అలంకరించుకునివచ్చి, అత్తమామలకు ప్రణమిల్లింది. ఆమె చేసుకున్న కొద్దిపాటి అలంకారానికే ఆ మందిరం అంతా సూర్యప్రకాశంవలె వెలిగిపోయింది.

## కౌసల్య కోడలికి ధర్మోపదేశం చేయుట

తుఫానుకు సముద్రంవలె అంతఃపురమంతా సంక్షుభితమవుతుండే, ఇద్దరే ఇద్దరు స్త్రీలు ఏమీ పట్టనట్లున్నారు. ఒకతె సీత, రెండోది కైకేయి. త్రిలోకాధిపత్యంవచ్చినా, తృణప్రాయంగా చూచి, సత్యవ్రత పాలనం సలిపే మానుషాకారంపొందిన దైవము తనకుపతి అయినాడన్నసంతోషం సీతధైర్యానికి కారణమైతే, పట్టు చెల్లించుకున్నాననే సంతోషం కైకేయికి కారణమైంది. బురదనీరు ఇంగువ గింజ గంధంతో తేరి నిర్మలంగా వున్నట్లు అంతరిపలెకాక, భర్త నీడలో నిద్రించే భాగ్యం తనకు కల్గినందుకూ, అడవికివచ్చుటకు అనుజ్ఞ నిచ్చినందుకూ, అన్నికష్టాలూ, అన్ని అనుబంధ బాంధవ్యాలు అతిక్రమించి, చంద్రుని సామీప్యంలో రోహిణి వలె వున్న కోడలిని దగ్గరకుతీసుకుని, గాఢంగా కౌగిలించుకుని తల నిమిరి, బుగ్గలు పుడికి కౌసల్య గారవంగా చెప్పింది.

"అమ్మా! జానకీ! చిన్నవయసులోనే పడరానికష్టాలుప్రాప్తించినై. అందుకు మామగారిపైకానీ, భర్తపైకాని అలగబోకు. సుఖసమయాలల్లో భర్తా, కష్టాలల్లో హర్తగా పతిని భావించకు. పరమ పూజ్యులైన జనక మహర్షి బిడ్డవు. నీకు నీతిబోధించటం సూర్యునకు దివిటీ పట్టటంవంటిది. ఆడుజాతికి స్వభావంగా ఒక పెద్దగుణంవుంటుంది. అబద్ధాలకు జంకరు. స్వసుఖం ఆశించినంతగా, భర్తసుఖం ఆశించరు. మనసులో మాట ఎంత ప్రేమగలవారికైనా చెప్పరు. సంపాదనలేని మగవాణ్ణి పూచిక పుల్లకైనా లెక్కకట్టరు. తల్లికడుపుచూస్తే, భార్య సంచి చూస్తుంది. తమ కోరికలు తీర్చలేకపోతే, భర్తలగుణ శీల విద్యా పాండితీ మహిమలు పరిగణింపరు. సతీ ధర్మాన్నిపాటించే ఆడుదానికి త్రిభువనాలూ, సర్వశక్తులూ లోబడి వుంటాయి. ఆదర్శ స్త్రీ రత్నాలుగా అభినందించబడుతున్న

అనసూయను, ముగ్గురు మూర్తులూ పొత్తి బిడ్డలైనారు. సుమతికి సూర్యుడే దాసోహం అన్నాడు. సావిత్రికి యముడు, కన్న తండ్రివలె కామ్యాలు తీర్చాడు. వారాశక్తిని పతి పాదసేవలోనే ఆర్జించారు.

అమ్మా! పౌరుషవంతుడైన నా బిడ్డ నేడు దైవోపహతుడైనాడు. పరిహరించగల ప్రజ్ఞా, ప్రతిభా, కలవాడైనా తండ్రిమాట దక్కించటమే పరమ ధర్మంగా పాటించాడు కనుక వనవాసి అయినాడు. ఐహికసంపదలకు దూరమైనాడు. వనవాసానంతరం నీ వనుభవించే సౌఖ్యం, ప్రపంచ నారీజనానికి అసూయాకారణం అవుతుంది. ఇక నీ స్థానం ఇనుమడిస్తుంది. దాసివలె, మంత్రివలె, భార్యవలె, చెలికానివలె, తల్లివలె భర్తను ఆయా సమయాల్లో తోడ్పడాలి. నీవు అన్నిటికీ అర్హురాలవు. భూపుత్రివి కనుక ఓర్పును గూర్చి నీకు చెప్పనక్కరలేదు. జనకులబిడ్డవు కనుక జ్ఞానం నీసొత్తు. మైథిలివి కనుక స్వకర్మాచరణ వెన్నతో పెట్టినవిద్య. వైదేహివి కనుక ఆత్మసాక్షాత్కారం అరచేతిలో ఉసిరిక పండు. అన్ని విధాలా నాబిడ్డ అదృష్టవంతుడు. అనుకూలవతివి, అనురాగవతివి, నిన్ను అర్ధాంగిగా పొందిన మా రామయ్య సాధించలేనిదంటూ లేదు. మీరు ముగ్గురూ వ్రత సంపూర్తిచేసుకుని తిరిగి సుఖంగారాండి. సింహాసనాసీనుడైన నాబిడ్డ అర్ధాంకంలో నిన్నూ, దక్షిణభాగంలో, ధనుర్ధారియై నిల్చిన సౌమిత్రినీ చూస్తాను" అంది.

ఆ మాటలు విని, తలవంచి సీత అత్తతో అన్నది. "అత్తయ్యా! తండ్రి ఇంట్లోనే సతీధర్మం సాంతంగా తెలుసుకున్నాను. మీరు ప్రేమతో బోధించిన నీతులు త్రికరణ శుద్ధిగా పాటిస్తాను. ఎప్పుడు వెన్నెల చంద్రునికి దూరమవుతుందో నీ కోడలిలో సౌశీల్య సతీత్వాలు ఆనాడు దూరమవుతాయి. తంత్రి లేకపోతే వీణకు నాదంలేదు. చక్రం లేకపోతే బండి నడవదు. చూపు లేకపోతే దారి కనపడదు. నూర్గురు బిడ్డలున్నా, సతికి పతి లేకపోతే బ్రతుకలేదు. తల్లిగానీ, తండ్రిగానీ, కొడుకులుగానీ, కూర్చే సౌఖ్యం మితమైంది. అమిత సుఖాన్నిచ్చే ఆత్మేశ్వరుణ్ణి ఎవతె ఆరాధించదు? ఆరాధించని ఆడుదాన్నిగూర్చి మనం అనుకోవలసిన అవసరంలేదు."

కోడలి మాటలకు కౌసల్య కొంత ఊరట చెందింది. ఆమెవలెనే అత్తలందరూ శోకం దిగమ్రింగారు. సీతారాములవంటి కోడళ్ళా, కొడుకులూ, "నభూతో నభవిష్యతి" అని అనుకున్నారు. ఒకవిధంగా కైకేయినిపొగడారు. నివురుగప్పిన నిప్పులాగావున్న సీతారామలక్ష్మణుల గుణగణాలు, కైకేయీ కల్పిత పట్టభంగవాతాహతితో ప్రకాశవంతమై పదుగురికి తెలియవచ్చిందని తృప్తిపడ్డారు. కైకేయి కాలహరణం సహించటం లేదన్నట్లు బొమలు ముడిపడివున్నై. చూపుల్లో వేడివుంది. ఆ వేడిలో వాడికూడా వుంది. అది రామచంద్రుడు గమనించాడు. ఋషిపత్నుల్లో అరుంధతివలె సవతులమధ్యలో వున్న తల్లివద్దకుపోయి, బాష్పాకులిత నేత్రయైవున్న తల్లిపాదాలకు నమస్కరించాడు.

## తల్లులవద్ద రాముడు సెలవు తీసుకొనుట

'అమ్మా! అంతం ఇప్పుడు కానివానికి ఎంత దుఃఖించినా ప్రయోజనంలేదు. నా పద్నాల్గేండ్ల అరణ్యవాసం నీ నిద్రలో గడచిపోతుంది. అనవసరంగా నీవు బాధపడి జనకుని బాధపెట్టకు. ఆయనకు నీవు దిక్కు, నీకాయన దిక్కు. అన్యోన్యం ధైర్యం చెప్పుకొని, శరీర రక్షణంలో ఏమరుపాటువదిలి, నారాకకై ఎదురుచూస్తూ వుండండి. పినతల్లులారా! అజ్ఞానంచేత ఏదైనా మీపట్ల అపచారంచేస్తే మన్నించండి. మీ పుత్రుడనే కదా. తల్లులెప్పుడూ పుత్ర శ్రేయోభిలాషిణులే కదా. వెళ్ళివస్తాం. సెలవు" అని అంటుండగానే నక్షత్రాలు రాలిపడినట్లు అందరూ హాహా కారాలతో అవనిపై పడ్డారు.

నిరంతరం మృదుమధుర జంత్రవాద్యనిస్వనాలతో, లలితసంగీత కళావిన్యాసాలతో, వేశ్యాంగనారచిత గంధర్వగాన, అభినయ, నృత్య ప్రదర్శనలతో ఆనందమందిరంగావుండే రాజప్రాసాద అంతర్భాగం అంతా రోదనధ్వనులతో, కళావిహీనంగా మారిపోయింది.

## అన్నతో అనుగమించటానికి తల్లి సౌమిత్రికి అనుజ్ఞ ఇచ్చుట

ఆ దుఃఖసముద్రతరంగాలమధ్య తేలుతూ, రాముడు తల్లికీ, పినతల్లి సుమిత్రకూ, క్రమంగా మూడువందల ఏభైమంది చిన్నతల్లులకూ

ప్రణామాలు ముగించారు. జానకినీ, సౌమిత్రినీ, కౌసల్యాసుమిత్రలను నమస్కరించి అనుజ్ఞపొందనున్నాడు. అశ్రువులతో పాదాభివందనం చేస్తున్నకొడుకును సుమిత్రాదేవి ప్రేమతో గుండెకుహత్తుకొని, "నాయనా! లక్ష్మణా! నీకార్యం మిక్కిలిగురుతరమైనది. అనురక్తితో, అన్నవెంట అడవులకు పోవటానికే పుట్టావు. నీకు అన్నివిధాలా దేవతలు అనుకూలిస్తారు. ఆనందంతో అనుమతిస్తున్నాను. నాకోడలి అంతఃతపశ్చర్య పెట్టని రక్షగా నిన్ను అన్నివేళలా కాపాడుతుంది. నేను మీ ముగ్గురి క్షేమంకోసం ఉపవాసదీక్షతో ఆపరాశక్తిని ఆరాధిస్తాను. అన్నావదినల సేవలో అప్రమత్తుడవై మెలగు. ఇది మనకు సనాతనధర్మం. జ్యేష్ఠుణ్ని అనుసరించటమే కనిష్ఠుల ధర్మం. ఆధర్మం నీలో పరాకాష్ఠకు చేరుకుంది. వీరునకు యుద్ధంలో మృతియెట్టిదో, త్యాగికి ఆత్మార్పణం ఎట్టిదో, అట్టిదే చిన్నలకు పెద్దల సేవించటం. ఇది విధి విహితం. నీటిబుగ్గలవంటి శరీరాలను నమ్మకుని, శాశ్వతమైన పరలోక సుఖాలనూ, కీర్తినీ, ప్రాజ్ఞులెప్పుడూ వదలుకోరు.

"ఏదిజరిగినా మన మంచికే" అనిఅంటారు పెద్దలు. ఇదిఎందుకు జరిగిందో ప్రాకృతులమైన మనకు తెలియదు. తెలియక వృథగా దైవదూషణం చేస్తారు కొందరు. కొందరు తోటిమానవులను నిందిస్తారు. నాదృష్టిలో ఏదోషం ఎవరిపట్లా లేదు. తెలియనివాళ్ళుదురభిమానంతో, తోటికోడలు కైకేయిని తూలనాడుతారు. పుష్పసుకుమారమైన ఆమె హృదయం ఈవిధంగా కఠిన కర్కశ పాషాణసదృశమైనదంటే విధి బలంగాక ఏమవుతుంది? కన్నవాడు సన్నిధిలేకున్నా, అంతకంటే అధికాధికంగా చూసిన ఆమె, అబ్బాయిపట్ల ఇంతక్రౌర్యంగా ప్రవర్తించిందంటే హేతువు ఏమనిచెపుతావు? వరాలిచ్చిన తండ్రి ఇలాకోరుకుంటుందని వూహించారా? ఆ లలితసుకుమార మాతృహృదయంలో, తన జీవితానికేశాశ్వతకళంకం తెచ్చేకోరికకలుగుతుందని ఆమెతలంచిందా! మంత్రులూ, మహర్షులూ, పౌరులూ, పట్టభంగం అవుతుందని అనుకున్నారా? అందుకే మానవుడు ఎంతప్రజ్ఞావంతుడైనా దైవానికి మారురూపం అయినా, తెలియరానిదేదో శక్తివుందని చెప్పబడటం ఇందుకే.

నీకు విశేషంగా ప్రస్తరించి చెప్పవక్కరలేదు. ఏసమయంలోనూ ఇది మరిచిపోవద్దు.

"రామం దశరథం విద్ధి, మాం విద్ధి జనకాత్మజాం,

అయోధ్యా మటవీం విద్ధి, గచ్ఛతాత! యథాసుఖం." అని చెప్పింది. కోడలిని, నమస్కారానంతరం, తనవదనానికి సన్నిహితంగా తల చేర్చుకుని, "అమ్మా! పోయిరా. అక్క చెప్పిందానికంటె నేను ఎక్కువచెప్పేదిలేదు. "దీర్ఘాయుష్మాన్ భవ! దీర్ఘసుమంగళీభవ!" అని మాత్రం దీవిస్తాను." అంటూ సెలవిచ్చింది. మహారాజ శాసనంచొప్పున మంత్రియైన సుమంత్రుడు రథశాలకుపోయి, మేలైన రథాన్ని ఎంచి, సూర్యుని గుఱ్ఱాలతో గమనంలో పోటీపడే ఉత్తమాశ్వాలను పూన్చి, బహువిధాలంకారాలతో వెలుగునట్లుచేసి, వీథుల వెంటగొని వస్తుంటే, ఆ రథానికి ప్రజలు అడ్డపడి సాగనీయలేదు.

"మహామంత్రీ! ఈ దుష్టకార్యానికి మీ రెలా సమ్మతించారు? ఆమె కోర్కెను ప్రభువు ఎలా మన్నించాడు? ఎంతకాలానికో ఈ శుభ వేళ వచ్చిందని సంతోషిస్తున్న మాకు, ఈ గుండెలపైకుంపటేమిటి?" అంటూ ప్రశ్నల వర్షాన్ని కురిపిస్తుంటే, సమాధానం ఏమి చెప్పాలో తోచక సుమంత్రుడు అందరికీ చేయెత్తిమొక్కి "పౌరులారా! నన్ను క్షమించండి. ఈవిషయంలో మీరెంత శోకిస్తున్నారో నేనూ అంతగా శోకిస్తున్నాను. గురుదేవులు, పెద్ద అమాత్యులు చెప్పగలిగిన మేరకు చెప్పారు. ఫలించలేదు. ప్రయాణానికి అన్నీసిద్ధమైనవి. అందుకే రథం తోలుకునిపోతున్నాను. మీమాటలకైనా రామచంద్రుడుకరుగుతాడేమో" అని బదులు చెప్పి త్వరగా రథంతెచ్చి రాజమందిరం మొగసాలవద్ద నిలిపాడు. గుండె బరువుతో పైకిపోయి, రాజునకీసంగతి చెప్పి "రామచంద్రా! తేరుసిద్ధమైవచ్చింది. ఏమిచేయాలో ఏప్రదేశానికి కొనిపోవాలో తెలిపితే, ఆ ప్రకారంచేస్తాను. వచ్చి రథారోహణంచేయండి" అని వినమ్రుడై పలికాడు.

సీతారామలక్ష్మణులుఅంతఃపురంవాటిమెట్ల సమీపానికి వచ్చారు. శ్రీరాముడు, నేల ఈనినట్లు కనుచూపుమేర, కాంతిహీనులై, శోకంయావం

దాల్చినట్లు, తనరాకకు ప్రతీక్షించుచున్న ప్రజాసమూహాన్ని చూచాడు. గృహాలపై, రాజసౌధాలపై, శృంగాటకమధ్య ప్రదేశాలపై, సామంత ప్రభువుల రథాలపై, ఎగురుతున్న జెండాలు అవనతం చేయబడినై. ఆ జనసమూహంలో తానెక్కవలసిన తేరు ఎక్కడవుందో తెలియటంలేదు. వెనుకగా, తండ్రీ, తల్లులూ, దాసీలూ, పరిచారకులూ ఒకరివెంటఒకరు వస్తున్నారు. క్రమంగా అంతర్భాగాలన్నీదాటుకుంటూ క్రిందికి దిగాడు. వెనుకొని జానకి దిగింది. లక్ష్మణుడు ధనుస్సు సజ్యంచేసి,తనచూపులు సర్వాణువుల లీనంచేసి నలువైపుల పరిక్రమిస్తున్నాడు. పర్వసమయాన సముద్రం పొంగినట్లు జనంముందుకు వచ్చింది.

## సీతారామలక్ష్మణులు రథమెక్కి వనమునకు వెడలుట

జయజయ ధ్వానాలు చేయవలసిన పౌరులు హాహాకారాలు చేస్తున్నారు. సుమంత్రుడు అతి కష్టంమీద రథంవద్దకు కొనివచ్చాడు. అగ్నిహోత్రంవలె వెలుగుతున్న బంగారు తాపిన రథాన్ని ముందుగా జానకి అధిరోహించింది. తర్వాత దాశరథి ఎక్కాడు. పిమ్మట సౌమిత్రి ఆరోహించాడు. మధ్యస్థంగా మైథిలి నిలుచున్నది. ఆమె వామాంశంవైపు సౌమిత్రీ, దక్షిణాంశంవైపు రామచంద్రుడూ నిల్చున్నారు. మహారాజు కంపితగాత్రంతో, కోడలికై కొనిరాబడిన సర్వాభరణాలు, వస్త్రాలు, పసుపు కుంకుమ మొదలైన స్త్రీజనోచితసంభారాలు ఎక్కించమన్నాడు. కవచాలూ, ఖడ్గాలూ, ధనువులూ, అస్త్రాలూ, చర్మం పొదిగిన గుద్దలీ, గంపా, పారా, అందులో వుంచారు. సుమంత్రుడు రథంబాగలపై కూర్చున్నాడు. సీతారామలక్ష్మణులు మస్తకన్యస్తహస్తులై అందరికీ నమస్కారాలు చేస్తున్నారు. ఇంద్రుని రథాన్ని మాతలివలె రామాదుల రథాన్ని సుమంత్రుడు తోలుటకు ఉద్యుక్తుడై చేతిలోనున్న చెబుకు పైకెత్తిఎడమచేత కళ్ళేలు లాగి ఝళిపించాడు. ఆ రథం అయోధ్యావాసుల ఆత్మలతో మహావాయు పథంలో అదృశ్యమైంది.

## రాముడు పోతున్నప్పుడు ప్రజలు దుఃఖించుట

సుమంత్రుడు గుర్రాలను అదలించినంతనే, మెదలు ముందుకు

చాచి, దీర్ఘంగా సకిలించి, నోటిలోని కళ్ళెమును నములుతూ, నురుసు నెలపుల వెంట కారుతుండగా నాల్గూ ఒక్కసారి చెంగలించుటతో "రథం భూమిపై నడుస్తూందా? వాయుపథంలో పోతూందా?" అని చూచేవాళ్ళకు సంశయం కలిగేలాగా పోసాగింది. పిల్లలనికానీ, వృద్ధులనికానీ, వయసువాళ్ళనికానీ, ఆడవాళ్ళనికానీ విచక్షణలేకుండా, మండుటెండలో, మలమల మాడిన ప్రాణికోటి నీటికోసం పరుగెత్తినట్లు రథంవెంట పరుగెత్తసాగారు. దగ్గరున్నవాళ్ళు తేరుస్తంభాలూ, పక్కలనున్న పూచలూ పట్టుకొని వ్రేలాడసాగారు. ఆవిధంగా కొంతదూరంపోయి వేగాన్ని మంత్రి హెచ్చించటంవల్ల పట్టుసడలి క్రిందికిజారి, ఘోరంగా ఏడుస్తూ—

"ఓ సుమంత్రయ్యా! నీ సొమ్మంతాపోయినట్లు ఆ గుర్రాలను ఆలా ఎందుకు అదలిస్తున్నావు? కాస్త మెల్లగాతోలు. నీకెంతో పుణ్యం వస్తుంది మమ్మల్నుదొరలనూ, దొరసాన్ని కళ్ళారా చూడనైనా చూడనీ. వడిగా తోలటానికి అక్కడ ఏం కొంపమునిగింది? తెల్లవారుజామునుంచీ మా పెద్దబాబయ్యను చూడాలనికని పెట్టుకునివున్నాం. సరిగాచూడనైనా చూడకముందే, నీపుట్టిమునిగినట్లు అలాతోలుకపోతున్నావేం? ఆపయ్యా! ఆపు. నీకు నమస్కారాలుచేస్తాం. మళ్ళీ ఎన్నాళ్ళకు చూస్తామో ఏమో. కళ్ళేలుకొంచెం వెనక్కులాగి పోనీయ్. ఇంతజనంఏడుస్తూ వెంటబడితే ఆపకుండా తోలటానికి నీది హృదయమా? రాయా? ఎండ కన్నెరుగని మా సీతమ్మతల్లికి ఎంత కష్టంవచ్చింది? ఎక్కడపుట్టింది? ఎక్కడ పెరిగింది? ఏంలాభం? ఈ పాపిష్ఠి కైకమ్మ కళ్ళల్లో నిప్పులుపోసుకుంది. అవేంవరాలు? వొట్టిదారిని కొడుక్కు పట్టంకట్టాలనుకుంది కాబోసు. ఈమె చెపితే ఆ చిన్నబాబయ్య ఎలాగూవినడు. ఇటు రాజ్యం దక్కదు. అటు సవతి మచ్చరంతో పెద్దవాణ్ని అడవికిపంపిందనే అపవాదుతప్పదు. మరి ఎందుకు ఈపనిచేసిందో ఈశ్వరుడికితెలియాలి. ఇంత ప్రజాఘోష వూరకపోదు. అయ్యయ్యో! మా దొరలు దూరమవుతున్నారు. మేం బ్రతకలేం. సీతమ్మా, లక్ష్మయ్యబాబూ ఎంత పుణ్యం చేశారో. మేరుపర్వతం సూర్యకాంతి వదలనట్లు రామయ్యను వీడకుండా వున్నది. మా లక్ష్మణస్వామిదే అదృష్టం. దేవుడులాంటి అన్నను

అహర్నిశలూ సేవిస్తూ వెంటనే వుంటున్నారు. మేం ఏం పాపంచేశామో రాకరాకవచ్చిన ఈఅవకాశం రాళ్ళపాలయింది. ఆయన తిరిగే అడివిలో ఎండిన మోడుగానైనా పుట్టంకాదు. రామయ్యలేనిఅయోధ్యలోవుండటం కంటే, ఆయనతో అడవిలోనేవుందాం" అంటూ కంటికి, మంటికి ఏక ధారగా ఏడుస్తూ పౌరులు రాముడుపోతున్న రథంవైపుగా పోసాగారు.

## దశరథుడు భార్యలతో శ్రీరాముని చూడవచ్చుట

రామప్రయాణసమయంలోకర్తవ్యతామూఢుడైనరాజుభార్యలతో అంతఃపురంవదలిక్రిందకివచ్చాడు. ఆవేళకే సుమంత్రుడురథంతోలుకుని పోతున్నాడు. తనపట్టూ బంధంలోపడ్డ గజరాజుకోసం కరిణీసహస్రం రోదిస్తున్నట్టు రోదనచేస్తున్న భార్యలతో, గ్రహణంపట్టినచంద్రుడులాగా వస్తున్న తండ్రినీ, తల్లులనూ, దాసదాసీ పౌర జానపదులనుచూచి, రాముడు సుమంత్రుణ్ణి తొందరగా తేరు తోలుమని హెచ్చరించాడు. ఆ హెచ్చరికతో మంత్రి గుర్రాలను కొరడాతో అదలించాడు. స్పర్శకి సహించని ఆ హయాలు చబుకుతాకులతో ముందుకి, తమ జవసత్వాలు చూపసాగాయి. రథం దూరమవుతున్నకొద్దీ రాజు రామవియోగం దుస్సహంకాగా, గొంతెత్తిబిగ్గరగా "సుమంత్రా! ఆపురథం.అబ్బాయిని చూడటానికి మేం వస్తున్నాం. ఆపు. ఆఖరిసారి మారామలక్ష్మణులనూ, మా సీతనూ చూడాలి" అంటూ అరిచాడు. ఆకేక రాముడువిని, వారి భావాలను అర్థంచేసుకుని, వారి దుఃఖాన్ని చూడలేక "అమాత్యవర్యా! ఆలస్యంచేయకు. తండ్రులు చేరవస్తున్నారు. ప్రజలు తండోప తండంగా బారులుకట్టి వస్తున్నారు. రథం పోనీయ్. వారిశోకాన్ని నేను చూడలేను. వారిఅనుమతికై ఎంతోకాలంగడిచిపోయింది. వారుసమీపిస్తే మన ప్రయాణం సాగదు. నామాట విను" అని తొందరపెట్టసాగాడు.

"తోలు తోలు" అని రాముడూ, "తోలకు తోలకు"అని రాజూ, అంటుంటే, ఏంచేయాలో తోచక మంత్రి క్షణకాలం నిశ్చేష్టుడైనాడు. ఆ సమయంలో, రథాశ్వఖురపుటనంతో, పొంగి, విరిగిపడి వస్తున్నప్రజా పాద సంఘాతితో రేగిన దుమ్ము, రామవిశ్లేషదాఘోపహతమై, క్షణక్షణ

ప్రవృద్ధమానమవుతున్న కన్నీటిజల్లుకు అదిగిపోయి బురద బురదగా ఆప్రదేశమంతా మారిపోయింది. నీళ్ళల్లోనుంచి వెలికి వేయబడినచాపల్లాగా అయోధ్యావాసులమనస్సులు విలవిల లాడిపోతున్నై. అంతబుద్ధిసూక్ష్మత గల ఆమాత్యుడు, రథం రామునిమాట చొప్పున తోలాలో, రాజుమాట ప్రకారం ఆపాలో తోచనిస్థితిలోవుంటే, రాజూ, రాణులూ, భోరుభోరు మని ఏడుస్తూ రథాన్ని సమీపించలేక దైవాన్ని నిందించటం సాగించారు. "ఇంత అనర్థానికి నేనేకదా కారణం, నేను జీవించటం భూమికిభారం. నానుంచి ఎన్నిలక్షల ప్రాణులు అన్నాహారాలుమాని, "అలో లక్షణా!" అని ఏడుస్తున్నై. బ్రతికి నేను చూడవలసింది రామపట్టాభిషేకం. అదిభంగమైంది. ఇక ఈబ్రతుకుచాలు. రామా! రామా! శ్రీరామా! ఇదుగో వస్తున్నాను. ఈశరీరంతో కాదు. సూక్ష్మశరీరంతో వస్తున్నాను. నిన్ను చూడక నే జీవించలేను. నీవు లేకుండా, నే వుండలేను" అంటూ, రాజవీథిలో, కటిక నేలపై పడిపోయాడు.

ఆ రాజుపాటులో అంతా స్మృతి హీనులైనారు. అన్యాయంగా అడవులకు నెట్టబడ్డ రామాదులకోసమే, ఇళ్లా, వాకిళ్లా వదలివచ్చి ఏడుస్తుంటే, మూలిగే నక్కపై తాటిపండు పడ్డట్లు రాజు కాస్తా ప్రాణాలు వదిలాడేమోనని అంతా హాహాకారాలు చేస్తూమూగి, "అమ్మా! కౌసల్యాదేవీ! రామచంద్రా!" అంటూ పిలువసాగారు. ఇదంతా చూస్తూనే వున్న శ్రీరాముడు చూచీ చూడనట్లుగా చూచి, గట్టిగా సారథిని రథంతోలమని చెప్పాడు. కట్టుకొయ్యకు బంధింపబడ్డ లేగదూడకై పొలంనుంచి ప్రొద్దుకూకేవేళ అంభారవంతో పరుగెత్తే ఆవులాగా, ఆముసలిదేహంతో రథం వైపు పరుగెత్తుతూ, "నాయనా! రామా! నేను నీతల్లిని. కౌసల్యను. కనిపెంచిన తల్లికి ఇదేనా నీవిచ్చేకానుక? నడివీథినపడి నీకోసం ఏడుస్తుంటే కొంచెమైనా నీ మనస్సు మెత్తపడ్డంలేదా? తండ్రీ! సౌమిత్రీ అన్న మాటకే ప్రాముఖ్యం ఇచ్చావు. ఈముసలిఅవ్వ మాటకు విలువ నీయటం లేదు. నేచేసిన పాపం ఏమిటి? నీపట్ల ఎన్నడైనా రామయ్య కంటే భిన్నంగావున్నానా? నీవైనాచెప్పి ఆపించరాదా? తల్లీ! జానకీ! నీకైనా కనికరంలేదా? నీమాటన్నా వింటాడేమో. సుమంత్రా! పూజ్యురాలైననీ

తల్లివలె నన్ను చూస్తివే. ఇప్పుడు ఆ గౌరవం, ఆ ప్రేమా ఏమైనవి? ఒకరిని అనుమానించ పనిలేదు. ఇదంతా నేను చేసుకున్న పాపఫలమే. అనుభవించక తప్పదు. నాయనా! సుమంత్రా! ఒక్క క్షణం ఆపు. ఇంతలోనే కాలాతిక్రమణం జరగదులే" అంటూ వెంటబడివస్తున్న రామమాతను సుమంత్రుడు చూశాడు. పగ్గాలు వెనక్కు లాగాడు. "ఏమి ఈ దైవసంఘటనం? ఏమి ఈ ధర్మాధర్మాల మధ్య సంఘర్షణ? ఏమి ఈ పుత్రభ్రాంతి? ఏమి ఈ కఠిన మార్గానుసరణం? ఇందులో దోషం ఎవరిది? యుద్ధంలో భర్తను కాపాడటం భార్య తప్పా? మేలుచేసిన ఆమెను మెచ్చి, రాజధర్మానుసారంగా రెండు వరాలు కోరుకోమనటం ధర్మ తప్పా? ఆ కోరిక ఇప్పుడే కోరాలా అంటే, ఎప్పుడైనా కోరవచ్చు కదా? అది లోకసమ్మతంకానికోరిక అనుకుంటే, ఒకరికిమంచి వేరొకరికి చెడ్డ. ప్రాణికి ప్రాణి ఆహారంగా జరిగిన సృష్టిలో ఇతర ప్రాణులకు బాధలేకుండా ఎలా సాగుతుందీ?

"అయితే మనిషిని మనిషి తింటున్నాడా?" అని అనుభవం లేని వారు ఆశంకిస్తారు. మృతదేహాన్ని తినేవారు కొందరున్నారు. రాక్షసు లంతా మానవభక్షకులు. మానవుల్లో మానవులు శరీరశ్రమను తింటారు. మానసిక శ్రమను తింటారు. తన బ్రతుక్కు ఇతర జీవిశ్రమను గ్రహించటమే తినటం. పైగ ఆ విధంగానే తనకై రాజకుటుంబాన్ని తిన్నది. లేడి పచ్చగడ్డిని మేటానికి చంపదా? పదవులకై ఎందరు ఎన్ని ప్రాణాలు తీయటంలేదు? ఆ తీసేవారు బలవంతులై, అధికారంలో వుంటే ఇటువంటి ప్రశ్నలు వారినివేయరు. వేస్తే వేసినవాళ్ళుకూడా చస్తారు. అప్పటికి అదే ధర్మమని అంగీకరిస్తారు. ఈ దృష్టితో కైక దోషం కనిపించటంలేదు. ఇక వరాలిచ్చిన ప్రభువు సంగతి చూస్తే, తరతరాలుగా వస్తున్న ఆచారాలను 'తు' 'చ' తప్పకుండా అనుసరిస్తున్నాడు. ఆ ఆచారాల్లో, ప్రత్యక్షంగానైనాపరోక్షంగానైనా, ఆడితప్పటం లేకుండా వుండటం ఒకటి. అది నిలుపుకుంటకే రాము వనవాసం అంగీకరించాడు. ఈ మోహం మోహం తెగనొక్కరాయా, ఈ ఏడ్పులూ, పెడబొబ్బలూ శరీరధర్మాలు. అవి ఎంతవానికీ తప్పవు. ఒక పూజ్యుడు

శరీరబాధతో పుండేగోవును చంపమన్నాడు. ఆయన అహింసావ్రతం కలవాడు. ఎంత వ్యామోహపీడితుడైనా, అన్నమాటకే కట్టుబడ్డాడు. కనుక ఆయనదోషం కనిపించటంలేదు. ఇక రామునివైపు ఆలోచిస్తే—

కర్మఫలం అనుభవించటానికి హేతువైన శరీరాన్ని ఇచ్చింది తల్లిదండ్రులు. వారి సుఖసంతోషాలు చూడటం పుత్రధర్మం. ఆధర్మాన్ని అక్షరాలా పాటించాడు. తనను రాజును చేస్తానని ముందు చెప్పాడు కదా? ఆ తర్వాతనే కైకవరాన్ని చెల్లించాడు. కాబట్టి మొదటిమాట ఏమైంది? రాజు మొదట మాట ఇచ్చింది కైకకు. రామునికి కాదు. అది కాలాంతరంలో మరచి ఈమాట చెప్పాడు. చెప్పినప్పుడు ఒకవేళ గుర్తున్నా భరతుడు కోరితేగాని అతనికి సంక్రమించదు. భరతుడు లేడు కైక తానై కోరదు. అందుచే రామునికి పట్టంకట్టేసంగతి చెప్పాడు. కైక వరాలు కోరటంతో ప్రబోధింపబడి తనతప్పు తెలుసుకుని మొదటిమాటనే ముఖ్యంగా భావించాడు. ఆమాటే రాముడూ పాటించాడు ఒకవిధంగా చూస్తే రాజును అసత్యపంకిలంలో పడకుండ కైకేయియే కాపాడింది అనవచ్చు.

ఇప్పుడు నాసంగతేమిటి? రాజు ఆపమంటున్నాడు. రాముడు రథం తోలమంటున్నాడు. తోలటమా? మానటమా?" అని దీర్ఘంగా ఆలోచిస్తూంటే రథగమనం మందగించింది. రాముడు సుమంత్రునిచూచి "మా తల్లిదండ్రుల బాధపడలేక రథం ఆపుతున్నావు. ఆపవద్దు. దీనివల్ల మేలుకంటె కీడే ఎక్కువ. తల్లిదండ్రులు వికలులైవున్నారు. నన్ను పోవద్దనరు కాని, పోనీయరు. నామాటకు విలువపోతుంది. నేను అనృతభాషిని అవుతాను. పౌరులు బలవంతంచేస్తారు. ప్రజాభిమతానికి విరుద్ధంగా నేను ప్రవర్తింపలేను. అప్పుడు తండ్రిమాటా, నామాటా, నీళ్ళలోమూటా ఒకటే అవుతుంది. రథం తొందరగా తోలు. మానాయన నిన్నుఎందుకు ఆపలేదు? నామాట ఎందుకు అతిక్రమించావని అడిగితే, రథవేగంలో వినబడలేదని చెప్పు. ఇది అసత్యంకాదా? వంచనకాదా? అంటే, అవును; కాదుకూడా. ఎందుకుకాదో చెపుతావిను. ఆయన ప్రథమావేశం మమ్మల్ని అడవికితీసుకొనిపోయి విడచిరమ్మని. ఇక వినపడలేదంటంలో అనృతంవల్లవచ్చే పాపం నీకు రాదు. స్వార్థంతో, దుర్బుద్ధితో నీ విధి

చేయటంలేదు. సత్యాన్ని కాపాడటంకోసం, భవిష్యత్తులో భూతహితం కోసం నీవీమాట అంటున్నావు. అందువల్లవచ్చే సత్ఫలమంతా నీదే.

అనుమానం వదలిపెట్టి అరదం పోనీ" అన్నాడు. సుమంత్రుడు వెంటవస్తున్న పౌరులను అనునయించి, కళ్ళేలు సడలించి, గుర్రాలను అదలించాడు. వాటి గమనవేగంలో రథం కనుమరుగైంది. రథం కనబడకుండా పోయినా, ప్రజలుమాత్రం మరలిపోవాలనేమాట మరచి ముందుకు పోతున్నారు. మంత్రులు "ప్రభూ! మరల త్వరలో వచ్చేవారిని పంపేవేళ బంధువులు మిక్కిలిదూరం పోకూడదు. ఆగి ఇక వెనకకు మరలండి" అని చెప్పారు. యుక్తియుక్తంగా, సమయోచితంగా వున్న వారి మాటను రాజు మన్నించి, తేరు పోయిన దారివైపుచూస్తూ ఆగిపోయాడు.

## అంతఃపురకాంతలు రామునకై వగచుట

అయోధ్యానగరం వదలిపెట్టారన్న సంగతి తెలిసి, అంతఃపురాంగనలు ఆపుకోలేని ఆవేదనతో అనురాగం పొంగి పొరలగా, "ఎవడు అనాథులకు గతియో, ఎవడు దుర్బలులకు సంరక్షకుడో, తపస్వినులకు శరణం ఎవడో, ఆ జగత్పతిగతి చెడినవాడై ఎక్కడికిపోతున్నాడో? ఆ మహారణ్యాలల్లో ఎలాసంచరిస్తాడో? ఆ సీత, పరమ సుకుమారి. ఆ ఎండలూ, వానలూ, ఆ సుడిగాలులూ, కారుచిచ్చులూ ఎలా తట్టుకుంటుందో? తల్లినీ, భార్యనూ వదలివెళ్ళాడు పాపం సౌమిత్రి. అన్నకూ, వదినకూ ఆగ్రహం రాకుండా ఎలా నడుచుకుంటాడో? చూస్తూండగానే ఎంత వైపరీత్యం జరిగింది? ఎవరేమన్నా మనసులో పెట్టుకొనకుండా, నవ్వుతూ మంచిమాటలతో మనసు మార్చేవాడమ్మా. అంతేనా? ఇతరుల కష్టాలు తనవిగా చూచుకుని, తక్షణంవాటి నివారణం చేసేవరకూ నిద్రపోడమ్మా. కన్నతల్లికన్నా మనలను ఎంతో ప్రేమతో చూచేవాడు. అరమరికలేకుండా అన్నిసంగతులూ చెప్పేవాడు. వుండు నాయనా! అంటే వుండేవాడు. అంత పేరు ప్రఖ్యాతులు కలవాడైనా, అంత వీరాధి వీరుడైనా, ఇంతైనాగర్వం వున్నదమ్మా? అలాటివాడు

మాయలమారి కైకమ్మమాటకై అడవికిపోవటం మనఅందరి దురదృష్టం. ఆమెననటం దేనికి? మన బంగారం మంచిదైతే స్వర్ణకారు దేమిచేస్తాడు? రాజుబుద్ధి పాడుచేసుకోకపోతే ఇంత అవకాశం ఆమెకెక్కడవస్తుంది?" అని పరస్పరం చెప్పుకుంటూ శోకించసాగారు. ఆగిపోయిన రాజూ, దేవేరీ, మంత్రులూ, వెనుదిరగకుండా అక్కడనే ఆగిపోయారు. అందరిలోనూ ఆ దుస్సంఘటన పునరావృతం అవుతున్నది.

గృహస్థులువంటపటం మరిచారు. అగ్నిహోత్రం సమయం అతిక్రమించిందని అనుకోరు. పనిపాటల నిమిత్తం భావంలేదు. పోయేవాళ్ళు కూడాలేరు. సూర్యమండలం మసగుపడింది. తిండిమాని ఏనుగులు కన్నీరు కారుస్తున్నై. ఆవులు పాలకై వచ్చిన లేగల పొదుగులలోమూతి పెట్టనీయడం లేదు. మొదటగా మగవాడు కలిగిన సంతోషం ఏ తల్లీ పొందటంలేదు. చంద్రుణ్ణి గురుడూ, బుధుడూ, అంగారకుడూ, త్రిశంకువూ ఆక్రమించారు. నక్షత్రాలూ, గ్రహాలూ కాంతిరహితాలైనై. విశాఖానక్షత్రం పొగతో ఆవరింపబడింది. పెనుతుపానులో సముద్రం కల్లోలం పొందినట్లు అయోధ్యానగరం సంచలించింది. చీకట్లు దిక్కుల ఆవరించుకున్నై. ఆకాశమే ఏ ప్రకాశంలేక శూన్య శబ్దానికి అర్థమైంది. ఆ నగరవాసులు ఆహారంపట్లా, విహారంపట్లా, సాహంపట్లా ఆసక్తి కనబరచటంలేదు. ఉత్సాహరహితమై, కళాహీనమై సంతోష శూన్యమై, కాటువేసినా నెత్తురు చుక్కకు కరువుగా పౌరజనం మారిపోయింది.

గాలి వేస్తూంది కాని, చల్లగా, హాయిగా కాదు. నిప్పు మండుతున్నదే కాని, వేడిగాకాదు. సూర్యుడు వెలుగుతున్నాడే కాని, తప్తంగా కాదు. చంద్రుడు కాంతి నిస్తున్నాడే కాని, అందులో చల్లదనంలేదు.

తల్లినిచూసి పిల్లలు పాలకోసం ఏడ్వరు. భార్యాభర్తలు, అన్నతమ్ములూ, తండ్రీకొడుకులూ, గురుశిష్యులూ, ఒకరినిఒకరు నియంతగా చూచే మనస్సును రామునిలోనే లయంచేశారు. అందుచేత అంతా జడులైనారు. రామచంద్రునిహితవర్గం శరీరాలు శయ్యలపై పున్నవి. మనస్సు మాత్రం మిత్రునిలోనే పోయింది. వజ్రపాణికికొండల్లాగా పురం వణికింది.

## దశరథుడు తిరిగి గృహానికి పోవుట

రథగమన వేగంలో రేగిన ధూళి కనుపించేదాకా దశరథుడు రెప్ప వాల్చకుండా చూచాడు. "వృద్ధుడు రాముని ఎడబాటుతో బ్రతుక్కుండు గాక" అన్నట్లు, ఆ ధూళికూడా చాలాదూరం వరకు దట్టంగా రేగింది. ఆ ధూళి అదృశ్యం కాగానే రాజు "హా! రామా! పోయావా? నా ప్రాణాన్నికూడా ఎందుకు కొనిపోకుండా పోయినావు?" అంటూ పల్లటిల్లి పడిపోయాడు. అనుసరించివున్న కౌసల్య కుడిప్రక్కనూ, కైకేయి ఎడంప్రక్కనూ పట్టి లేవనెత్తి, వుపచారంచేయగా, తేరుకుని, కైకను చూచి, కన్నులు నిప్పులుమియగా, వ్యధాగ్నిచే కడుపుమండగా "ఓసీ! దుర్మార్గురాలా! మేకవన్నె బెబ్బులీ! యశోఘ్నీ! పొమ్మావలకు-నన్ను అంటకు-ఛీ! ఛీ! నీ మొగంచూస్తే అసహ్యం వేస్తూంది. నీవు నాకిక భార్యవుకావు. నీ బంధం నాకు ఎంతమాత్రం ఇకలేదు. నీవు నాప్రక్క వుండటం ఎంతమాత్రం సహించలేను. నీవు బ్రతికి వున్నంతకాలం నీవారంతా నాకుశత్రువులు. నేను జీవించినంతదాకా వారికి నేనూలంతే. నీవు కేవలం స్వార్థపరవు. క్లిష్టధర్మవు. అనురాగంతో ఇచ్చిన వరాలు అన్యాయంగా, అధర్మమార్గంగా, అతిదురాగతంగా అర్థించావు. దేవతల సాక్షిగా నన్ను సత్యపాశబద్ధుణ్ణి చేశావు. నా కంఠాన్ని పాముగా చుట్టుకున్నావు. నా వంశదీపకుణ్ని వనవాసం పంపావు. అగ్నిసాక్షిగా వివాహసమయంలో గ్రహించిన నీ హస్తాన్ని విడిచిపెట్టాను. నీకు ఇహంలోనేకాక పరంలోకూడా భర్తృసేవాఫలం రాకుండా నిషేధించాను. నీకు పుట్టినవాడు కనుక నీతిలేక భరతుడు రాజ్యంపాలించినా, నా మరణసమయంలో ఇచ్చిన నివాపాలు (తిలోదకాలు) నాకుగాక అన్యులకు చెందుగాక" అంటూ దుమ్ములోపడి కొట్టుకుంటున్న రాజును కౌసల్య మెల్లగా ఒడిలోనికిచేర్చి, దుమ్మంతాదులిపి, వుపచార వాక్యాలను చెప్పపోతుంటే, కైక అభిమానంతో రోషంగా రాజునుచూచి,

"రాజా! ఇది రెండోసారి. నన్నూ, నా కొడుకునూ, బంధువులనూ విడిచిపెట్టానని చెప్పడం. నాకు భర్తసేవలో వచ్చేఫలం నిషేధించటం.

దీనికి నేనేమీ విచారపడదలుచుకోలేదు. నాకు నీసేవలో వచ్చే ఫలం కంటే, నీప్రాణరక్షణవల్ల వచ్చే ఫలం, నిన్ను నరకకూపానికి త్రోసే అసత్య దోషాన్నుంచి కాపాడిన ఫలంచాలు. ఈ లోకంలో వచ్చే కీర్తి ఏపాటి? అనుకూలిస్తే మంచి, వ్యతిరేకిస్తే చెడ్డ. దుస్స్వార్థభూయిష్ఠమైన ఈ మానవలోకం గుడ్డిగా ఇచ్చే గౌరవా గౌరవాలు నాకక్కరలేదు. ఈకీర్తిప్రతిష్టలూవద్దు. నాఆత్మ ధర్మమే నాకు సాక్షి. శ్రుతిధర్మమే నాకు ఆచరణీయం. పారమార్థిక దృష్టికీ, క్షుద్ర లౌకిక దృష్టికీ ఎంతో అంతరం వుంది. నీవు నన్ను త్యజించినా, నిన్ను నేను త్యజించను. నీవు అతి సంసారలంపటుడవు. నీకు లౌకికంమీదవున్న మమకారం, సత్య ధర్మాచరణాలమీదలేదు. ఇంతకాలంనిన్ను సత్యవంతుడుగా, ధర్మప్రభువుగా లోకం గౌరవించిందంటే అందుకు కాలం అనుకూలించటమే ముఖ్యకారణం. ఆ కాలం ఇప్పుడు వ్యతిరేకించేసరికి నీ నిజరూపం బయటకు తెలిసింది. నా లౌకిక జీవితాన్ని త్యాగంచేసి, విషసిక్తశోకం లాగా వున్న నీ మనోలోకాన్ని శాసనంచేశాను. నీకు వుత్తమలోకస్థానం కల్పించాను. నీ ప్రేమగల కొడుక్కు నీవుచేయలేని, నీవల్లగాని, శాశ్వత యశస్సూ, సత్యసంధతా, మనోనిగ్రహం సంపాదించిపెట్టాను. ఆ లీలా మానుష విగ్రహుడు దుష్టశిక్షణా, శిష్టరక్షణా చేసి, లోకకల్యాణం కలిగించే అవకాశంకల్పించాను. నీవుగానీ, లోకంగానీ, నన్ను దూషించినా, భూషించినా, అదంతా వాళ్ళ సంస్కారంవల్ల వచ్చిన ఫలమేనని, నేను నిశ్చింతగా నా ధర్మంలోనే వుంటాను. కౌశికునికి ఇచ్చిన వాగ్దానం సులభంగా నెరవేర్చావా? ఆయన ఆగ్రహిస్తేనే కదా రాముణ్ణి పంపావు. సామాన్య రాకుమారునిగా కొనిపోయి అసామాన్య వీరునిగా, కల్యాణరాముణ్ణిగా నీకు అప్పగించినట్లే, నా మూలంగా అడవికి పోయినరాముడు, త్రిజగదభిరాముడుగా, సర్వలోక క్షేమంకరుడుగా, తిరిగివస్తాడు. శుష్కవాగ్దానాలు అన్నివ్వడట్లా కలిసిరావు. అధికారంలో అణచిపెట్టినా, అనంతరం వ్యక్తినే తింటై. అనదగినవాడివి కనుక అన్నావు, పడదగినదాన్ని కనుక పడ్డాను. ఇందులో దోషాదోషాలు తెలిసి ఏలుకుంటావో? పరిత్యజిస్తావో నీఇష్టానికేవదిలివేస్తున్నా" నని ప్రక్కకు తప్పుకున్నది. రాజు ఆమె మాటలు పట్టించుకోలేదు. అంతకంతకు

దుఃఖం అతిశయంకాగా, సంధి రోగివలె కొంతసేపు తననూ, కొంతసేపు కైకనూ దూషిస్తూ, నడుమ నడుమ "అయ్యో! రాముని గొనిపోయిన గుర్రాల అడుగులు కనిపిస్తున్నై కాని, రాముడుమాత్రం కనపడ్డంలేదు. ఆ మధుర వాక్కులు వినబడుతున్నై కాని, ఆ మూర్తి కనుపించటం లేదు. నా బ్రదుకెట్లా తెల్లవారుతుంది?

అయ్యయ్యో! దాసదాసీ జనసపర్యల్లో హాయిగా సుఖించే నాబిడ్డ, అడవుల్లో ఎలా సుఖపడతాడు? మృదుహంస తూలికాతల్పంపై, పట్టు తలగడమీద తలవుంచి పండుకునే నాతండ్రి, చేయో, రాయో, దిండుగా ఎలా శయనిస్తాడు? వందిమాగధస్తుతులతో మేల్కొనే నా నాయన, భయంకర మృగధ్వానాలతో మేలుకొంటాడా? విశ్వ విశ్వంభరా జీవ కోటికి దిక్కైన నా కొడుకుకు దిక్కే లేకుండా పోయిందా? ఓసి విధవా! ఈ రాజ్యం నీవే తలగట్టుకో! ఈ శ్మశానాన్ని నీవే ఏలుకో!" అని ప్రేలుతూంటే, కౌసల్య సహాయంతో, పరిజనం వెంటరాగా, మంత్రులు రాజమందిరానికి రాజును చేర్చారు. జనరహితంగా వున్న ఇండ్లూ, చావడులూ, మూతలుపడ్డ దేవాలయాలూ, కోళ్ళూ, పక్కలూ, పశులూ సంచరిస్తున్న అంగళ్ళూ, వీధులూ చూస్తూ, జనసముద్రంలాగా, నిత్య కల్యాణం, పచ్చతోరణంలాగా వుండే ఆ మహాపట్టణంలో రాజొక్కడే వున్నట్లుగా భావించుకుంటూ, మృతస్నాతుడువలె ముసలిరాజు మంచం పై కూర్చున్నాడు. ఆమందిరం రాజ రహితమైన సింహాసనంగా, జల జంతువులచే క్షుభితమవుతున్న హ్రదంలాగా, తోచింది. సీతారామ లక్ష్మణ విహీనమైన ఆ ప్రాసాదంలో తన వునికి, మబ్బు చాటునవున్న సూర్యుని చందంగావుంది. తన ప్రాణం, గరుత్మంతుని పాదాల్లో చిక్కుకున్న పాములాగా కొట్టుమిట్టాడుతూంది. అతనికి ఆ స్థితి దుస్సహ తప్తంగా పరిణమించింది. పూడిన గొంతుతో, మందంగా వస్తున్న మాటలతో, తన ప్రక్కలవున్న వారిని పిలిచి "నా కిక్కడ శాంతి లేదు. కౌసల్య ఇంటికి కొనిపొండి. ఆమె రాముని కన్నతల్లి. ఆదరంతో నన్ను చూస్తుంది. నా కిక్కడ విశ్వాసం నశించిపోయింది. జరిగిన సంఘటనలు తలంపులోకి వస్తున్నై" అని చెప్పాడు.

# రాజు కౌసల్య ఇంటికి పోవుట

అక్కడవున్నవారిలో మార్గదర్శకులు ముందుకువచ్చి, చేయూతతో క్రిందికి దించి, పల్లకిలో కూర్చుండబెట్టి, పదిలంగా మాటిమాటికీ చూస్తూ, నగరిలో మెల్లంగా పెద్దదేవి ప్రాసాదానికి గొనిపోయారు. అక్కడ కూడా అంతా శూన్యంగా వున్నది. పూర్వంవలె ఆహ్వానాలు లేవు. ఎదురు కోళ్ళు లేవు. గొనివచ్చినవాళ్ళే శయనమందిరంలో తల్పంపై చేర్చారు. క్రమక్రమంగా వాళ్లుకూడా వెళ్ళిపోయారు. "నన గడచిన జీవితం ఎటువంటిది? ఇప్పుడు ఈ జీవితం ఎటువంటిది? విశాలవిశ్వాన్ని ఎదురు లేకుండా పాలించిన నేను, ఇంద్రాదులైనా అనుభవించని సుఖాలను అనుభవించిన నేను, ఆలనా, పాలనాలేని నికృష్టజీవితం గడపవలసివచ్చింది. కైక కఠినంగా చెప్పినా, సత్యమే చెప్పింది. భరతుణ్ణి పిలిపించినతర్వాత పట్టాభిషేకం తలపెడితే నిర్విఘ్నంగా సాగేది. వాడు ఈ దుర్మార్గాన్ని సహించడు. నా బిడ్డలకూ, కోడలికీ ఈ దురవస్థ వచ్చేదికాదు. నలుగురిలో నా ప్రతిష్ఠమాత్రం ఏందక్కింది? అది మొగాన అన్నది. లోకులు చాటున అనుకుంటారు. నా నీడను నేనే అనుమానించాను. నా కొంపను నేనే నిప్పంటించాను. ఈ వార్ధక్యంలో నాకీ వ్యామోహం ఎక్కువకావటం ఇంద్రియాలపై అధికారం లేకనేకదా? కైక గట్టిగా బుద్ధిచెప్పింది. ఏది ఏమైనా, రాముడువచ్చేదాకా ఈ శరీరం నిలువదు. బిడ్డల్ని చేర దీసుకుని కష్టసుఖాలు ముచ్చటించుకుంటూ కాలంగడిపే యోగం నాకు లేదు. ఆ అదృష్టవంతులెవరో వుంటారు. వారే ధన్యజీవులు. వారి పాదధూళితో అయోధ్య పవిత్రమవుతుంది" అని అనుకుంటూ, రాజు దుఃఖిస్తూండగా, భూపతిపాలిటి కాళరాత్రిలాగా, రాత్రివచ్చింది. తీతువుల కూతలూ, గబ్బిలాల రొదలూ, కీచురాళ్ళ ధ్వని, దూరంగా నక్కల అరుపులూ, అరువుబండిపై పేవతట్టవలె శోకభారంతోవున్న రాజుమనస్సును గగ్గోలుపరుస్తున్నై. ఆ ఆందోళనలోనే, "దేవీ! దేవీ! ఇటురా. ఎక్కడ వున్నావో కనబడటం లేదు. నాచూపు రామునితోనే పోయింది. తిరిగి రాలేదు. నీవేవచ్చి చేతితో తాకు. నేలేవలేను. లేచి నిన్ను గుర్తించలేను" అని విషాదవిహ్వలమైన హృదయంతో పిలిచి అన్నాడు. గాలిపోయిన బంతివలె నేలబడివున్న కౌసల్య భర్తనుచేరి ఏడుస్తూ, ఇలా తనబాధ వెళ్ళబోసుకుంది.

## కౌసల్య కొడుకును తలచుకుని భర్తతో చెప్పి ఏడ్చుట

"అయ్యో! నాథా! ఈ కడుపుశోకం ఎలా భరించేది? ఆ కైకమ్మ కడుపులో విషమంతా నా బిడ్డపై వెళ్ళగ్రక్కి, కుబుసం విడిచిన నాగు పాములాగా వున్నది. తనపట్టు నెగ్గించుకున్న, లబ్ధకామయైన చిత్తంతో ఎంతెంతలేని పనులు చేస్తుందో అని భయం కలుగుతున్నది. పడగ విప్పిన పామునైనా చేరవచ్చునేమోకాని, ఈ కైకను సాత్వికగా భావించటం సరికాదు. ఇంత మమకారం వున్న మీరు బిడ్డ వనవాసాన్ని ఎందుకు అంగీకరించారు? రాజ్యం ఇచ్చినా, వాళ్ళ సేవచేస్తూనైనా, కలో, గంజో త్రాగి బిడ్డ, నేనూ ఇంటిలో పడివుండే వాళ్ళం కదా? మీరు అప్పుడప్పుడూ వచ్చి చూచిపోయేవారు కదా? ఈ వరం ఇచ్చి మీరేమి బావుకొన్నారు? యజ్ఞార్థమై సమర్పించిన పురోడాశనం రాక్షసులపాలు చేసినట్లు, తొమ్మిది నెలలు మోసి, ఇరవై అయిదేండ్లు సాకి, ఈనగాచి నక్కలపాలు చేసినట్లు కైకమ్మ మూలాన అడవుల పాలు చేశాను కదా. వెనుకటి జన్మలో ఏ తల్లీ బిడ్డల ఎడబాటు చేశానో ఈ జన్మలో అనుభవిస్తున్నాను. చిన్నతనంలో కొడుకూ, కోడలూ ముద్దుముచ్చటలు అనుభవిస్తుంటే చూచి సంతోషించే యోగం మీకూ నాకూ కూడా లేకుండా చేశారు. పొడుపుకొండపై సూర్యుడు లాగా, రథంమీద వచ్చి, చెవుల రత్నకుండల కాంతులు లేత బుగ్గల మెరిపింపగా, వామ భుజంపై చాపం ధరించి, కటిమండలంలోని ఖడ్గం వ్రేలాడుతుండగా, పాదాభివందనం చేస్తున్నట్లే కనబడుతున్న బిడ్డను మరచిపోవటం ముసలి తల్లికి సాధ్యమవుతుందా? దండకావాసం పూర్తి చేసి, తమ్మునితో, దారతో తిరిగివచ్చి అయోధ్యలో ప్రవేశిస్తుంటే, ప్రజలంతా జే పెట్టుకుంటూ ఎదురుపోయి, మంగళ వాద్యాలతో తీసుకుని వస్తుంటే చూచే అవకాశం నాకీ జన్మంలో వస్తుందా? మా రామయ్యకు బ్రాహ్మణ సుమంగళులు ఫలాలూ, పూలూ, నివాళులు సమర్పిస్తుంటే కన్నుల పండుగ్గా కాంచగలనా? అన్నికోర్కెలూ, "జీర్ణమంగేసుభాషితమ్" అన్నట్లు నాలోనే నశించి పోతాయా? సింహం నోటికి బిడ్డను చిక్కించి కళ్ళనీళ్ళ కార్చే గోవులాగా, కైకమ్మ వరానికి కన్నబిడ్డను అప్పగించి కడుపు శోకంతో బ్రతికిన నాల్గు రోజులూ ఏడ్వవలసిందే కదా? గ్రీష్మకాలంలో మధ్యాహ్నవేళ మార్తాండుడు భూమండలాన్ని

కాల్చినట్లు, నన్ను దుఃఖం కాలుస్తున్నది. నా బ్రతుకు వ్యర్థం. నేను ముసలిదాన్ని. మీకు సేవచేసే ఓపిక కూడా నశించింది. ఇద్దరం ఏమవుతామో ఏమో, ఆ దైవం బిడ్డలు వచ్చేదాకానైనా అసువులు నిల్పితే అంతేచాలు. చేతులు కాలింతర్వాత ఆకులు పట్టుకున్నట్లు అయింది" అంది.

## సుమిత్ర అక్కను ఓదార్చుట

ఆ విధంగా ఆత్మేశ్వరుడితో చెప్పి ఏడుస్తున్న అక్కను చూచి, అన్వర్థనామంగల సుమిత్ర, ధర్మబద్ధంగా, సవినయంగా, సార్థంగా చెప్ప సాగింది. "అక్కా! ఎంత అమాయకురాలవమ్మా? నీవు అందరు తల్లుల వంటి తల్లివి కావు. అందరు బిడ్డలవంటి వాడు కాడు నీ బిడ్డడు. గుణ సముద్రుడు. అపరాజితుడు, పురుషోత్తముడు, అట్టివాడికై అనార్యవలె విలపించటం ఏమి బాగున్నదమ్మా? రాముడు వనవాసానికి ఎందుకు ఇష్ట పడ్డాడో చెప్పాడు కదా? తండ్రిని సత్యవాదిని చేయటానికేనని. మన భర్త సత్యవ్రతుడైతే వచ్చేఫలం సగం మనకు వస్తుందా? రాదా? ఆయన్ను భర్తగా పడసిన ఆడవాళ్ళు అదృష్టరాండ్రని అశేషజనం అనుకోదా?

మోక్షప్రాప్తికై పెద్దలు నడిచే దారిలో మన ముద్దుబిడ్డలు నడుస్తుంటే మనకు ఆనందం కాదా? ఇందులో ఏమి దోషముందని ఏడ్వటం? అప్రమాదబుద్ధి లక్ష్మణుడు. అఖిలభూతకోటి అతని కారుణ్యంలో కరిగి పోతుంది. ధనుర్ధరుడై, పూజ్యులైన అన్నావదినల పరిరక్షణలో వున్నాడు. అతని కన్నా మించి వారికి ఆపద ఘటించే శక్తి నభూతో నభవిష్యతి. సర్వజ్ఞుడైన జనకరాజర్షి బిడ్డ కోడలు సీత అడవులలో వుండే కష్టసుఖాలు ఆమాత్రం తెలియకనే వెంటపోయిందా? సతీత్వంతో భర్తకు రక్షా కవచం కల్పించటానికే. ఆగ్రహం ఎరుగని రామయ్య నిగ్రహిస్తే భూత కోటికి అభయం ఇచ్చే ప్రాణి ఎక్కడవుంది? రాముడే ప్రభువవుతాడు. వాడి కీర్తిధ్వజం విశ్వాంతరాళాల్లో ఎగురుతుంది. శత్రువునైనా శరణంటే కాపాడే క్షమామూర్తికి సామాన్యులకు వలె సంకటస్థితులు ఎందుకు వస్తాయి? రాముని పవిత్వం ముందు, రవిఖరకిరణాలు సమోష్ణంగా మారుతై. బ్రహ్మ చర్యవ్రతధారియై, యోగనిష్ఠలో సాధించిన శక్తిలో నిండివచ్చే ఊర్పుల ముందు ప్రళయ ప్రభంజనం శీతలంగా వీస్తుంది. తేజోమయ శరీరంతో

నిద్రించేవేళ, చంద్రుడు చల్లనికరకిరణాలతో హాయిగా జోకొట్టుతాడు. పరమతపోధనుడైన విశ్వామిత్రమహర్షిఇచ్చిన దివ్యాస్త్రాలుఅదృశ్యంగా అంగరక్షకులు అవుతై. ఏకపత్నీవ్రతుడు. ఏకబాణప్రయోగి. ఏకవాక్య పరినిష్ఠుడు. అతని ఆజ్ఞకు అవని లోబడకుండటం సంభవమేనా?

బలమూ, శౌర్యమూ, ఓజస్సూ కాంతీ ఎవనిలో ప్రకాశిస్తూంటవో, ఆ వీరునికి సర్వశుభములూ పాదాశ్రయాలు. అవన్నీ రామునిలో మూర్తీభవించివున్నై. తప్పక రాముడువచ్చి ధారుణిపాలిస్తాడు. నీకళ్ళు చల్లగా చూచి ఆనందిస్తావు. బీజం వేసీ వెంటనే ఫలం రావాలనుకుంటే రాదు. కొంతకాలం సహనం అవసరం. రవికి రవి. అగ్నికి అగ్ని. శ్రీకి శ్రీ. ప్రభువులకు ప్రభువు. కీర్తికీ కీర్తి. వేల్పులకు వేల్పు. క్షమకు క్షమ. భూతాలకు భూతం. రామచంద్రుడు. అతడు అయోధ్యలోవున్నా, అడవిలోవున్నా అశుభాలు ఆశ్రయించవు. నేను భవిష్యత్తు చెపుతున్నాను. సీతాలక్ష్మణసహితంగా మన రామయ్య తండ్రి ఆజ్ఞపాలించి అయోధ్యకు వస్తాడు. అభిషేకాన్ని ముగ్గురుతమ్ములతోకూడి పొందుతాడు. సీతాసమేతుడై సింహాసనంమీద వుండగా, లక్ష్మణ భరత శత్రుఘ్నులు సేవిస్తూవుండగా, పౌరులు ఆనందబాష్పాలతో బరాబరులు చేస్తుండగా చూసేభాగ్యం మనకు త్వరలో నేరానుంది. ఒట్టుపెట్టుకుని చెపుతున్నాను. సుఖంగా బిడ్డలు తిరిగివస్తారు. నీ ఆలింగనభాగ్యం పొందుతారు. నీ ఆశీర్వాదాలు అందుకుంటారు. అందరినీ ఓదార్చవలసినదానివి. నీవే శోకిస్తే మనపతి ఇంకా చెడిపోతాడు. ధైర్యంచెప్పి సంరక్షించుకోవాలి. పద్మాలుగేంట్లునిండిన మధుక్షణం రామయ్యవచ్చి తన మెత్తనిచేతుల్తో నీ పాదాలు పట్టుకుంటాడు. ఆనందబాష్పాలు నీవు అంజనాచలంపై అంబుదంలాగావర్షిస్తావు. మేమంతా నీ పరమపావన జన్మకు అసూయ పడతాం. ఇక విచారించకు. అక్కా! నా కుమారుడు పోలేదా? నేను దుఃఖిస్తున్నానా? నాకోడలు పూర్మిళ భర్తఎడబాటును ఏమైనామనస్సుకు రానిచ్చిందా? మహాతపస్సమాధిమగ్నయైంది. నీవూ, నేనూ భర్తను సంరక్షించుకోవాలె. ఆయన పశ్చాత్తాపజలంతో పాపభావపంకిలం కడిగివేసుకుని మబ్బువీడిన మధ్యందినమార్తాండునివలెనున్నాడు. మన మంచి దానికి వచ్చాడు. మనకర్తవ్యం ఆయన్ను వ్యంగ్యంగా దెప్పటంకాదు.

ప్రాణరక్షణ చేసుకోవటం" అంది. ఆవిధంగా సర్వజగజ్జీవకోటిహితంగా పలికిన చల్లని మాటలు మండిస్తున్న మనస్సుపై అమృతవృష్టి కురిసి కౌసల్యకు దుఃఖోపశమనం కావించినై. ఉపశమనం పొందిన అక్కను చూచి సుమిత్ర సంతోషించింది. ఆ సంభాషణవిన్న రాజుకూడా కొంత కోలుకున్నాడు.

## రాముడు మరలిపోవ పౌరుల ప్రార్థించుట

సుమంత్రుడు, రాముడు ఎంతతొందర పెట్టినా, వెంట వస్తున్న ప్రజల దీనస్థితి చూచి తాబేలు నడకలాగా తోలసాగాడు. "బంధువులందరూ ఏడుస్తూ ఐనా ఇండ్లకు చేరారు. మరి ఈ ప్రజల సంగతేమిటి? అయోధ్యవిడిచి ఎంతదూరం వచ్చారు? వీరి జాడచూస్తే ఇండ్లకుపోయేట్లు లేదు. వేగంగా తోలితే, రథాన్ని అందుకోలేక ఆర్తిలో కొందరు దేహత్యాగం చేయవచ్చు. కొందరు తెలివి కోల్పోవచ్చు. కొందరు ప్రాయోపవేశం చేయవచ్చు. రాజూ, మంత్రులూ, ఎంతచెప్పినా వినని వీరు నా మాటలు మాత్రం వింటారా? ఒకవేళ రామచంద్రుడు చెపితే ఆయనపై గల భక్తివిశ్వాసాలతోనైనా వింటారేమో. ఏమిలోకం? బంధుప్రేమలో స్వార్థంవుంది. ప్రజల ప్రేమలో స్వచ్ఛతవుంది. కాబట్టేవారు తిరోగాములైనారు, వీరు పురోగాములైనారు" అనుకుంటూ, మరలిచూస్తూ రథం తోలుతున్న మంత్రి సంకటస్థితిచూచి, రాముడు, తానుకూడా వెనకకు చూచాడు. గుండె చెరువైంది. సుమంత్రుడు పడుతున్నబాధ అర్థంచేసుకున్నాడు. కనుచూపు మేరనేల కనపడ్డంలేదు. ప్రజలే కనుపిస్తున్నారు. వాళ్ళ వదనాలలో తేజస్సులేదు. వాళ్ళ శరీరాల్లో జవసత్వాలులేవు. వారి మాటల్లో ప్రాణాశలేదు. వాళ్ళరాకలో తరిగిపోయే ప్రసక్తిలేదు. ఎల్లప్పుడూ కరుణారసం తొణికిసలాడే హృదయం కరుణరసంతో కల్లోలితమైంది. అవధిలేని నిగ్రహం అపాయ సూచకం. ప్రజాక్షేమమే ప్రాణాధికంగా భావించే రాముడు రథాన్ని ఆపమన్నాడు. సుమంత్రుడు వేగాన్ని ఇంకా తగ్గించాడు.

సారథి కూర్చుండేచోటికి వచ్చి పౌరులను ఉద్దేశించి, ఆత్మీయత వుట్టిపడే ధోరణిలో కర్తవ్యాన్ని దాశరథి చెప్పసాగాడు.

"పూజ్యులైన పౌరులారా! మీ అపార ప్రేమానురాగాలు నన్ను కట్టివేస్తున్నై. నేను తిరిగివచ్చి మీఋణం తీర్చుకుంటాను. మీ రిక్కడ ఆగి, తిరిగి గృహాలకు చేరుకోండి. నా వ్రతం భంగంచేయవద్దు. వ్రత భంగంచేసిన రాముడు బ్రదుకుటకల్ల. అది మీరు ఎప్పుడూ కోరరు. అందుకే నామాట మన్నించండి. ఇక్ష్వాకువంశ ప్రతిష్ఠనిల్చిందంటే, అది మీవల్లనే. మీసౌహార్ద్రం వల్లనే. మా పూర్వులెప్పుడూ ప్రజాభిమతానికి విరుద్ధంగా ప్రవర్తించలేదు. నేనూ ఆ దారిలో నడిచేవాణ్నే. మీరు నాపైనున్న భక్తి విశ్వాసాలను క్షణం ప్రక్కనబెట్టి విషయం పరిశీలన చేయండి. మీరు సతీ సుత ధన ధాన్య వస్తు వాహనాదులు వదలి నాతో వస్తారు. యజమానులు లేక సర్వకర్మలూ పాడైపోతవి. గృహస్థ ధర్మాలు నశించంగానే, అనాథులై అక్కడివారు అలమటించి అసువులు కోల్పోతారు. అంతతో అయోధ్య అటవికంటే భయంకరంగా పాడుగొట్టాడుతూ, భరించరాని స్థితికి పాల్పడుతుంది.

సమయానంతరం మనమందరం ఎక్కడికి పోవాలి? పాలించే ప్రభువులేక ప్రజలంతా స్వేచ్ఛావిహారులై, స్వకర్మభ్రష్టులుగా మారిపోతారు. ధర్మాతిక్రమణం జరగ్గానే వుత్పాతాలూ, ప్రళయాలు, కరువులూ, కాటకాలు వస్తయి. జననష్టం, పశునష్టం సంభవిస్తుంది. నాపై మీరుచూపే ఆదరణ ఈవిధంగా ప్రపంచ సంక్షోభానికి హేతువవుతుంది. ఆలోచించండి. మీరంతా నా తమ్ముణ్ణి రాజుగా నాకు మారుగా చూసుకోండి. అయోధ్యా పౌరులు రాజధర్మానుసారులని ఋజువు చేసుకోండి. మిమ్మల్ని ఇంతకాలం కన్నబిడ్డలకంటే ఘనంగా చూసుకుంటూ పాలించిన నా తండ్రినీ వృద్ధురాలైన నా తల్లినీ సంరక్షించండి."

అని వేడుకుంటుంటే, ఆగుణాభిరాముడు ముందుకంటే ప్రజలకు ఆకర్షణీయుడైనాడు. అతని ఎడబాటు వెనుకటి కంటే దుస్సహమైంది వారికి. ఆ సమయంలో, వృద్ధబ్రాహ్మణులు ముందుకువచ్చి ఏదో చెప్పబోతున్నారు. రథంపైనుంచి ఎంతచెప్పినా ప్రజలు వెనుకకుపోయేట్లులేరు రాముడు రథందిగి కాలినడకను వాళ్ళను చేరవచ్చాడు. ఆవస్తున్న దయాసాగరుణ్ణి చూచి, "రామ ప్రభూ! ఇంత దయగల తండ్రివి నీవు రాజువు అవుతావనీ, నీ ఏలుబడిలో మాతనువులు ధన్యమవుతాయనీ గంపెడంత

ఆశతోవుంటే, మమ్మల్ని విడిచి పెట్టి పోవటానికి నీకు మనసెట్లా వచ్చింది?

## పౌరులు తిరిగి రమ్మని రాముణ్ణి ప్రార్థించుట

ఇంతదయ మాకెక్కడ దొరుకుతుంది. నీ సేవలో మా తనువులు పోవాలేకాని, అంతకంటే మాకు కోరదగిందేముంది? దండకారణ్యాన్ని జనపదం చేస్తాము. మా సీతమ్మతల్లి, మీరూ వుండటానికి అందమైన పర్ణశాలలను నిర్మిస్తాం. సకాలంలో పండ్లూ, దుంపలూ తెచ్చి పెడతాం. కంటికి రెప్పలాగా కాచుకుంటూ కడతేరుతాం. కాదంటే మాతోమళ్ళీ అయోధ్యకు రాండి. మీరులేకుండాపోతే ఆడవాళ్ళు ఊరుకోరు. మీరు రావటమో, మమ్మల్ని కొనిపోవటమో జరగాలి. అంతవరకూ మేంకదలం" అంటూ పౌరులు కాళ్ళపై పడసాగారు. వేదవృద్ధులువచ్చి "రామా! బ్రహ్మణ్యుడవైన నీ వెంట బ్రాహ్మణ్యం వచ్చింది. అరణులలో అగ్నిహోత్రం తెచ్చింది. హయమేధ సమయంలో మహారాజు ఇచ్చిన శ్వేతాతపత్రాలు వచ్చినై. ఎర్రనిఎండలో నిల్చున్నావు. మా గొడుగుల నీడలో నిల్చో. పట్టణాలల్లోవున్నా, భయంకరారణ్యాల్లోవున్నా మాకుఒక్కటే. మేంనిత్య కర్మిష్ఠులం. మా అధర్వ మంత్రాలతో అడవి జంతువులను అపకారం చేయకుండా వారిస్తాం. బ్రాహ్మణ వాక్యాన్ని ప్రభువే మన్నించకపోతే వేదానికి నిలువనీడ ఎక్కడ? నమస్కార గ్రహీతలమైన మేం నీకు నమస్కారంచేసి వేడుకుంటున్నాం. మాతో మరలి అయోధ్యకు రాండి. మాలోకొందరు విశ్వశ్రేయఃకాములై యజ్ఞాలకు సంకల్పంచేసివున్నారు. నీవే యజ్ఞభోక్తవుగా పరిపూర్తిచేయించు. నీవియోగానికి జంగమశరీరం గల మేమేకాదు, స్థావరాలైన వృక్షాలుకూడా వ్రేళ్ళు భూమిలో బంధింపబడి వెంటరాలేక గాలివేగంలో, పౌరులవలె మమ్మల్నికూడా పరిత్యజించి పోతున్నావా? అని హోరుమని ఏడుస్తున్నై" అని మొరపెట్టుకున్నారు.

ఎంత చెప్పినా ప్రజలు వెనుకకు మరలే జాడ కనుపించటంలేదు. "ప్రజల ఆ ఘోషను పరమేశ్వరుడు మెచ్చాడా?" అన్నట్లు పోతున్న వారికి తమసానది అడ్డం వచ్చింది.

# పౌరులతో రాముడు తమసానదీ తీరం చేరుట

సుమంత్రుడు రథం ఆపి, గుర్రాలను విడదీసి, తమసానదిలోకి తోలుకొనిపోయి, నీళ్ళుత్రాగించి, అటూ ఇటూ కొంతసేపు త్రిప్పి, మేత వేసి చూస్తూ నిల్చున్నాడు. రాముడు సీతవైపు చూస్తూ, సౌమిత్రితో ఈవిధంగా చెప్పాడు. "తమ్ముడా! మనయాత్రావ్రత దినాలల్లో మొదటి రోజు ముగిసేవేళకు అరణ్యానికి చేరుకున్నాం. పగలంతా ఆహారంకోసం శ్రమించి తమ నెలవులకుపోయే వన్యమృగ విహంగముల రావంతో శూన్యంగావున్న అడవి రోదిస్తున్నట్లున్నది. పాపం! చిన్నవాడవు. ఒంటరివాడవు. 'అడవిలో పద్నాలుగేండ్లు గడపటం ఎలా?' అని వగవబోకు. అయోధ్యలో స్త్రీ పురుషులెంతో ఆదరంతో చూసేవారు. నన్ను, నిన్ను, సీతను వదలి తల్లిదండ్రులు ఎంత సంతాపిస్తున్నారో. యశస్వినియైన నా తల్లి, వృద్ధుడైన తండ్రి తలపుకువస్తే గుండె ఝల్లుమంటున్నది. మనకై నిరంతరం కంటికి కడివెడునీరుగా రోదిస్తూ దీనులైన మన తల్లిదండ్రులేమవుతారో. వచ్చేవేళకు పినతమ్ములు పురంలో లేరు. భరతుడు దయాగుణసంపన్నుడు. ధర్మరతుడు. అతడుంటాడనే ధైర్యంతో నేతరలి వచ్చాను. నీవు నాతోవచ్చి ఎంతో మేలుచేశావు. ఒంటరిగావుండే సీతను జాగరూకతతో చూచి నాబరువు తగ్గించగలవు. ఇక్కడ మనకు కావలసిన వన్యపదార్థాలు వున్నప్పటికీ, నీరుమాత్రం త్రాగి ఉపవాసంవుంటాను. మీరు కావలసిన ఆహారం గైకొనండి. సుమంత్రా! గుర్రాలకు విశ్రాంతి కూర్చు. శరీరాలుకడిగి, నీళ్ళుత్రాగించి, పచ్చగడ్డి మేపుపెట్టు. సాయంకాలమైంది. నేనూ, తమ్ముడూ, సీతా వెళ్ళి నదిలోస్నానంచేసి సంధ్య కృత్యాలు పూర్తిచేసుకునివస్తాం" అని చెప్పి ముగ్గురూ నదికి వెళ్ళారు. వారు వచ్చేలోపల మెత్తని ఆకులతో సుమంత్రుడు మూడు పడకలమర్చాడు. సీతారాములు శయ్యలను స్వీకరించారు. వారిద్దరు నిద్రించేవరకు చెంతనేవుండి, అనంతరం సుమంత్రునిచూచి "పూజ్యుడా! చూశావా? ఎక్కడ శయనించతగినవారు ఎక్కడ శయనిస్తున్నారో. సత్యం ఆలోచిస్తే భోగాలూ, సుఖాలూ రాజమార్గాలల్లో లేవు. మిశ్రమ పదార్థం, కృతకపదార్థం వ్యామోహపరచినంతగా, నిసర్గ (సహజంగా వున్న) పదార్థం వ్యామోహపరచలేదు. అహైతుకమై, అంతర్వీక్షణకే

తెలియదగిన మహాశక్తిని, సంకేతరూపాలైన, సత్యం, ధర్మం, విచక్షణా జ్ఞానం మొదలైన వాక్యార్థాలలో ఆరాధిస్తే బాహ్యసుఖం ఎలావుంటుందో ఈ రెండుమార్గులా చెప్పుతున్నై. లౌకికంద్వారా, అలౌకికాన్ని సాధించడం ఏటికి ఎదురీతవంటిదే. మావంశంలో పూర్వం శిబిచక్రవర్తి శరీరం కోసిఇచ్చాడట. హరిశ్చంద్ర మహారాజు భార్యనూ, కొడుకునూ అమ్ముకుని తాను కాటికాపరికి దాసుడైనాడట. ధీరుడయిన దిలీపుడు సింహానికి ఆహారంగా శరీరార్పణం చేశాడట. ఆకోవకు చెందినవాడే కనుక కోరి భౌతికార్థాలను పరిత్యజించాడు. త్రికరణాల్లో ఆ భావంకూడా లేదు. వుంటే ఆదమరచి తల్పంపై శయనించినట్లే నిద్రిస్తాడా? అన్నివిధాలా ఆయనకు అర్థరాత్రైంది మావదిన. ఆమెకూడా సుఖశయనంలోవుంది" అంటూ సౌమిత్రి చెపుతూండగానే యథారీతి రాముడు మేలుకున్నాడు. నిద్రారహితులై నిలుచుండి మాట్లాడుకుంటున్న సౌమిత్రినీ, సుమంత్రుణ్ణీ చూశాడు. వంశకరుడు వుదయింప బోతున్నాడు. గుర్రాలు కడుపునిండా తిని అరమూత కన్నుల్తో వున్నై.

## శ్రీరాముడు పౌరుల కనుమరగించి పోవుట

అన్నంలేక, పానంలేక, ఆర్తులై, స్వవిషయాలు మరచి, బహుదూరం ప్రయాణించి, సొక్కి, సోలి, చెట్టుకొకడుగా నిద్రావశులై పడియున్న ప్రజాసమూహాన్ని చూశాడు. తల్లిదండ్రుల, ఆప్తుల విడిచినప్పటి విచారంకంటే వేయిరెట్లుగా విచారం పొందాడు. "ఎంతచెప్పినా వినక, వెంటవచ్చే వీళ్ళను విడిచి పోవటానికి మనసు ఇష్టపడ్డంలేదు. కఠినంగా చెప్పటానికి నోరు రావటంలేదు. అలాచేస్తే ఇందరుప్రాణాలు విడుస్తారు. యుక్తితో తప్పించుకునిపోవటమే వుచితం. తెలివి వచ్చినతర్వాత వీళ్ళు నన్ను విడువరు. ఈలోపలనే కనుగప్పి పోవాలి. తరువాత, విధివిధానం ఎలావుందో, అలా జరుగుతుంది. నాకై వీళ్ళుపడే బాధను తొలగించటం నా ధర్మం. నేను వాళ్ళమధ్య వున్నంతకాలం వారు వదలరు నన్ను. నేను వాళ్ళను వదలలేను. నా పరోక్షంలో, చూచి చూచి, నిరాశానిస్పృహలతో వెనుతిరిగిపోతారు. ఇప్పటికిదే కర్తవ్యం" అని నిశ్చయించి, రాముడు తమ్ముణ్ణిపిల్చి "ప్రజలంతా గాఢనిద్రలో ఒడళ్ళు

తెలియకుండా పడివున్నారు. మనం చప్పుడు కాకుండా తేరెక్కి వెళ్ళిపోదాం. నీవేమంటావు?" అని ప్రశ్నించాడు. "మీ నిర్ణయం తిరుగులేనిది. అవశ్యకర్తవ్యం" అని తమ్ముడు చెప్పాడు. వెంటనే మంత్రిని పిల్చి "నీవు రథంసిద్ధంచేయి. మనంచప్పుడుకాకుండా కొంతముందుకుపోయి, అక్కడ మేందిగుతాము. నీవు ఒక్కడవే వుత్తరంగా కొంతదూరం పోయి, మార్గాన్ని తప్పించి వేరుదారులగుండా మమ్మల్ని కలుసుకో. మనం పోవలసినదారి అదికాదు. కాని దారిలో క్రమ్మిన దుమ్ముచూసి ప్రజలు ఆశవదలుకుని తిరిగిపోతారు. త్వరగా సన్నద్ధంచేయి" అని చెప్పాడు. మంత్రి ఆ ప్రకారంచేశాడు. రామునిచేయి ఆలంబనంగా జానకి ఎక్కింది. పిమ్మట సౌమిత్రి ఎక్కాడు. సుమంత్రుని చేతిలోని కళ్లెల కదలికతో కదలిపోయింది రథం.

## రాముని కొరకు పౌరుల దుఃఖము

మసకమసకగా తూర్పు తెల్లవారింది. గుండెదడుకులతో, కొరడా దెబ్బకొట్టినట్లై ప్రజలంతాలేచారు. నలుదిక్కులాచూచారు. రథంలేదు. శైలపాతంపొందిన జీవుల్లాగా క్షణంకాలంనిశ్చేష్టులైనారు. తమదురదృష్టాన్ని నిందించుకున్నారు. పాడునిద్రనుపట్టితిట్టారు. ఏంచేయాలో తోచక మిన్నుచూచారు. నడిగట్టు వెంటబడి కొందరుపోయారు. చెట్లూ, చామల్లోబడి కొందరు తిరిగారు. సీతారాములు శయనించిన ఆకుపాన్పులను కళ్ళకద్దుకున్నారు. ఆకుల్ని ముక్కముక్కలుగా తుంచి తలల్లో పెట్టుకున్నారు. వారిపాదముద్రలున్నమన్ను ఒడలంతా పూసుకున్నారు. దుమ్ము రేగిన దిక్కునుచూచి దుఃఖించారు. ఎక్కడా వారిజాడతెలియక వదలిపెట్టినచోటికేమరలివచ్చారు. రథచక్రాలగుర్తులూ, గుర్రండెక్కల గుర్తులూ కనిపించినంతవరకు ముందుకు వెళ్ళారు. ఆపై కనుపించక అందరూ హతాశులై కుప్పగా కూలిపోయారు. కొంతసేపటికి తెలివి తెచ్చుకుని "రామయ్యతండ్రీ! ఎంతఅన్యాయంచేశావు మమ్మల్ని? ఎన్నడైనా మమ్మల్నివంచించావా! మామాట మీరావా? మారాక నీకంత అనిష్టంగావుందా? మేం చేసినతప్పేమిటి? పోనులే, జాలిగలతండ్రివికనుక, మాదుఃఖం చూడలేక, తెలివిలోవుంటే వదలమని తెలిసే రహస్యంగా

వెళ్ళావు. నీమాట నీవు దక్కించుకున్నావు. ఇంత దూరంవచ్చి వట్టిగా తిరిగిపోతే మామాట ఏం దక్కినట్లు? మా శ్రమకు నీ ఎడబాటే ఫలితం అయినట్లా? నీవులేకుండా తిరిగిపోవటంకంటే నీ వున్న ఈ చోటనేట్లో ప్రాణాలు వదలితే పరలోకమైనా దక్కుతుంది. ఇహలోక సౌఖ్యం నీతోనే పోయింది. ఎవరికివారు చిక్కినంతవరకు ఎండుకట్టెలు ప్రోగు వేయండి. ఆకట్టెల గుట్టకు అగ్గి అంటించుదాం. అందరం అందులోబడి మరణించుదాం. ఈ దేబెగొట్టు మొగాలతోనగరానికిపోతే,పిల్లలూ, లేవ లేనీ, కళ్ళు కానరానీ ముసళ్లూ, తల్లులూ, "రామయ్య ఏడీ?" అంటే ఏమని చెపుతాం. ఇదంతా మనం చేసుకున్న పాపమే. ఎంత ఏడ్చినా రామయ్య రాడు. కాంతల కత్తిపోట్లవంటి తిట్లు తప్పవు" అంటూ, నెత్తీ, నోరూ, గుండెలూ, కొట్టుకుంటూ, ప్రాణకోల్పోయి కాళ్ళీడ్చు కుంటూ అయోధ్యకు అభిముఖులైనారు.

## పౌరులు తిరిగి అయోధ్యకు పోవుట

ఆపోతున్న ప్రజలనుచూస్తే, ప్రభంజనానికి కొట్టుకునిపోతున్న ఒగుడాకుల్లాగా కనుపిస్తున్నారు. ఒక్కరిలోనూ ఓపికలేదు. పోతున్నది ఇళ్ళకనేభావంలేదు. ఎదురుచూస్తున్నది తల్లులూ, పెళ్ళాంబిడ్డలూ అన్న స్మృతిలేదు. చిరకాలానుభవంచేత, కళ్లచూడకున్నా, మనస్సులేకున్నా, కాళ్ళు మాత్రం గమ్యానికి చేరుస్తున్నై. ఎన్నెన్నో కలలు కన్నారు. అవన్నీకల్లలయినై. ఎట్లోగవనులకు చేరుకున్నారు. గరుడునిచేసర్పాన్ని కోల్పోయిన జలాశయంలాగా, చంద్రుడులేని రాత్రిలాగా, నీరింకిన సముద్రంలాగా రాముడులేని అయోధ్యవాళ్ళకు భీతికలిగించింది. ఆ పౌరుల చేరికలో క్రొత్తక్రొత్త మిత్రులూ,బంధువులూ,ఆప్తులూ, కనిపించినా ఆప్యాయంగా అన్యోన్యం కుశల భాషణంచేయరు. కొత్త వస్తువులున్నా మోజుపడరు. వైశ్యులకు అంగడులు ప్రియం కల్పించవు. క్రొత్తకోడళ్ళు అత్తలకు ముచ్చట కూర్చరు. మొదటికాన్పు మగ బిడ్డదయినా తల్లికి మురిపెం కలుగదు. ధనం ధైర్యం కలిగించదు. అంతా అస్తవ్యస్తమై అశుభంగా పొడగట్టుతున్న అయోధ్యలో వుస్సురస్సురనుకుంటూ తలలు వంచుకుని ప్రవేశించారు. వాకిళ్ళువూడ్చలేదు. పశువులముందుగడ్డిలేదు.

వంటలులేవు. వార్పులులేవు. స్నానాలులేవు. పానాలులేవు. గృహాల్లో పోలేకవున్నవాళ్ళంతా పోయినవాళ్ళరాకకై కన్నులుకాయలుకాచేలాగా ఎదురుచూస్తున్నారు. పశువులూ, గుర్రాలూ, ఏనుగులూ, ఆహారాలుమానేసి కళ్ళనీరు కారుస్తున్నై. బలమైన అయస్కాంత ఖండం ఏ మూలకు తిరిగితే ఆ మూలకు అల్పమైన అయోమశలాకలు (ఇనుప కడ్డీలు) తిరుగునట్లు, ఏశక్తి జగదంతర్యామియో, ఆశక్తి, రామరూపంలో అవతరించి, మానవధర్మ కర్మాచరణ ప్రతిష్ఠకై అరణ్యాలదిశగా పోవటంలో, ప్రాణికోటి అంతా తదభిముఖంగా పోయిందంటే ఆశ్చర్య మేముంది? శరీరమాత్రావశేషులై పౌరులు ఇళ్ళకు చేరుకోగానే—

## తిరిగి వచ్చినవారిని స్త్రీలు తీవ్రంగా దూషించుట

ఒడళ్ళపై వస్త్రాలున్నవో, లేవో, తెలియని అపస్మారకస్థితిలో ఆక్రందనంచేస్తూ, రామునితో భర్తలు తిరిగివస్తారన్న గంపంతఆశతో వున్న గృహిణులు, రామరహితంగా రావటంచూచి, గుండెల్లో బాకులు దూసినట్లుమాట్లాడసాగారు. "మీరంతాఒక్కుమ్మడిగా,రామయ్యరథాన్ని మరలిస్తామని శపథాలు పల్కి, తీసుకురాకుండా ఎందుకువచ్చారు? పెండ్లాంబిడ్డలపైప్రేమచేతనా?ఇళ్ళూవాకిళ్ళపైఇష్టంచావకనా?మాటంటే మాటగా చెల్లించటానికి రామయ్య ఒక్కడే సమర్థుడు. ఆ తర్వాత, ఆడవాళ్ళల్లోసీతమ్మా, మగవాళ్ళలోలక్ష్మయ్యాతప్పితే,మిగతాలోకంలో వున్న స్త్రీ పురుషులు, తిండానికీ, బిడ్డల కంటానికీ తప్ప ఇంకెందుకూ పనికిరారు. ఇళ్ళపాడైపోతవనా? ఇల్లాళ్ల చస్తారనా? ఏం చస్తే? చావకుండా తలపై శిలకొట్టుకుని జీవిస్తారా? ఎప్పుడైనా పోయే ఈ శరీరాల కోసం ఇంత తాపత్రయపడాలా? ఆ చావటం రామసేవలోచస్తే ఇహం పరందక్కేది.రోగాలతో,రొప్పలతో,నిందలతోపందలుగాచస్తేప్రాప్తించేది నరకమేనని మీకుతెలియదా? అక్కడ మీరుపోతే, ఇక్కడ మేం పోయేవాళ్ళం. అంతా రామయ్యసేవలో ఆత్మార్పణం చేసేవాళ్లం. పునర్జన్మరాహిత్యం పొందేవాళ్ళం. ఇప్పుడు రెంటికీ చెడ్డ రేవళ్ళమైనాం.

ఆ రామయ్యకేంతక్కువ? నారీలోక శిరోమకుటం ఆసీతమ్మకేం తక్కువ? సోదర ధర్మంలో కానీ, భక్తిప్రపత్తుల్లో కానీ, చివరమెట్టు

చేరుకున్న లక్ష్మయ్య కేంతప్పువః కొంచలు, సెలఏళ్ళు ప్రవహింపచేసి దప్పితీరుస్తాయి. చెట్లు రకరకాల ఫలాలుపండించి, వారెక్కడనిల్చుంటే అక్కడపడేస్తాయి. తీగెలూ, పొదరిళ్ళూ, తావులీనేపూలకన్నుల్తో చూసి, ఆకన్నుల్నే వారికిదానంచేసి,అలంకారరూపంగాఅనవరతంఆసౌందర్యం దర్శిస్తాయి. ఆ చేతనా చేతనాలు చేసుకున్న సుకృతంలో వేయోవంతు కూడా మనం చేసుకోలేదు. భయంకరంగా వుండే అడవులను, నవ నవోన్మేషంగా చిగురింపచేసి,పనలుసాగించి,ఆకులుగాపూలగా,పండ్లగా మార్చి, చైత్రవైశాఖ మాసద్వయం వసంతుడు సంతోషం కలిగిస్తాడు. వంశానికిమూలపురుషుడైన రవి, చండశాసనుడై, సహస్రకరకిరణాలతో సంశోధించి "మీ మధ్యవున్నవారు మా వాళ్ళుసుమా! ఒళ్ళు తెలిసి నడ వండని జీవకోటిని హెచ్చరిస్తూ, తరిగిపోకుండా, ఓషధులతో, సస్యాలతో భూమాత దాశరథులను సేవించే నిమిత్తం సముద్రాలను వుడికించి మేఘరూపంగా నీరు నిల్వచేస్తూండగా, మలయ పవనాలను విరివిగా వెదజల్లి, జ్యేష్ఠ ఆషాఢమాసాలూ రెండూ గ్రీష్మం సంచార యోగ్యంగా సమర్పిస్తుంది.

"అధికార దౌష్ట్యంకలవాడు, ఎంతవిధేయతచూపినా, ఆ కృతిమ ప్రవత్తిలో అప్పుడప్పుడు తొంగిచూసే స్వభావంలాగా గ్రీష్మం సేవించింది. విచక్షణారహితంగాఅధికారంవెచ్చబెట్టింది. పరమసుకుమారులు, తాపతప్తులైయున్నారు. దాహశాంతికి దూరతీరాలకు తిరిగితిరిగి, ఎంతో శ్రమపడ్డారు. సర్వసమృద్ధంగా, హాయిగా విశ్రాంతి కూర్చటం నావిధి" అనుకుంటూ, శ్రావణభాద్రపదాలలో వర్షఋతువుప్రమోదంకలిగిస్తుంది. "రామా! మీ మూలపురుషుడే నాకింత అస్తిత్వం కల్పించాడు, ఆ వంశ నాయకమణివైన నీవు గృహారామాలు వదలివచ్చి, అడవుల్లో కస్తిపడు తుంటే చూచి కృతఘ్నుడిగా వుండలేను. ఆశ్వయుజ కార్తికమాసాలు రెండూ, పూలవాసనలతో వెన్నెలచల్లదనంతో, పిల్లతెమ్మెరలతో, సమ శీతోష్ణస్థితిలో ప్రకృతిని ప్రవర్తింప జేస్తానని చంద్రుడు భావించేలాగా శరత్తు సేవిస్తుంది. "తన కూతురును భూలోకానికి ఆహ్వానించే నిమిత్తం అఖండ తపోరూపంగా అర్థించిన భగీరథుడు, తనవలె తండ్రిస్థానాన్ని పొందాడు. ఆ వంశంలో పుట్టి సత్యపాలనకై అష్టకష్టాలు పడుతున్న

సమయంలో ఆడుకోవటం ఎలా ? తనరాక, తనస్పర్శ సహింపరానిది. మార్గశిర పుష్యమాసాలు రెండూ తనఆధిపత్యంలోనే వుంటై. మృగ చర్మాలు కప్పుకున్నా శైత్యం అపహృతంకాదు. వేణు సమూహాన్నీ, చందన వృక్షాలనూ, అగ్నిహోత్రుణ్ణీ, వాయువునూ ప్రేరేపిస్తాను. పర స్పర సంఘర్షణంలో వెలికివచ్చే వేడి దావానలంగామారి, నమీపారణ్యా లను దహిస్తూ, రాత్రివేళల్లో నెగళ్ళలాగా శీతబాధ శమించేట్లు చేస్తాను" అని హిమవంతుడు ఋతుధర్మాన్ని ఆశ్రయించి, ముగ్గురు బ్రహ్మచారు లకూ మోదావహుడౌతాడు. "అయిదుగురు అన్నలు అనుకూలంగా ప్రవర్తిస్తే, ఆ అడుగుజాడల్ను అనుసరించక వ్యతిరేకంగా వ్యవహ రిస్తానా?"అని, జగత్సేవలో పండిపోయిన పదార్థ సంచయానికి విశ్రాంతి కల్పించి, సూర్యకిరణాలకు చోటును సంతరించి, మంగళ కార్యాలకు మనసులు మరలించి, ప్రాణికోటికి చైతన్యం ప్రసాదించి, స్వేచ్ఛా విహారానికి అడ్డంకులు తొలగించి, ఆ ఏకైక వనవాసులకు మనోనంద కరంగా మాఘ ఫాల్గుణ మాసాలు రెండింటినీ మార్చి, సుఖావహంగా వత్సరకాలం పూర్తిచేయించి శిశిరం చెలిమిని వెలయిస్తుంది. క్రొత్తగా వచ్చిన అతిథులకు, కొండలూ, గుట్టలూ, చెట్లూ, చేమలూ, ఇంత అద్భు తంగా ఆతిథ్యం ఇచ్చి సత్కరించగలిగితే, ఏళ్ళతరబడి వారిపాలనలో సుఖంగా బ్రతికిన మనం ఏమిచేసినట్టు ?

కైకమ్మ కనుచూపుల్లో కాలిపోయేంత కర్మం మాకేంపట్టింది ? అవకాశం వున్నవరకు వెంటతీసుకుని రామయ్యవున్న అడవికేపోదాం. ఆయువు వున్నంతవరకు అక్కడే గడుపుదాం. బ్రతికివుంటే రామయ్య తోనే అయోధ్యకు చేరుకుందాం. అప్రశస్తమూ, అమనోహరమూ, అవ లక్షణమూ, ఆత్మనాశమూ, అయిన కొంపపై మాకు కూరిమిలేదు. కైకమ్మ పాలనలో ధర్మం శూన్యమైపోతుంది. ఈ దిక్కుమాలిన నగరంలో కాపురం చేయటంకంటే పల్లకాళ్ళల్లో పడి వుండటం మంచిది. రామయ్యమీది బెంగలో రాజెట్లాగూచస్తాడు. భరతయ్య వస్తాడో, రాడో. ఇంక ఈ నగరానికి ఏదుపే శరణ్యం. ఆలస్యం చేయకుండా, మూటా,

ముల్లే సర్దండి. వచ్చేవాళ్ళురండి" అంటూ షోణీపాతంగా అశ్రువులు కారుస్తూ అంగలార్చారు.

## శ్రీరాముడు కోసల దేశాన్ని దాటి పోవుట

లోకబాంధవుడైన రాముడు స్వప్రకాశం మరుగు పరచి అయోధ్యను వదలినట్లే, లోకబాంధవుడు ఆకసాన్నివదలి అస్తశైలం మరుగున కరిగాడు. ఏ సంకట స్థితిలోనూ, స్వకర్మనిష్ఠను వదలని బ్రాహ్మణులు సాయంకాల సంధ్యావందనం చేయరు. గార్హస్థ్యాగ్ని హోత్రాన్ని వేల్చరు. వేదపఠనంచేయరు. పురాణాలు చదువుటలో ఆసక్తి చూపరు. చీకటి ఆక్రమించినా దీపాలు వెలిగింపరు. అవసరవస్తువుల కొరకైనా అంగళ్ళు తెరువరు. రాకుమారులు అతిమనోజ్ఞమైన ఆరామాలకు వ్యాహ్యాళికై పోరు. ఆడవాళ్ళు, పరామర్శ లేకపోవటంతోకప్పుపడిన దుమ్ముదులపరు. పిల్లలకై తల్లులు తాపత్రయపడరు. భర్తలకైభార్యలూ, భార్యలకై భర్తలూ అన్వేషించరు. అత్తలు కోడళ్ళకై ఆలోచించరు. కోడళ్ళు అత్తలకు సేవలుకూర్చరు. పశువులు పాలు చేపటం మరిస్తే లేగలు తల్లులనే మరచినై. మధురగానాలతో, మంజులవాద్యాలతో, మనోజ్ఞలాస్యాల కంకణ మంజీరక్వణనిక్వాణులతో ముఖరిత మయ్యే రాత్రి సమయం అలలులేని జలధివలె ఆనందశూన్యమైంది.

ప్రాణసమానులైన ప్రజలను నిద్రావస్థలో మరపించి రథంపై పోతున్న రామాదులు, మిగిలినరాత్రిగడిపి, వేకువకాగానే కాలకృత్యాలు తీర్చుకుని స్నాతులై, వార్చి, మళ్ళీరెక్కిపోతూ, ఎదురు మదురుగా, మారదూరంగా, కనిపించే వూళ్ళూ, అందమైనతోటలూ, పాటుచేసిన భూముల్లో విత్తుతున్న కర్షకులూ, వాళ్ళకు ఆహారంతెచ్చే ఆడవాళ్ళూ, దారి సరిగాలేనిచోట్లలో తేరు మెల్లగా పోతున్నప్పుడు సమీపంగావుండే గ్రామవాసులూ, వారి పనిపాటలూ, కనపడగా, వుద్వేగరహితంగా, స్వచ్ఛందంగా, అమాయికంగా బ్రదికేవారి జీవితాలకూ, కృత్రిమ వాతావరణం, కృత్రిమభాషణం, కృతకాలంకారం, కృతక గౌరవంగల పట్టణవాసుల జీవితాలకూ, ఎంత అంతరంవుంది? వీరి నిస్స్వార్థసేవల విస్మరించి, దుస్స్వార్థపరులై, తిరిగివారినే పీడించిసుఖించే నాగరక

జనంపై అసహ్యంవేస్తుంది. ఎంత నిరాడంబరత ? ఎంత సహజీవన విధానధోరణి? ఎంతకలుపుగోలుతనం? ఎంత ధర్మాచరణబుద్ధి ? ఎంత ఆదరణ? ఎంతవినయం? ఇంతనిసర్గ మనోహరమైన పల్లెవాసుల నడవడి కల చూచి సత్యంగ్రహించే అవకాశం కల్పించిన పినతల్లి కైకమ్మనుఎంత ప్రశంసించినా తనివితీరదు. ఆ ఆకాశందాకే మేడల్లో, ఆ పశుల శిరోజాలతో అమర్చిన పట్టుపరుపుల్లో, ఆకలికీ, అవసరానికీమించిన పదార్థాలకై అర్థంవ్యర్థంచేస్తూ, స్తుతిచేసేవాళ్ళకు దోచిపెడుతూ, నిజంచెప్పేవాళ్ళను నీచంగాచూస్తూ, నిరాకరిస్తూ, ఐశ్వర్యంపేరుతో, అధికారమదంతో, మన్నూ, మిన్నూ తెలియనిస్థితిలో మత్తుపానీయాలు సేవిస్తూ, డాంబికంగా, దర్పంగాజీవించే మాకంటే, వీళ్ళు ఎంత వందనీయులు ? ఇంత యథార్థ దర్శనం అంతఃపురాలల్లో వుంటే ఎలాలభిస్తుంది? "లక్ష్మణా ! ఇప్పుడు నామనస్సు ఎంతో నిర్మలంగానూ, నిశ్చలంగానూ వుంది. పట్టణంలోవున్న మనప్రజలకూ, పల్లెల్లోవున్న ఈ ప్రజలకూవున్న భేదం గుర్తించావా?" అని రాముడు ప్రశ్నిస్తే, సౌమిత్రి "మీరు ఏంచూసి ఆనందిస్తున్నారో, అదే, మిమ్మల్ని చూస్తూ అనుభవిస్తున్నాను"అని సమాధానం చెప్పాడు. ఆ మాటలువిని, జానకి, "మరదీ, మీ అన్నగారు ఇదివరకు నీలోనే చూశారు. అదే ఇప్పుడు బయట చూస్తున్నారు" అని అన్నది. "అవును జానకీ! నిజంచెప్పావు. ఆ యోగ్యత నాకు ఎలాకలిగిందో నీవు చెప్పలేదు. అది నీనుంచే సంక్రమించింది" అని రాముడు వెంటనే అన్నాడు. మంత్రి అందుకొని "ఔనమ్మా. గడుసు వారెప్పుడూ అలాగే అంటారు. ఈ గడుసాయనకోసమే ప్రజలంతా గగ్గోలు పడుతున్నారు. వాళ్ళదృష్టిలో మనం నామమాత్రంగా వున్నాం" అన్నాడు.

ఆ మాటలకు అందరూ నవ్వుకున్నారు. ఇంతలో రథం ఒక పెద్ద గ్రామంలోనుంచి పోతున్నది. ఆ గ్రామస్తులకు అప్పుడే ఎలా తెలిసిందో, "ముసలితనంలో మోహం ఎక్కువై, రాజు కైకమ్మ మాటలకు కన్నవాణ్ణి కానకు నెట్టాడు. ఇంక ధర్మం ఎక్కడ వుంటుంది? ఆ కైకమ్మ కోరుకుంటానికి లోకంలో ఎన్నిలేవు ? కొడుకుల్ని అడవికితోలే కోరిక ఏంటి ! స్త్రీ బుద్ధి ప్రళయాంతకం అన్నట్టు చేసింది. పుట్టుభోగి అయిన సీతమ్మ, మనబోటివాళ్ళమే తట్టుకోలేం, ఆ అడవుల్లో అష్టకష్టాలు ఎట్లా

పట్టుకుంటుందో, ఏమో ?" అని, ఒకళ్ళతో ఒకళ్ళు అనుకుంటుంటే వింటూనే రథం కోసలదేశం దాటి "వేదశ్రుతి" అనే నది సమీపానికి చేరుకుంది. సుమంత్రుడు ఆ నది దాటించి ముందుకు ప్రయాణంచేసి, "గోమతి" అనే వాహిని చేరువకువచ్చి, దాన్నిగూడ తరించి, కీరీశారీ మయూరీ హంసీ కలకలారవంతో గలగల ప్రవహిస్తున్న "స్యందికా" కూలంకష తీరంచేర్చి, కొద్దికాలం సేదతీర్చుకుని, దాన్నిగూడా దాటించాడు. నదీ తరణానంతరం, రాముడు "దేవీ ! ఈ నది హద్దుగా, మా వంశంలో మొదటి ప్రభువుకు మనువు రాజ్యాధికారం దత్తంచేశాడు. పైభూముల్లోవున్న ప్రభువులంతా, ఇక్ష్వాకు చక్రవర్తులకు సామంతులుగా, మిత్రులుగా, పాలిస్తుంటారు" అనిచెప్పి "మంత్రీ! సరయూ నదీతీరంలో వున్న సుందరోద్యానాలల్లో, తల్లిదండ్రులతోకూడి మృగయా విహార వాంఛలో మునిగితేలే అవకాశం ఎప్పుడు వస్తుందో ? పితృ కార్యాల నిమిత్తం రాజర్షులు కొందరు వేటలకుపోతారు. ఎందుకో నాకంత ఇష్టం వుండదు. వేట, రాజోచితమైనా, చేసేది జీవహింసకదా. హేతు పురస్కృతంగా చేసేపని, హేతురహితంగా చేస్తే వ్యసనం క్రిందికి వస్తుంది. పాలకుడు వ్యసన లంపటుడుకారాదు. ప్రజలు పాడౌతారు. "యథారాజా, తథాప్రజా" అనికదా పెద్దలమాట" అంటూ ఇష్టగోష్ఠిలో కోసలంపూర్తిగా దాటాడు. ఏదో స్ఫురణకురాగా, సారథిని రథం ఆపమని, అయోధ్య దిక్కై, "తల్లీ! అయోధ్యా! దుఃఖాకులంగావున్న ప్రజా సమ్మర్దంలో, నీకు వీడ్కోలు చెప్పలేదు. క్షమించు. మా ఇక్ష్వాకులవంశంలో మహా పురుషులు ఎందరో నీ ఛత్రచ్ఛాయను సుఖోపవిష్టులై, తమయశశ్చంద్రికలను దిగంతాలకు వెదజల్లారు. నేనుకూడా, పితృవాక్యపాలనంచేసి తిరిగివచ్చి, నిన్నూ, గ్రామదేవతలనూ, నిన్ను వెలిగించే వేల్పులనూ, గురు బంధుమిత్ర పరివారసమేతంగా అర్చిస్తాను. నాదీక్ష సమాప్తం అయ్యేవరకు, సాంఘికంగా, రాజకీయంగా దైవికంగా, ఏ అవాంతరాలు రాకుండా కాపాడు" అని.

నీలోత్పల పత్రంపై ముత్యాలు పోసినట్లు, వక్షఃస్థలంపై పడగా అశ్రువులు రాల్చాడు. తర్వాత, తన్ను చూట్టానికి వచ్చిన జానపదులను వుద్దేశించి, "పూజ్యులారా! నామీద పెంచుకున్న అభిమానంకొద్దీ మీరు

పనులన్నీ వదలి దుఃఖంతో నన్ను చూచే నిమిత్తం దూరం వచ్చారు. ఇంతమందికి శోక హేతువుగా నా పుట్టుక వచ్చినందుకు ఎంతో విచార పడుతున్నాను. త్వరలో మాతండ్రిమాట పాలించి మీ దర్శనార్థంవస్తాను. దయతో మీరు తిరిగి స్వస్థలాలకు వెళ్ళండి" అంటూ ఓదార్చిపంపి, అంబుదంచాటు కేగిన అహస్కరునివలె, ప్రజల కంటిమేరకు కనబడ కుండా రథంలో గమించాడు.

## రాముడు గంగానది చేరుట

ప్రబల ప్రయత్నంతో ప్రజలను మరలించి, మాతామహ స్థానం అయిన కోసలదేశాన్ని, ధనధాన్య సమృద్ధమై, దానశీల ప్రభామానితమై, సుందర చైత్యయూపోపశోభితమై, సౌభాగ్యసంకలితమై, ఆకుతో భయమై, మధుర రసాలసాల సంకీర్ణమై, నిర్మలనీర పూరకాసారతటాక కమనీయమై, తుష్టపుష్ట జనసంకులమై, గోవృషభ మహిష మేషనికర సమ్మర్ద సమలంకృత మందిరంబునై, నిరంతర వేదఘోషా ప్రవర్తితమై, సంకల శుభదమైనదాన్ని దాటి మహోత్తుంగ తరంగ ఐన గంగను చేరుకున్నారు. అభంగతర భంగోత్సంగనూ, సౌందర్య రమణీ నర్తన విలాసభాసితరంగనూ, మహర్షివారనిషంగనూ, మనోహర ఆశ్రమ సమూహంగనూ, ప్రతిబింబిత గగన సంచరత్పతంగనూ, పర్యాప్తశ్రవణ సుభగ ప్రకటిత సంగీత భృంగనూదర్శించాడు. వేల్పుకన్నెలు మగలతో కూడి విహరించే కేళీశైలాలతోనూ, బండి గురువిందతీగలతో అల్లుకోబడ్డ తమాల వృక్షాలతో నిండిన తీరప్రదేశాలతోనూ, పులుగుల వింత వింత కూతలతో శ్రవణ తర్పణం చేస్తున్న వనాలతోనూ, చూడముచ్చటగా నున్న నదీమతల్లిని అనిమిషుడై చూడసాగాడు. గంగాదర్శనంతో పారవశ్యంచెందిన రామునితో సుమంత్రుడు "రామా! ఎంతో సుకృత వంతులకుకాని గంగాదర్శనం, అవగాహనంలభించదు. కృతయుగంలో శ్రీ మహావిష్ణుపాదోద్భవ. త్రేతలో మేనకా హిమవంతుల పుత్రిక. పర మేశ్వర శిరస్థ్సలవాసిని. వర్షకాలంలోగట్లొరసిపారుతూ,సుళ్లుతిరుగుతూ తీరస్థవృక్షాలనూ, గ్రామసీమలనూ తనలోచేర్చుకుంటూ, నడుమనడుమ వుండే కొండలతాకి ఘూర్ణిల్లుతూ వాటి కరకుతాన్ని నునుపుగా చేస్తూ,

సముద్రాభి ముఖంగా ప్రవహిస్తున్నప్పుడు చూడాలి ఈమె సౌందర్యం.

దక్షిణ నాయకుడైన భర్త తన్ను గాదని సపత్నులతో కలిసివున్నాడని దాసీ చెప్పగావిని, కోపనయై, గమన తీవ్రతలో హారాలు చిక్కుపడగా, కేశబంధం సడలి తురుమురాలగా, పయిటజారగా, పాదమంజీరాలూ, కరకంకణాలూ, కటిసీమలోనిఒడ్డాణంమువ్వలూనినదిస్తుండగా, పతినిసమీపించే ప్రౌఢాంగననయనాల్లో నాట్యంచేస్తున్నట్లు గోచరిస్తుంది. ఈమె నీవలె గంభీరం. సౌమిత్రివలె వుద్ధత. జానకివలె పవిత్ర" అని పల్కుతూ వున్న సమయంలో, తండ్రే తన్ను చూడవచ్చాడన్నంత సంతోషంతో, చిరుతరగలకదలిక విరుగులతోతీరంచేరి, మందమలయానిలునితో, స్వాగతంచెప్పించింది. సుఖంగాసోకిన మలయానిలస్పర్శతో ప్రాణం లేచి వచ్చినట్లయిందా పాంథులకు. రాముడు మంత్రివంక చూచి, "మంత్రీ రథం శృంగిబేరపురానికి పోనియ్. అక్కడ విశ్రాంతి తీసుకుందాం" అని చెప్పాడు. ఆ ప్రదేశానికి రథంచేరగానే, "పత్ర పుష్ప ఫలభరితంగా, విస్తృతంగా వున్న ఇంగుదీ వృక్షం (గారచెట్టు) దగ్గరకుపోనిచ్చి, అక్కడ నిలుపు. ఆ చోటు వాసయోగ్యంగా వుంది. మిక్కిలి చేరువుగా వుండటంచేత, గంగా సందర్శనం పరిపూర్ణంగా కలుగుతుంది. స్నానపానీయాలకుకూడాసుఖంగా వుంటుంది" అని అనగానే సుమంత్రుడు రాముని వాక్యానుసారం రథాన్ని తోలి చెట్టుదగ్గర ఆపాడు. ముందుగా సుమంత్రుడు దిగాడు. సీతారామలక్ష్మణులు క్రమంగా దిగారు. అంతా దిగింతర్వాత సుమంత్రుడు గుర్రాలను పూడదీసి, నీరుపెట్టి, మేతవేసి, వృక్షమూలంలోకూర్చున్న రామచంద్రుని సమీపించాడు. ఆ సమయంలో, నిషాదకుల శ్రేష్ఠుడూ, భీమబలుడూ, మెలితిరిగిన మీసాలతో, పెట్టెతలపాగాపై నెమలికన్నుల కుచ్చుతో,పల్లెవాటుగాధరించినపులిచర్మంతో, బంటుతనంబలిసికండలు తిరిగిన రెండుభుజాలకూ తొడిగిన కడియాలతో, మొసలిమొగం పిడి బిగించిన రాజదండంతో, వయసు జారుతున్నా బింకం తగ్గక, పొంకంగా కనుపించే పెద్దయెనురురొమ్ముతో, చమరీమృగచర్మంతోతయారుచేసిన మెత్తని చెప్పులతో, నవ్వకపోయినా నవ్వినట్లున్న విశాలవదనంతో,

ఒత్తుగా పెరిగిఅర్ధచంద్రాకారంలో నొసలు ఆక్రమించిన కనుబొమలలో, పిన్నలూ, పెద్దలూ, మంత్రులూ, చుట్టాలూ,మిత్రులూవెంటరాగా,భార్యా సమేతంగా రామయ్యవచ్చి ఇక్కడ విడిదిచేశాదన్న సంగతివిని, కాలి నడకనువస్తున్న గంభీరమూర్తిని దవ్వునవుండంగానే రాముడుచూచి, పొంగి, ఎదురుగాపోయి ఆహ్వానించాడు.

## గుహుడు శ్రీరాముని సంపర్శించుట

రామచంద్రుని నిలువెల్లాచూచి, నీరు కన్నులకు అవరోధంకాగా, గాఢంగా ఆలింగనంచేసుకున్నాడు. "అంతావిన్నాను రామయ్యతండ్రీ! ఈస్థితి నీకూ, లోకానికీ కష్టమైతే కావచ్చుగాని నాకుమాత్రం ఎంతో ఇష్టంగావుంది. ఎవరేమనుకున్నా వున్నమాటఅనేశా. కాకిచేత కబురు పెడితే మీపాదాలకాడికి నేవస్తా. కాని, నాకోసం ఈకారడవికి నీవెందుకు వస్తావ్? అందులోసీతమ్మతల్లితో, లక్ష్మయ్యబాబుతో. నేనూ, నాఇంటిదీ చేసుకున్నపున్నెం ఎవళ్ళూ చేసుకోలేదు. నీకు ఈదకీ, అయోధ్యకూ తేడా ఏంలేదు. ఈ అడవంతా నీచలవన నా ఏలుబడిలోనేవుంది. వున్న దాంటో లోటేంరాదు. అదిగోచూడు. వెదురుబియ్యంలో వండిన అన్నం, కొండగోంగూరపచ్చడి, వులవపప్పు, తేనే, మాంసం, పాలు, జున్ను మీగడ, కస్తూరి, పునుగు, జవ్వాది, గంధం, నెమలిఈకల విసనకర్ర, పనివాళ్ళు. దొరా! నీవా గద్దెమీదుంటే చాలు. నాబతుకు పండుద్ది. పడుకోటానికి పట్టువి లేకపోయినా, దూదిపరుపులుండయి. పొగరెక్కిన మంచిజాతి గుర్రాలుండై. ఏంకావాలోచెప్పు. నేను నీవోణ్ణేగా. బెరుకు పెట్టుకోకుండాచెప్పు, కోరినపండ్లున్నై. అలిసిపోయుండారు. చిన్నమ్మా, చిన్నాయనా మరీ సొక్కిపోయుండారు. నీవుకానంతనంజితే ఆళ్లకూడా నంజుతారు" అంటూ పాదాలుపట్టుకునికూచున్న పరమభక్తుణ్ణి, రెండు చేతులతో గుండెకు హత్తుకుని "మిత్రమా! నీ పేరులాగానే, నీ ఆదరణా, భక్తీ, హృదయం, అగాధమైన గుహే.

రాజలాంఛనాలన్నీ వదలి, నాకోసం కాలినడకలో వచ్చినప్పుడే నీవిచ్చే ఆతిథ్యం అంతానాకు చేరింది. స్నేహభాషణంతోతృప్తికలిగింది. నిర్మల హృదయంతో, నిండిన ప్రేమతో, నిశ్చలభక్తితో నారాకను

హర్షించి, ఫుచితపదార్థాలు కొనివచ్చి సత్కరించావు. నీ మర్యాదలకు నేనెంతో సంతోషించాను. అన్నీ మనఃపూర్వకంగా అందుకున్నానని మాట ఇస్తున్నాను. ఇంకొక సమయంలో ఐతే బాహ్యస్వీకారం కూడా చేసేవాణ్ణి. ఇప్పుడు వ్రతదీక్షితుణ్ణి. ఈ సుఖోపజీవనం వాంఛిస్తే అయోధ్య వదలటం దేనికి? అక్కడ పరిత్యజించిన భోగభాగ్యాలు మరొకచోట గ్రహించటం ఆత్మవంచన అవుతుంది. నీవు ధర్మమార్గం తప్పనివాడవు. నా మాట యందు విశ్వాసం కలవాడవు. నీసత్కారం గ్రహించలేదని అన్యధా భావించవద్దు. నారగుడ్డలూ, జింకచర్మందాల్చి, అడవుల్లో దుంపలతో, పండ్లతో ఫుత్తు తీర్చుకుంటూ, మునివేషధారినై సుందర దృశ్యాలను చూస్తూ, మహర్షుల దర్శిస్తూ పధ్నాలుగేండ్లు గడిపి, తిరుగుప్రయాణం చేసినప్పుడు నీ ఆతిథ్యం అందుకుంటాను. "మిత్రమూ పదజానీయాత్" అన్న సూక్తి నీపట్ల సార్థకమైంది. నీచేతిలో నీకిష్టమైన వదార్థాన్ని పట్టుకో. నేను తీసుకుని నీకిస్తాను. నావట్ల నీ హృదయం నొచ్చుకోవటం నేను సహించలేను." అనగానే గుహుడులేచి తలపాగను తీసి మంత్రి కిచ్చి రెండు పాదాలపై తలపెట్టి "రామయ్య తండ్రీ! గ్రహించు" అన్నాడు. రామచంద్రుడు ఆనందాశ్రులు రాలుస్తూ, సర్వజగజ్జాల రక్షా దక్షమైన దక్షిణహస్తం చాచి, కౌశికమహర్షిఅస్త్రమంత్రోపదేశసమయంలో ధారపోసిన జలంతో పవిత్రమైనదీ, జనకుల సంతృప్తికై పరమశివుని ధనుస్సును సజ్యంచేయటానికి నారిని ధరించుటచే పూతమైనట్టిదీ, కల్యాణ సందర్భం, లోకకల్యాణ కారకమైన మంగళసూత్రందాల్చి జానకి కంఠా భరణం చేయటంలో వెలుగులు చిమ్మిందీ, తలంబ్రాలుపోసే వేళ జాలి ముత్యాలుతాల్చి తళుకు నీనిందీ ఐన పాణిపంకేరుహం తలపైవుంచాడు. బ్రహ్మాదిదేవతలు జీవాత్మ పరమాత్మల అనుసంధానంగా ఆనందించి, గుహుని మిత్రాసక్తిని మెచ్చుకున్నారు. గంధవాహుడు గారచెట్టును కదలిస్తూ పూలవాన కురిపించాడు. రఘువంశమణి, పాదతలంపై తల వుంచిన మిత్రుణ్ణిలేపి తనప్రక్కగా కూర్చోబెట్టుకుని "మిత్రమా! ఎంద రెందరో తమ అమూల్యమైన ఆత్మధనాన్ని నావద్ద దాచుకుంటున్నారు. తిరిగి మీకు తీర్చేవరకూ ఋణగ్రస్తుణ్నే. తండ్రిగారికి ఈ గుర్రాలంటే ఎంతో ప్రీతి. వీటిని తృప్తిపరిస్తేచాలు. నాకై కూర్చిన వస్తువు

గ్రహించి నంతకంటే ఎక్కువ సంతోషిస్తాను. వాటి ఆహార సౌకర్యం చూడు" అని చెప్పగానే, గుహుడు పరివారం వంక పరికించాడు.

వెంటనే సుమంత్రుని ఆదేశానుసారం ఆ రాత్రికి కావలసినవన్నీ అమర్చాడు. ఆ తర్వాత అందరూ లేచారు. సౌమిత్రి చప్పున గంగకు వెళ్ళి జలం కొనిరాగా, రాముడు సంధ్యావందనం ముగించి, తృప్తిగా జలపానంచేసి, మిత్రుడు అంతకుముందే కూర్చిన పల్లవాస్తరణాలపై జానకితో కలసి శయనించాడు.

## సీతారాములకు ఆ రాత్రి గుహుడు కాపలికాయుట

అన్నా వదినెలకు కాళ్ళుకడిగి తలపై చల్లుకొని, తడి అద్ది, కొంత సేపు వీవనతో విసరి, నిద్రపుచ్చి, సౌమిత్రి వృక్షమూలంచేరి, వారి రక్షణకు ప్రణవారాధనచేసి, ప్రతి అణువులో తనదృష్టిని లీనంచేస్తున్నాడు. సుమంత్రుడు తనకేర్పరచిన శయ్యపై కూర్చున్నాడు. గుహుడు సజ్య శరాసనుడై, మంత్రివద్దకు వచ్చి, జరిగిన సంఘటనలుగూర్చి ముచ్చటించుకుంటున్నారు. కాలం గడుస్తున్నా లక్ష్మణుడు ప్రక్కచేరలేదు. గుహుడు గమనించాడు. సమీపించి "లక్ష్మయ్యబాబూ! నోటిమెత్తని రామయ్యతండ్రి నా సేవ మన్నించాడు. నీ కోసం ప్రక్క ఏర్పాటు చేయించాను. పోయి పడుకో. మీ మీద ఈగవాలదు. ఇకముందు రామయ్య రక్షణ నీవే చేస్తావు. ఈ ఒక్క రాత్రయినా, నాకా పున్నెం దక్కించు. నీ యంతవాణ్ని కాకపోయినా, ఈ అడవిలో నాకు తెలియకుండా కొత్తజీవం చొరబడదు. పడి, బతకదు. నేనూ, నా పరివారం మిమ్మల్ని కాపలాకాస్తాం. నాకురామయ్యకంటే ప్రియుడైనవాడుఇంకోడు లేడు. సత్తెంచెపుతున్నా. మా రామయ్యపై ఒట్టుపెట్టుకుంటుండా. నన్ను అనుమానించకుండా పడుకో" అని బతిమాలుకున్నాడు. ఆ మాటలకు సౌమిత్రి ఎంతోబాధతో "పూజ్యుడా! ఎంతమాట అన్నావు! నిన్ను నేను శంకిస్తానా? అన్న ఆదరణకు పాత్రమైన దేదయినా నాకు శిరోధార్యం. అందులో ఆత్మీయునిగా చూచుకున్న నిన్ను అనుమానించి అన్నకు అవమానం కలిగిస్తానా? లక్ష్మణుడెప్పుడూ రామానుజుడు. అసలు మా అన్నకు ఒకరక్షణ అవసరం అనుకోటం అవివేకం. ఆయనే లోక రక్ష

కుడు. ప్రాకృతభావాలతో ప్రాకులాడటంతప్ప మనం రక్షించటంఏమిటి? నిన్ను శంకించీకాదు. నేను కాపాడుతాననీకాదు. నీవలెనే నాకూ అన్యథా శరణం లేదు. ఎక్కడచూచినా ఆ మూర్తే కనుపిస్తుంది.

## రాముని పవిత్రత్వాన్ని గూర్చి గుహునితో చెప్పి విలపించుట

లోకదృష్టితోచూచినా దుఃఖం కలుగుతూంది. మేం నలుగురం అన్నదమ్ములం. మాలో పెద్దవాడుకదా మీ రామయ్యతండ్రి? ఆయన తండ్రికి ఎంతో ముఖ్యుడుకదా. ఆయన తర్వాత రాజ్యం ఆ రామయ్యకే కదా వస్తుంది? ఈ వరాలేమిటి? ఈ అడవుల్లో కాపరాలేమిటి? ఈ కటిక నేలశయనాలేమిటి? ఈ అరుచికరమైన పదార్థాలు అశనంగాగ్రహించటం ఏమిటి? గృహస్థధర్మం వదలి ఈ బ్రహ్మచర్యం ఏమిటి? ఇదంతా పూజ్యుడా! నన్ను నిద్రపోనిచ్చే ఘటనేనా? ఇక అలౌకికదృష్టిలోచూస్తే ఏదో అనిర్వాచ్యమైన శక్తి మాఅన్నయ్యలో లేకపోతే, పదహారేండ్లకే విశ్వామిత్రయాగ సంరక్షణం ఎలా చేశాడు? అహల్యా శాపవిమోచనం ఎలా జరిగింది? ధరణీపతులందరికీ తాకటానికే భయంవేసిన శివ ధనుర్భంగం ఎలా సాధ్యం ఐంది? వృద్ధులైన తల్లిదండ్రులు నేలబడి రోదిస్తున్నా, కైకమ్మ కడుపుమండించే కఠినవాక్యాలు పల్కినా, కరుడుగట్టినగుండెతో ఒక్కడేకానకు ప్రయాణంకట్టడంమానవులుచేసేపనేనా? అనురాగవతీ, అనుకూలవతీ అయిన సహధర్మచారిణి సరసనవుండగా, బ్రహ్మచర్యంసాధించటంపరమయోగులకైనాఆచరణకందేవిషయమేనా?

ఎంత నిర్మత్సరులమైనా మనం ఎంత భక్తివిశ్వాస తాత్పర్యాలు కలవారమైనా మనం ఆదంపతులవలె నిద్రించలేకపోతున్నాం. ఎందుకు? మనలో ఎక్కడో తెలియకుండా స్వార్థంవుంది. లేకపోతే ఇద్దరం వాళ్ళకోసం కాపుగావుండవలసిన పనేముందీ? నన్ను నీవూ, నిన్ను నేనూ శంకిస్తూనేవున్నాం. ఇది తప్పుకాదు. ఆ మహామూర్తిపైనున్న అచంచల విశ్వాసం. వనపతీ! జరిగిన సంఘటనల సహాయంతో జరుగబోయే పరిణామం వూహిస్తే శుభంగా గోచరించడంలేదు. తనమాట పాటించి తీరాలని తండ్రికి పట్టుదలలేదు. అనృతదోషం అంటకుండా అన్న కాపాడాడు. ఆ కారణంవల్ల తండ్రి పుత్రవియోగంతో ఎక్కువకాలం

జీవించటం కల్ల. ఆయనచావుతో అయోధ్య అరాచకం అవుతుంది. భర్త మరణంతో పతివ్రతలైన భార్యలు మరణిస్తారు. ఈరాత్రి ఐనా అట్టి కీడురాకుండా వుంటుందా? అని సంశయిస్తున్నాను. ఒకవేళ తమ్ముడు శత్రుఘ్ననకై నాతల్లిని పెద్దలు వారించినా, పెద్దమ్మమాత్రంప్రాణాలతో వుండదు.రాజూ,రాణులూగతించినతర్వాత,అనురక్తులైనప్రజలుఅసువులు వదలటమే, అన్యసీమలకు పోవటమే చేస్తారు. రామపట్టాభిషేక వార్త తెలిసి పరుగున వచ్చిన భరత శత్రుఘ్నులు, పట్టభంగంతోపాటు జనక భంగంకూడా చూచి ఔర్ధ్వదైహిక క్రియలు ఆచరిస్తారు. రామవియోగం చేత కొందరూ, రాజమరణంచేత కొందరూ నశిస్తారు. శేషించినవారి నిర్బంధంవల్ల భరతుడు రాజైతే, అంతదాకా తల్లిదండ్రులు జీవిస్తే అన్నయ్యతో, వదినెతో, అరణ్యవాసవ్రతం ముగించి,అందరినీ దర్శించి, సేవించే అవకాశం మాకు వస్తుందా" అని మోచేతి మోకాలు పూతగా చెంపకుచేర్చి లక్ష్మణుడు శోకిస్తుంటే, అరణ్యవాసి అయిన గుహుడు కూడా అమితంగా ఆక్రందనం చేశాడు. సుమంత్రుడు రామధ్యానంలో నష్టుడైనాడు.

## శ్రీరాముడు గంగానది దాటుట

పులుగుల ఎలుగులు పొద్దుపొడుపు సూచిస్తున్నై. మూడోరోజు ప్రభాతంకాగానే, రాముడులేచి శుభలక్షణుడైన లక్ష్మణుని చూచి "తమ్ముడా! నీవూ, మిత్రుడూ కల్పించిన వుపచారాలతో సుఖంగా నిద్రించాం. మీరు నిద్రించినట్లే లేదు. ఎంత వెర్రివాళ్ళు! మాకేదో ఆపద వస్తుందని ఆరాటంతో రాత్రంతా గడిపారు. అడవి అంతా పక్షుల కూతలతో ప్రభావితమవుతూంది. ఇక మనం గంగావతరణం చేద్దాము" అంటూ చెప్పాడు. సౌమిత్రి బోయరాజైన గుహునితోనూ, సుమంత్రుని తోనూ ఆ విషయం ప్రస్తావించాడు. గుహుని కంటికదలికలోనే, గంగా తీరంలో లోకోత్తర సౌందర్యం కలదీ, సుదృఢమైనదీ నౌక, రామపద రజస్స్పర్శకోసం గంగాభంగాలల్లో పరవళ్ళు త్రొక్కుతున్నది.

"రామయ్య తండ్రీ! అల్పుణ్ణి. మీకు చేయతగినంత సేవ చేయ లేకపోయాను. మన్నించు. దోసంవుంటే నీ దయలో ఇముడ్చుకో. నావ

సిద్ధంచేశాం. ఇంక మాకు నీ సెలవేంటో చెప్పు" అంటూ గుహుడు గ్రుడ్లనీళ్ళు కుమ్మరించాడు. "హితుడా! దుఃఖపడకు. కష్టసుఖాలు మానవులకు కాక మాకులకు వస్తాయా? అయినా, ఇది మాకు కష్టంగా అనిపించటంలేదు. బుద్ధిపూర్వకంగా కోరుకున్నదే కనుక. బలవంతమైతే బాధాకరంకాని, ఇష్టమైనప్పుడు కష్టంగా వుండదు. నాకు కాదగినదానికంటే అధికంగానే ఆదరించావు. నీ పాలనంలో అరణ్యవాసులంతా హాయిగా జీవించాలనీ, కలకాలం నీవు ఆరోగ్యభాగ్యాలతో వర్ధిల్లాలనీ ఆకాంక్షిస్తున్నాను. నా వెంటవచ్చిన వస్తువులను నావలోకిచేర్పించు" అని పల్కుతూ నావదరికి నడక సాగించాడు. ఖడ్గచాపహస్తులైన నిషాదవీరులు ముందూ వెనకా నడుస్తున్నారు. గుహుడూ, అతని ఇల్లాలూ, బిడ్డలూ కుడి ప్రక్కనూ, సుమంత్రుడూ, మంత్రులూ, పెద్దలూ ఎడమ ప్రక్కనూ, రామునివెనుక సీతా, ఆమె వెనుక సౌమిత్రీ తీరం చేరారు. నావ ఎక్కబోతున్న రాముడిపాదాలు నిషాద దంపతులు కడిగారు. నారవస్త్రాలూ, ఖడ్గం గుహుడీయగా, పసుపూ, కుంకం, పళ్లూ, పూలూ, ఆయన భార్య సీతమ్మకు ఇచ్చింది. రాముడూ, గుహుడూ దీర్ఘంగా ఆలింగనం చేసుకున్నారు. సీతమ్మపాదాలు నిషాదిని కళ్ళకద్దుకుంది. ఆత్మీయులైనవారు కూడా, ఆ యెడబాటును అంతగాఢంగా భావించరు. కాని, వారుమాత్రం చాలా బాధపడ్డారు. సౌమిత్రి, ఆ దంపతులపట్ల వాళ్ళుచూపే భక్తి విశ్వాసాలు తనలో ఎంతవున్నాయో అని ఆత్మశోధన చేసుకున్నాడు.

మాట్లాడలేక మౌనంగా శోకిస్తున్న మంత్రినిచేరి, రాముడు రెండుచేతులూ పట్టుకుని "ఇక మాకు సెలవిచ్చి పంపు. తండ్రి తర్వాత తండ్రివంటి వాడవు. నీ పవిత్ర హస్తాల్లో, నీ తీయని గుండెపై ఈ నాశరీరం పెరిగింది. నాతండ్రికి సన్నిహితుడవైన మంత్రివీ, సఖుడవూ, సారథివీ, నీవొక్కడవే. మరలి పురంచేరి మా తండ్రిని జాగరూకతతో కాపాడవలసిన భారం నీమీద వుంది. మా ఎడబాటు నీకు దుస్సహం అని ఎరుగుదును. ఐనా కొంతకాలం తప్పదు. ఇంతదూరం కాలు కందకుండా రథంమీద తెచ్చి ఎంతోమేలుచేశావు. ఇకమేం పాదచారులుగానే సంచరిస్తాం. రథారూఢుడవైపోయి, రాజదర్శనంచేసి మా కుశలం గూర్చి చెప్పు."

## సుమంత్రుడు తన్నుగూడ కొనిపొమ్మని రాముని వేడుట

అనగానే "రామా! గార్హస్థ్యధర్మంలో వున్నవారే నీ కోసం ఇంత బాధపడుతుంటే, వృద్ధుడనై, వేదకర్మానుష్ఠాన శీలినై, బ్రహ్మచర్య వ్రతంలో వానప్రస్థజీవితంగడుపుతున్నది హృదయంలోనిన్నునిల్పుకుని కదా. అడవికిపోతే, నాశ్రమకు ఫలితం ఎక్కడ? అసాధారణ అదృష్ట వంతుల్లో అయోధ్యాపతులు ఇంకా అదృష్టవంతులు. ఆకోవలో నీ వింకా అదృష్టవంతుడవు. వారంతా, ఆదర్శాలూ వున్నతాశయాలూ కలవా రైనా,అధికారంతోనూ,అవకాశాలతోనూసాధించారు.ప్రధానమైనరెండూ పరిత్యజించి, ఆచంద్రతారార్కస్థాయిగాకీర్తిని అందుకున్నావు. అందులో కూడ అడవుల్లో కాయా,కరుకూతిని, ఎడనీళ్లుత్రాగి,నీకు నీవేసాటి. నీవు కానల్లో కష్టాలుపడతావని నేనువిచారించటంలేదు. నీదర్శనందీర్ఘాతిదీర్ఘం అయిందే అనిమాత్రమే.నేను పోయేవరకూ ముందు సంగతిగూర్చిముచ్చ టించేవారే వుండరు.ఐనా నీతో నేవుండాలనివుంది.నీవుసమ్మతిస్తేనాజన్మ కూడా చరితార్థమవుతుంది. స్వతంత్రురాలైన కైకమ్మకు మా మంత్రాం గంతో పనిలేదు. పైగా మొన్న కఠినంగాకూడా పల్కాను. అంత అవసరంవస్తే మిగతామంత్రులు వుండనేవున్నారు. ఈ చరమజీవితం కూడా నీ సేవలోనే గడుపుతా. నాకుమాత్రం ఏం కావాలి? ఆ వేళకు మీతోపాటు మాసీతమ్మతల్లి ఏంపెట్టినా అమృతోపమానంగాఆరగిస్తాను. మీరు బయటికివెళ్ళినా, అమ్మాయిని చూచుకుంటూ, ఆమాటా, ఈమాటా ఆడుకుంటూ కాలక్షేపంచేస్తాను" అని సుమంత్రుడన్నాడు.

## సుమంత్రుని రామచంద్రుడు సమాధానపరచుట

గుండెలుకరిగించే ఆ వాక్కులకు, సజలనయనుడైన రాముడు సంబాళించుకుని, నీటినిగోటితోమీటుతూ, "అమాత్యవర్యా! నీవలెమాకూ ఎడబాటు అంత కష్టంగానూవుంది. నీరాక మాకు సమ్మతం అయినా, ఎందుకు అయోధ్యకు పొమ్మంటున్నానో ఆలోచించు. అమ్మా, నాన్న వృద్ధులు. మా రెండోతల్లి సుమిత్రమ్మ విరాగిణి. అమ్మ నాకోసం అన్న పానాలువదలి అల్లాడిపోతూ మంచంలొాడుగు అవుతుంది. తండ్రి నాకై దుఃఖభారంలోక్రుంగిపోతున్నా కామభారచలితాత్ముడు. కైకమ్మప్రీతికై

కాని కార్యాలు ఎన్నో చెప్పవచ్చు. తక్కినవారు తిరస్కరిస్తారు. నీవు ఆయనకు విశ్వాసపాత్రుడవు. కాదనకుండా చేయగల ఘటికుడవు. భరతుడు వచ్చేవరకు ఆమె చెప్పినట్లు ఆయన చేస్తాడు. అందుకు నిందించకుండా అమలుచేయించు. రాజులు రాగగ్రస్తులైవున్నప్పుడు పెద్దల మాటలు పెడచెవి పెడతారు. నీకు చెప్పవలసిన నీతులేమున్నవి? ఇంత కాలం లోకంఅంటే తెలియని మా తండ్రి కాముకుడైనా, విశుద్ధచరిత్రుడు. యజ్వ, వేదవేదాంగార్థవిదుడు. ధర్మాత్ముడు. ఆయన మనస్సు వికలం కాకుండా చూచే నేర్పు నీకేవుంది.

నీవు ఆయనను దర్శించినప్పుడు నామాటలుగా చెప్పు. "నీకొడుకులూ, కోడలూ, అరణ్యవాసాయాసం ఏమీ పొందటంలేదు. సంతోషంగానే దండకకు తరలివెళ్ళారు. నియమితకాలం గడువగానే నీసేవకై తిరిగి వస్తారు. నీ ఇష్టానుసారంగానే మెదలుకుంటారు" అని పాదాభివందన పూర్వకంగా తల్లులందరిక్షేమం అడిగాడని చెప్పు. ఆలస్యంలేకుండా భరత శత్రుఘ్నుల పిలిపించి పట్టాభిషేకం జరిపించు. ఆ సమయంలో అన్న ఆలింగనంచేసుకుని ఆశీర్వాదంచేసినట్లుగా భావించమన్నాడని విశదంచేయి. సూర్యోదయమైంది. గంగదాటటానికి కాలం మిక్కిలిగా పట్టుతుంది. వేరుమాటచెప్పక వెంటనే అయోధ్యకు వెడలిపో. నా కఠినత క్షమించు" అని రాముడన్నాడు.

## రాముని విడలేక మళ్ళీ మళ్ళీ మంత్రి శోకించుట

ఆ మాటలకు సుమంత్రుడు కన్నీళ్ళు కాల్వగా ప్రవహింప, "రామా! సర్వప్రాణి హృదంతరవర్తివైన నీవు నా హృదయసంకటం గుర్తించలేదా? ఇప్పటి నాస్థితి ఎంత సున్నితమైందో నీకు తెలియదా? నిన్ను బలవంతపెట్టి బాధించటంలేదు. నిన్ను వేడుకుంటున్నాను. భక్తునిగా మిత్రునిగా భావించి నామాటలు విను.

చేతికందిన కొడుకును గోతిపాల్జేసి ఘోరంగావీడ్చే తల్లిలాగా వున్న అయోధ్యకు, అడవికి నిన్నప్పగించి ఎలా పోయేది?

మీతోకూడిన రథం తోలుకునివచ్చి, మీరులేకుండా ఏవిధంగా తోలుకునిపోయేది? రిక్తగావచ్చిన తేరుచూచి అయోధ్యావాసులంతా

"మా రామయ్యఏడి? మా సీతమ్మఏది? మా లక్ష్మయ్యఏ"దని పేరు పేరుగా పిల్చి అడిగితే ఏమని సమాధానం చెప్పేది?

మీరు రథంలో వున్నప్పుడే ఎంతఏడ్చారో పౌరులు, నీవుకూడా చూశావుకదా? ఇకమీరు లేకుండావచ్చిన రథంచూచి ఏడ్చేవాళ్ళను చూచి నేనెలా బ్రతికేది? ఏమనిచెప్పి శాంతింపచేసేది?

మందిరం వెలికిరాని మానవతి పెద్దదేవి, నారాకతెలిసి నడిచి వచ్చి "బిడ్డలెక్కడ నాయనా?" అంటూ అడిగితే, "మీ అన్నగారి ఇంట్లో దించివచ్చా"నని అబద్ధం ఆడనా? "అడవిలో వదలివచ్చా"నని పాపపు సత్యం పల్కనా?

నీ మచ్చిక తెలిసిన గుర్రాలు, నీవులేవని తెలుసుకుని ముందుకు సాగక మొకరిల్లితే వాటిని కొట్టనా? తిట్టనా?

అన్నమాటకైకన్నకొడుకును తండ్రివదలితే, తనయుడు తండ్రి మాటకు సర్వం వదిలాడు. మీరు మీధర్మాన్ని పాటించారు. నాధర్మాన్ని నేను పాటిస్తాను. "ఎందుకు రథం ఆపలే"దని రాజడిగితే, "వినపడలే"దని అనృతం నేను ఆడలేను. పౌరుల దుఃఖంచూచి భరించలేను. మొండికెత్తిన గుర్రాలను చెండుకుంటూ తోలలేను. అడవిలో విడిచి వచ్చానని అమ్మలతోనూ, అయ్యలతోనూ నేను చెప్పలేను. నామొర విని రమ్మంటే మీవెంటవస్తాను. నాకోరిన అర్థం వ్యర్థంచేస్తే, మండేమంటలో రథం కూడి మరణిస్తాను. అంతేకాని, జీవచ్ఛవంగా అయోధ్యకుమాత్రం పోలేను" అని రాముని కాళ్ళపై సాగిలపడ్డాడు. ప్రజారంజకుడూ, ప్రేమార్ద్రహృదయుడూ అయిన రాముడు ఆమాటలకు తట్టుకోలేక పోయాడు. వెన్నవలె సున్నితమైన మనస్సు కరిగింది. కాని సుమంత్రుడు అయోధ్యకుపోవటమే శుభకరం.

## శ్రీరామ లక్ష్మణులు జడలు దాల్చుట

అందుకు మార్గాంతరంఏమిటి? ఆలోచించాడు రాముడు. ఆఖరు మాటగా "పరమభక్తుడవేకాక, భర్తృవత్సలుడవుకూడా, నేను నిజం తెలుసుకోలేని నిష్ఠురుడనుకాను. నిన్ను అయోధ్యకు పొమ్మన్న కారణం కొంతచెప్పాను. అలా చెప్పటంలో కొంత అర్థంవుంది. అలౌకిక ప్రజ్ఞలకు

71163

అప్పటికప్పుడు సంతోషించినా, ప్రజలు లోకసామాన్య విషయాలకే లోపడతారు. నీవు రథంలోపోతే రామాదులు నిజంగా అడవికిపోయారని కైకమ్మ పిన్ని నమ్ముతుంది. ప్రజనమ్ముతుంది. ఆమెకు విశ్వాసం కలగగానే, వంచన లేకుండా అన్నమాటభర్త చెల్లించి సత్యవంతు డైనాడని నాతండ్రిని ఎంతో గౌరవిస్తుంది. ప్రేమతో చూస్తుంది. నీవు పురానికి పోవటం వల్ల రెండు మంచి పనులు జరుగుతై. "ఏకక్రియాత్ ద్వర్థ్యకరీబభూవ" అన్నట్లు.

నీ అభిమాన పుత్రుడి ముద్దు చెల్లించినట్లూ, కైకమ్మకోరికా, రాజుమాటా దక్కించినట్లూ, రాజశాసనం ఎటువంటిదైనా ఆచరించా నన్న తృప్తి నీవు పొందినట్లూ అవుతుంది. అంతేకాని, నీరాక నాకు ఇష్టంకాక కష్టం ఎలా అవుతుంది? పూజ్యుడా! నీకు ఇంతగా చెప్ప వలసిన పనిలేదు. జీవించివున్నంతకాలమే ఈసంబంధ బాంధవ్యాలూ, మమకారాలూ. ప్రాణంపోయినతర్వాత, ఇంత వ్యామోహపరచిన శరీరం ఇంట్లోవుండటానికే లోకం ఇష్టపడదు. నీవు అంతర్ముఖుడివి. జ్ఞానివి. ప్రాకృతునిపలె బాధపడవచ్చునా? ఏది విహితంగా విధించబడిన కర్మో, దానిని చేసితీరాలి. నీవేదో నాకు శాశ్వత ప్రతిష్ఠ వస్తుందన్నావే, అవిధంగా జరిగితే నాతోపాటు నీపేరూ శాశ్వతంగా చరిత్రలో నిల్చే టట్లు దైవం అనుగ్రహిస్తాడు. విషాదం వదలి, సత్వరం నగరానికి పోయేందుకు నమ్మతించు" అని నమ్మతింపచేశాడు.

ఆతర్వాత గుహునిచూచి, "నిషాదపతీ! ఈ ప్రదేశమంతా జనా కీర్ణం. ఇక్కడమాకు వుండతగదు. ఆశ్రమవాసులకు అర్హమైనవిధంగా, జటాధారి నవుతాను. నా ఈ చర్య నా తమ్మునికీ, నా సతికీ హితం కలిగించుగాక." అన్నంతలో మర్రిపాలు కొనిరాబడినై. లోకోత్తర సౌందర్యమూర్తి ఐన శ్రీరామచంద్రుడు కేశబంధం విడదీసి, వట క్షీరంతో జడలు కల్పించుకుని, సౌమిత్రినికూడా అలా చేయమని చెప్పాడు. గుహుడిచ్చిన నార చీరెలు ఇద్దరూ ధరించారు. గుహుని సతి సీతమ్మ పాదాలకు పసుపుపూసి, నిండు చంద్రుణ్ని కాదనే లలాటంలో మధ్యగా కుంకుమతో బొట్టుపెట్టి, ఒడిలో పండ్లూ, పూవులూ పెట్టి, ఏనుగుదంతంలోచేసిన అపూర్వ చిత్రసంతానం

ఇచ్చి, పందిట్లోవుంచుకొని ఆదరించి, అత్తవారింటికిపంపే ఆడబిడ్డవలె ప్రయాణానికి సిద్ధంచేసింది. తలపై కుడిప్రక్కగా ముడీ, పొడవుగా వ్రేలాడేజడలూ, బెండ్లతో, పూసలతోకూర్చిన దండలు మెడలో, అంబుల పొదీ, విల్లూదాల్చిన రామలక్ష్మణులు, బ్రహ్మక్షత్రతేజాలు సంగమించి నట్లూ, లౌకికాలౌకికాలు కూడినట్లూ, ద్వైతాద్వైతాలు ఐక్యంఅయినట్లూ భాసించి, ఒక వినూత్నమైన అందాన్ని ఆవిష్కరించారు. పల్లెపడుచుల నిసర్గశోభా, పట్టణవాసులఅలంకరణశోభా, సీతమ్మలోచిగుళ్లుతొడిగినై.

హృదయభారంతో మిత్రులుఇచ్చిన వీడ్కోలు అందుకుని రామ చంద్రుడు నావనుసమీపించాడు. తమ్మునిపిలిచి "నీవు పడవ కదలకుండా పట్టుకో"మ్మని చెప్పి, సీతను పదిలంగాఎక్కించాడు. తర్వాత సౌమిత్రి ఆరోహించాడు. రామచంద్రుడు అందరికీ అభివాదాలుచేసి, ప్రతి నమ స్కారాలు అందుకుంటూ అందులోప్రవేశించి, నావికులకు నడపమని అనుమతినిచ్చాడు. కర్ణధారి, నారికేళఫలాలుకొట్టి నదిలోపడవేసి, జ్యోతి వెలిగించి, గంగమ్మను పూలతోపూజించాడు. నావికులందరూ "అమ్మా! గంగమ్మా! నీనిండైనచల్లని గుండెల్లో మమ్మల్ని చూడు. ఒడుదుడుకులు లేకుండా ఒడ్డుకుచేర్చు, తల్లీ! నీబిడ్డలం. మా ఏడికోళ్ళందుకో"అంటూ వేడుకున్నారు. కిరకిరశబ్దంతో తాడు సాగుతుంటే, మెట్టుమెట్టుగా తెర చాప మీదికిలేచింది. "రామయ్యతండ్రికీ ప్రేమతో దండాలు, సీతమ్మ తల్లికీ కోటి జేజేలు. లచ్చుమయ్యా మాకుఇచ్చు దీవనలూ" అంటూ తెడ్లు గంగాజలంలోకి దింపారు.

## గంగాదేవిని సీత ప్రార్థించుట

ప్రవాహాన్ని పాయలుగాచీలుస్తూ, వుత్సాహంగా శబరనావికులు నడుపుతుంటే, వూగుతూపోతూ, యాత్రికులకు వుల్లాసంకల్పిస్తూ, ఓడ నదీమధ్యప్రదేశంచేరింది. ఒడ్డొరసిపాడుతూ, సుళ్ళుతిరుగుతూ, గలగల నినదిస్తూ, ఎటుచూచినా విశ్వరూపంధాల్చినవిధంగా తానే కనిపిస్తున్న గంగాదేవిని, కనులపండుగ్గా కాంచి, జానకితనఒడిలోనిపూలూ, పండ్లూ, పసుపూ, కుంకుం దోసిటిలోపెట్టుకుని "తల్లీ! భాగీరథీ! నాభర్త పద్నాలు

గేండ్లు అరణ్యవాసం ఏఅంతరాయంలేకుండా ముగించుకునేట్లు అనుగ్రహించు. నీవు త్రిలోకపావనివి. సముద్రుని పట్టపుదేవేరివి. పాపనాశనివి. పరమ తపోధనుల ప్రస్తుతులకు పాత్రురాలవు. జీవకోటికినీవే జీవనాధారవు. దేవతలు నీలో మునుకలాడి బ్రహ్మహత్యాది పాపాలు పాపుకున్నారు. నీ తీరప్రదేశాలు ధనధాన్యాలకు నివేశాలు. నీజలపానం, సర్వరోగపరిహార నిదానం. నీసేవ, భవసంతరణానికి త్రోవ. నీ అనుగ్రహం ఆనందానికి నిలయం. నీ ఆగ్రహం సర్వజగత్ప్రళయం. తమ్మునితో, నాతో, నా నాథుడు క్షేమంగా తిరిగివచ్చేటప్పుడు, నీ తీరక్షేత్రాలనూ, నీ తీర్థదేవతలనూ నిన్నూ, నీతంగా పూజిస్తాను. రాజ్యప్రాప్తిఅనంతరం, బ్రహ్మవిదులైన బ్రాహ్మణులకు, నీకు ప్రీతిగా వేల సంఖ్యలో గోవులదానం చేస్తాను. వస్త్ర భూషణాలతో, సంతర్పణలతో అశేషప్రజానీకాన్ని ఆరాధిస్తాను. దీర్ఘ సుమంగళివైన నీవు నాకు కూడ ఆ వరం అనుగ్రహించు" అని ప్రార్థించి, అంజలిలో వున్న వస్తువులను ఆ తల్లికి సమర్పించింది.

ఇంతలో పడవ సురక్షితంగా దక్షిణ తీరం చేరింది. సరంగుల్లో కొందరు ముందుగా దిగి, సమతలానికి ఓడను చేర్చి, కొయ్యలు పాతి' కదలకుండా త్రాళ్ళను లాగి బిగువుగా బిగించారు. రాముడు దిగి సీతను అందుకుని దించాడు. సౌమిత్రి తండ్రి ఇచ్చిన సామాన్లు దించి తాను కూడాదిగాడు. "తమ్ముడా! చేరవలసినచోటికిచేరుకున్నాం. జనసంచార శూన్యం, భయంకర మృగకుల సంకులం అయిన ఈ మహారణ్యంలో మనం ముందుకు పోవలసివుంది. ముందుగా నీవునడువు. నీ వెనుకగా నీ వదినె వస్తుంది. నేను మీఇద్దరిని కాచుకుంటూ వెనకవస్తాను. దారి సరిగా లేనిచోట సీతను మెల్లగా నడిపించు. తీగలూ, ముళ్ళకొమ్మలు వున్నచోట, ఖడ్గంతో, ఛేదించి వీలు కల్పించు. జరుగకముందే జాగ్రత్త పడాలి. జరిగితే చక్కబెట్టుకోటం సాధ్యంకాదు. కోసురాళ్లూ, గుంటలూ, మెరకలూ, పొదలూ, భయంకర సర్పాలూ, తేళ్లూ, మండ్రగబ్బలూ, నక్కలూ, తోడేళ్లూ, పులులూ, సింహాలూ, పల్లేరుగాయలూ, బలుసుముళ్లూ, తుమ్మ ముళ్లూ. కాలు కదపటానికి అవకాశంలేని అడవి సుఖం ఇక అయోనిజ, ఎలావుంటుందో అనుభవ పూర్వకంగా తెలుసుకుంటుంది"

అన్నాడు. జానకి భర్తమాటలు విని, "స్వామీ! మీరిదివరకు ఇదంతా అనుభవించి తెలుసుకున్నారు. ఇక నావంతు వచ్చింది. మెలకువతో తెలుసుకుంటాను. మీరు వర్ణించి చెప్పినవన్నీ అడవిలో వుండక అయోధ్యలో వుంటవా? అవి ఎంతోపుణ్యంచేసుకోబట్టే మీరు వుచ్చరించటం జరిగింది. ఇక మిమ్మల్ని దర్శించి తరించటం జరుగుతుంది. మరదీ! ఎండఎక్కువ గాకముందే కొంతదూరం పోదాం. నాకోసం చూడక, ముందు దారి చూడు"మని అన్నది. "వదినా! నిన్నూ, అన్ననూ, దారినీ కూడా చూస్తున్నాను. నడకసాగటంలేదు. ఈ దారి కొంత నలిగి వున్నది. వనేచరులు నీళ్ళకోసం గంగానదికి పోయి వచ్చేదికావచ్చు. సుగమంగా నడవవచ్చు" అంటూ నడక సాగించాడు.

త్రిమూర్తులైనా శరీరధారణతో, దురతిక్రమమైన ఏ మహాశక్తికి లోపడతారో, ఆ మహామాయ శ్రీమహావిష్ణువు ఆజ్ఞానుసారం రాముడు గంగానది దాటగానే దండకాటవిలో ప్రవేశించింది. "ఈయన ఇలాగే స్వాత్మరతుడైవుంటే,దుష్టశిక్షణగానీ,సాధురక్షణగానీ,రాక్షససంహారం గానీ జరుగదు. పూర్ణంగా మానవభావం పొందకపోతే, లక్షించిన కార్యం సిద్ధించదు. సూర్యాస్తమయం కావస్తున్నది. ఈరాత్రికి వాసయోగ్యంగా వుండే చోటుకోసం వెతుకుతాడు. ఆ కనుపించే చెట్టు విశాలంగానూ, క్రింద సమతలంగానూ వుంది. ఆ చెట్టును ఆశ్రయిస్తాను. అక్కడికి చేరగానే ఆవేశిస్తాను" అనుకుంటూ అదృశ్య అయింది. దారిలో రెండు కుందేళ్ళను, ఒక అడవిపందినీ వధించి, మాంసం ఆకుల్లో భద్రపరచుకుని సమీపంలోవుండే చెట్టును చేరుకున్నారు. తెచ్చుకున్న గంగాజలంతో వార్చి, పగలంతా మార్గాయాసంతో వున్నారుకనుక ఆహారంగైకొని ఆకలి తీర్చుకున్నారు. వస్తూ తెచ్చుకున్న ఆకులు ప్రక్కలుగాపరచి, సౌమిత్రి అన్ననూ, వదినెనూ పడుకోమన్నాడు. రాముడు శయ్యచేరి లక్ష్మణుని పిల్చాడు. సీత దేహశ్రమవల్ల వెంటనే నిద్రపోయింది. మహామాయ రామునిలో ప్రవేశించింది.

## జననీ జనకుల తలచి రాముడు దుఃఖించుట

లక్ష్మణుడురాగానే రాముడు, "తమ్ముడూ! మనం అయోధ్యవిడిచి

ఇది మూడోరాత్రి. గడచిన రెండురాత్రులూ, జనంమధ్యలో గడిపాము. ఒంటరిగా మనం వుండటం ఇదే ప్రథమం. గడచిపోయిన సంగతులు గుర్తుకుతెచ్చుకుని కలతపడవద్దు. ఇద్దరం నిద్రమాని రాత్రులు సీతను రక్షించుకోవాలే. ఆ భారం మనపైవుంది. ఆ చిన్నబండలు దిండుగా పెట్టుకుందాం తీసుకురా!" అంటూ అమలుపరచిన కటికనేలపై ఆసీను దయ్యారు. కౌశికమహర్షిచెప్పిన కథలు గుర్తుకుతెచ్చుకుంటూ, మాటల మధ్యన రాముడు "సోదరా! అయోధ్యలో మన జనకుడు, మనలను తలుచుకుని మంచంపడతాడు. కైకమ్మ పట్టునెగ్గిందని సంతుష్టిపొందు తుంది. భరతుడురాగానే పట్టంకట్టమని ఆయన్ను ప్రాణాలుతోడు తుందేమో. ఏంచేయటానికి వృద్ధుడు. ఆమె వలపువలలో చిక్కు కున్నాడు. ఆయనను చూచేదిక్కులేదు. నేను దూరంగావుంటినిగదా.

మనకుచెడ్డజరిగింది,తండ్రికిమతిచెడింది. ధర్మార్థాలకంటేకామం మిక్కిలి బలీయమైంది. "బలవానింద్రియగ్రామో విద్వాంసమపికర్షతి" అన్నారు ఇందుకొరకే. నామాట కాదంటే, కన్నుల్లో పెట్టుకుని పెంచిన నన్ను, చిన్నభార్య తృప్తికై తండ్రి విడనాడుతాడా? కామాసక్తుడు వివక్షతలేకుండా కార్యాలుచేస్తాడు. కైకమ్మబిడ్డ కావటంచేతనేభరతుడు మహా కోసలాధిపతియైపాలిస్తాడు, శత్రుఘ్నుడు. నాకై నీవుత్యాగివైనట్లే భరతునికై తనసర్వంత్యాగంచేస్తాడు. తండ్రివృద్ధు. దారుణమైనఅరణ్యా లలో నేనువున్నాను. విశాల విశ్వం భరతుడు ఏకచ్ఛత్రంగా ఏలుతాడు. ఎవడు ధర్మ సహితంగా అర్థంకూర్చడో, మోక్షదృష్టి యుక్తంగాకామం అనుభవించడోవాడు, మన తండ్రిలాగా అనర్థపరంపరలకుఆలవాలమవు తాడు. భర్త ప్రాణాలు హరించటానికీ, ఆయనపెద్ద కుమారుని గద్దెదించి, కారడవుల పాల్చేయడానికి, కొడుక్కు రాజ్యంకట్టపెట్టడానికి కైకమ్మ కాపురం చేసిందికాబోలు. నాపై కత్తికట్టిన పిన్నమ్మ నాతల్లినీ, నీతల్లినీ ఎంత సాధిస్తుందో,ఎంతబాధిస్తుందో.

తమ్ముడా! మరొకవిధంగా అనుకోకు. నాకోసం సుమిత్రమ్మ దుఃఖించటం, మరదలు వూర్మిళ కుమ్ములోవంకాయవలె కుమిలిపోవటం నాకిష్టంలేదు. తెల్లవారగానే నీవు అయోధ్యకువెళ్ళు. దిక్కులేనితల్లులకు దిక్కు కల్పించు. ధైర్యం చెడిన తండ్రికి ధైర్యం చేకూర్చు. ఎట్టి స్థితి

లోనూ నాతల్లిని కైకమ్మ బాధింపకుండాకాపాడమని భరతునితోచెప్పు. తండ్రి దత్తమైన రాజ్యం ధర్మంగా పాలించి ప్రజల అభిమానానికి పాత్రుడు కమ్మని చెప్పు. నాతల్లి ఏజన్మలోనో తల్లికీ బిడ్డకూ ఎడబాటు కల్గించి వుంటుంది. కాకపోతే, ఈ ముసలితనంలో కొడుకును బాసి గోడు గోడున ఏడుస్తుందా? నాజన్మ మరీ వ్యర్థమైంది. కనిపెంచిపెద్ద చేసిన తల్లిని కాపాడుకోవలసిన కాలంలో, వదలిపెట్టి వనవాసానికి వచ్చిన నేను ఒక కొడుకునేనా? నిరుపయోగంగా బ్రతికే నావంటి పుత్రుణ్ని ఏతల్లీ ఇకముందు కనకుండా వుండుగాక. పంజరంలోవున్న పక్షులపాటి ఐనా కాలేకపోయాను. గోరువంక చిలుకతో "కుటిల చిత్తుడు వస్తున్నాడు. నీ వాడిముక్కుతో వాడి కాలుపై గాటుపెట్టు" అని తల్లి చెవికి ఇంపుగా మాటన్నా అంటుంది. అంతమాత్రంకూడా ఆదరించలేక పోయాను.

సౌమిత్రీ! అంతంత యజ్ఞాలు చేసి అతిలోక సామ్యంగాబిడ్డలను కన్నందుకు తల్లిదండ్రులు నావల్ల ఏం సుఖపడ్డారు? సుఖపడకపోతే పోయారు. ఎంతటి దుఃఖం అనుభవిస్తున్నారు. నేను బ్రతికివున్నా లేని వాడికింద లెక్కే. ఎంత అదృష్టహీనులు తల్లిదండ్రులు? పుట్టుకచేతనే గుండె నిబ్బరం లేనిది. భర్త దృష్టిలో, పట్టపుదేవేరి అయినా,సామాన్య కులస్త్రీ. అల్ప భాగ్య. అమాయకురాలు. అపుత్రవతిగా వుండి,పుత్రార్థం పొందిన తాపంకంటే, నాజన్మవల్ల పుత్రవతియైపొందుతున్న తాపం అంత ఇంత కాదు. నవమాసాలు నన్ను గర్భంలో మోసి,ప్రసవసమయ బాధలన్నీపడి, శిశు సంరక్షణలో ఏహ్యమైన పనులు ఎన్నోచేసి, ఇంతవాణ్ణి చేసిన తల్లి సంతోషానికి ఏంచేశాను. ఆమెను వెంటరావద్దని ఆరనిమంటలో త్రోశాను. ఆదరించిన వారినీ, అభిమానించిన వారిని అంతులేని దుఃఖాగ్నికి ఆహుతి చేశాను. కర్మాధికారం కల్పించడానికి, కైపట్టి పురుషార్థాలు పొందింపవచ్చిన భూపుత్రికి వైఖానసవ్రతం అంట గట్టాను. భరతుణ్ణి సేవించిన శత్రుఘ్నుడు, భార్యతో, సిరిసంపదలు అనుభవిస్తుంటే, నన్ను నమ్ముకున్న నిన్ను, తల్లికీ, దారకూఎడంచేసి, అవతరించలేని అగాధం సృష్టించాను.

# శ్రీరాముని సౌమిత్రి ఓదార్పుట

అయోధ్యయే కాదు-అవనీతలమంతా, నాశరాగ్నికింధనంకాదూ? పారుబోతునా? పరాక్రమహీనుడినా? ఎవరిపై ఆగ్రహించేది? ఎందుకు ఆగ్రహించేది? ధర్మభీతి, పరలోక భయంవదలి, రాజ్యంకోసం తండ్రిని హింసించేనా? మాతృదేవిని మరింత దుఃఖపెట్టేదా? నేను రాజ్యం కావాలంటే అడ్డుకునే వాళ్ళెవరు? పౌరులు నా కోసం ప్రాణాలే బలిపెట్ట సిద్ధమైనారు. అన్నివిధాలా నాయంతవాడవు నీవేనన్ను అనుసరించావు. గుహునికి కోపంవస్తే కోసలమంతా, గంగలో కలిపేదాకా కన్ను మూయడు. సుమంత్రుని మాటకు మంత్రులంతా అంగీకరిస్తారు. ఎవరి కోసం కైకమ్మ ఇంతచేసిందో, ఆ భరతుడే పాదాక్రాంతుడవుతాడు. రాజ్యం వీరభోజ్యమే. కాని, ఇందులో ప్రతి స్పర్థి ఎవ్వడు? కన్నతండ్రి, కన్నుల్లోపెట్టి పెంచినకైకమ్మ పిన్ని. తమ్ముడూ! చూశావుకదా పరిస్థితి? మానవ బలం ఎంతవున్నా, దైవబలం దాటరాదని గుర్తించావా?" అంటూ, అయోధ్యారాముడు కాక, అరణ్యవాస రాముడై అన్నాడు.

లక్ష్మణుడుఅన్న చెప్పినదంతా విన్నాడు. ప్రతి అక్షరం నిశితంగా పరిశీలించాడు. "ఈచెప్పింది అయోధ్యలోతానుఎరిగినఅన్నయ్యయేనా?" అని ఆశంకించాడు. ఆయనే అయితే, అప్పటి భాషణానికీ, ఇప్పటి ఈ భాషణానికీ అంత అంతరం ఎందుకు వుంటుంది? ఆకారం తాకే అలలతో ఘూర్ణిల్లుతున్న అంబుధివలెవున్న అయోధ్యలో, కర్ణంలేక, తెడ్లులేక, తెరచాపలేక, నావికుడు లేక మునగకుండా తేలిన ఓడవంటి అన్నయ్య, అయిలేని అంబుధిలాగా, సెగలేని అగ్నిలాగా, ప్రకాశంలేని భానుడులాగా, ప్రజ్ఞ నశించిన పండితుడులాగా, పదబంధంమిగిలి, రసౌచిత్యాలు కోల్పోయిన కవిత్వంలాగా ఎందుకు మారినట్టు? అన్ని హద్దులు చెరుపబడి, అన్ని అంతరాలు ఛేదింపబడి, మృగరాక్షస సంకులమైన అరణ్యంలో, మృగములవలె, మృగయులవలె విచక్షణారహితంగా వేటాడి పొట్టు తీర్చుకుంటూ జీవించే స్థితిలో వున్నాం. ఇద్దరి పురుషులమధ్య స్త్రీ వున్నది. నేనుచిన్నవాడను. భార్యలేనివాడను. గడుపవలసినఅయిదు వేల నలభై రోజుల్లో ఇది మూడోరోజు. ముగ్గరమే మిగిలి గడపవలసిన రోజుల్లో ఇదే మొదటిరోజు. అందుకే అన్న ఇంత దీర్ఘంగా,

ఇంత విస్పష్టంగా, ధ్వని ప్రధానంగా మాట్లాడాడు. మితభాషి అయిన, నాఅన్న ఇంత అమితంగా మాట్లాడటంలోనే అంతరార్థంవుంది. అది గతాన్ని మరచి, కర్తవ్యోన్ముఖుడవు కమ్మని హెచ్చరించటం, "శక్తి వుండీ, అధర్మం అని తెలిసీ, నేనెట్లా ధర్మానికి కట్టుబడ్డానో, నీవూ ఆ ధర్మానికే తలవొగ్గి, నీ రాకను హర్షించిన మావట్ల అప్రమత్తుడవై మెలగు"మని ఆదేశం; "ధర్మాతిక్రమణమే జరిగితే, జగత్తే వుండదు. ఇక నీవుంటావా?" అని నా అభిప్రాయాన్ని నాకు తెలుపటం; నేను మనసులో బాధపడకుండా, "కష్టసుఖాలు చెప్పుకుంటున్నా"నని సామాన్య లోకధర్మాన్ని సాధించటం. ఇది నిజంగా నాకు అగ్నిపరీక్ష. ఇందులో నెగ్గితే, నా తల్లి ఆశీర్వాదం తప్పక ఫలించినట్లే, నాకై నా అర్ధాంగిచేసే తపస్సు ధన్యమైనట్లే."

అని, సింహావలోకనంచేసి, లేచి, అన్నపాదాలపై చేతులు వుంచి "అన్నా! నీవుచెప్పింది నిజం. నేను అయోధ్యకు పోనిమాటనిజం. నాకు ఈ జన్మలోగానీ, జన్మాంతరాలల్లోగానీ, రెండేరెండు మూర్తులుకావాలి. ఒకటి నాతల్లీ, రెండు నీవూ. నన్ను నీతో పంపుతున్నప్పుడు నాతల్లినాకు ఇలా వుపదేశించింది. "రామం దశరథం విద్ధి, మాంవిద్ధి జనకాత్మజాం, అయోధ్యామటవీంవిద్ధి. గచ్ఛ; తాత! యథాసుఖమ్" అని. నాకుతెలిసింది అమ్మచెప్పినమాట. నేను నడిచేది అన్న నమ్మతించినబాట. నేనుకావటం దాశరథినేకాని, రామానుజుడను సుమా. మీకమర్చినశయ్యలపై విశ్రాంతి పొందండి. ఈరాత్రికాదు. పధ్నాల్గు సంవత్సరాలలో ఏ రాత్రికూడా, నాఅన్న మేల్కొనరాదు" అంటూ తలకూడా వుంచాడు. ఆ మాటలు ఆలకించిన రాముడు ఆనందంతో ఆలింగనం చేసుకున్నాడు. సీతమ్మలేచి నవ్వుతూ, "మరదీ! ఎంత తమ్ముడవైనా ఇంత స్వార్థం కూడదుసుమా. నేనంతావిన్నానులే" అన్నది. "అదేమమ్మా వదినా! అంతమాటన్నావ్? ఇందులో నా స్వార్థమేముందీ? అన్నను అనుసరించటమే నా ధర్మం" అన్నాను. ఆ మాటకు జానకి "చెప్పనా మరదీ? ప్రక్కన నేనున్నానని కూడా మరచి, ఆయన ఆత్మధనం, అనురాగం అంతా కొల్లగొన్నావు" అని సమాధానం చెప్పింది. వదినా మరదుల సంభాషణ విన్న రాముడు "నీవు మాత్రం స్వార్థరాలవుకావా? మా ఇద్దరి హృదయం,

అభిమానం నీవు కాజేయలేదా?" అని నవ్వాడు. సౌమిత్రిహృదయంలో అన్న నవ్వంగానే కోటి పున్నముల వెన్నెల విరిసింది.

## శ్రీరాముడు భరద్వాజుని ఆశ్రమానికి పోవుట

సీతారాములు శయనించారు. లక్ష్మణుడు మేల్కొనివున్నాడు. ఒక సింహం నిద్రిస్తుంటే, ఇంకోసింహం అడవిని చూస్తూవున్నట్లు గోచరించింది. శకుంతసంతాన కలకలధ్వానాలు ప్రభాతభేరీలైనాయి. సింహగర్జనలు కాహళధ్వనులైనాయి. దంపతులు మేల్కొన్నారు. ధావనాది కార్యాలు పూర్తి చేసుకొని ప్రయాణం సాగించారు. ఆ దారి పోనుపోను, భీకరంగావున్నా మనోహరంగా కనిపించే దృశ్యాలలోనిండినఅడవులలోనుంచి గంగా, యమునా సంగమస్థానానికి పోయే దారి చేరువైంది. ఆ మార్గాన్ని అనుసరించి మధ్యాహ్న వేళకు ప్రయాగతీరానికి చేరుకున్నారు. అప్పుడు రాముడు లక్ష్మణున్ని పిల్చి చేతితోచూపుతూ "సౌమిత్రీ! అటు చూడు. అదే ప్రయాగ. చుటూఅగ్నిధ్వజంలాగా ధూమం అంతరిక్షాన్ని ఆక్రమిస్తుంది. ఎవరో మునీశ్వరుడు అక్కడ నివాసం కల్పించుకొన్నట్లున్నది.

దూరంగా హోరు వినబడుచున్నదే, అది గంగా,యమునా,సంగమించేస్థానం. అన్యోన్యభంగసంఘర్షణంలో ఆ ధ్వని వస్తూంది. ఇప్పుడు మనం ఆ ప్రదేశానికి చేరుకున్నాం. ఆటవికులు వన్యపదార్థ పచనం నిమిత్తం చెట్లుకొట్టిచీల్చిన ఎండుకట్టెలుగుట్టలుగా కనుపించేచోటే భరద్వాజమహర్షిఆశ్రమం. అహస్కరుడు అస్తంగతుడు కానున్నాడు. ఈ దినంనుంచీ మనం శాకాహారులుగా జీవించుదాం. సాత్వికజీవితం గడపవలసిన మనం, హింసావృత్తికి పాల్పడటం ఇష్టంలేదు. మనం భుజించే పదార్థం సాధుజంతువులను సంహరించి సంపాదించవలసివస్తుంది. సర్వసుఖ పరిత్యక్తులమైన మనకు సాధుజీవనమే సర్వదాశరణ్యం" అని చెపుతూ భరద్వాజాశ్రమానికి శ్రీరాముడుచేరుకున్నాడు. ఎంతోప్రశాంతంగా వున్న ఆచోటు వీరి రాకవల్ల అక్కడి పెంపుడు పక్షులూ, మృగాలూ, బెదిరి పరిగెత్తసాగినై.

ఆ చప్పుళ్ళువిని, శిష్యులు క్రొత్తవారిని చేరవచ్చారు. రాముడు

వారితో "మహర్షుల దర్శనార్థం వచ్చాం. మీరాక వారికి తెలపండి" అని చెప్పాడు. శిష్యులు చెప్పగావిని "తోడ్కొనిరమ్మ"ని మహర్షిఛాత్రులను పంపాడు. భార్యా సోదరసహితుడై రామభద్రుడు ఆశ్రమం లోపలికి వెళ్ళాడు. అగ్నిహోత్రకార్యంముగించి, శిష్యులూ, మునులూ పరివేష్ఠించి వుండగా, చుక్కల్లోచంద్రుడువలె ప్రకాశిస్తున్నమౌనిచంద్రునిసమీపించి, సీతాలక్ష్మణసహితంగాసాష్టాంగదండప్రణామంసలిపాడు. శ్రుతిహితంగా, రెండుచేతులతో, రెండుచెవులు స్పృశించి "చతుస్సాగరపర్యంతం.... భవతు." అని తమ ప్రవరచెప్పుకొని "మహర్షి శ్రేష్ఠా! మేము దశరథ మహారాజపుత్రులం. నాపేరు శ్రీరాముడు. తమ్ముని పేరు లక్ష్మణుడు. ఆమె జనకచక్రవర్తి కుమార్తె జానకి. నా సహచరణి. కారణాంతర ములచే కన్నయ్య నన్ను కాననవాసానికి పంపాడు. వీరిద్దరూనాయందు గల భక్తివిశ్వాసాలతో నన్ననుసరించివచ్చారు. మేమిక్కడ మునివృత్తి జీవించతలచాం.కులోచితపదార్థాశనంమానుకున్నాం. శాకాహారాదులుగా జీవించనిశ్చయించుకున్నాం. దేవర సందర్శనార్థం వచ్చాం." అనిచెప్పి, అంజలిబంధంగా నిల్చున్నాడు. ఆ అంతర్వీక్షణుడు వారిని ఆదరించి, కూర్చుండనియమించి, అతిథిసత్కారంముగించి, స్వస్థులైన అనంతరం, మహర్షి "రామచంద్రా! ఎన్నాళ్ళకు నిన్ను కన్నాను. కైక వరాలు కోరటం, నీతండ్రి సమ్మతించటం, నీవు భార్యానుజసహితుడవై అడవులకు రావడంవిన్నాను. నీ పితృవాక్యపాలనా నియమానికి ఎంతో సంతో షించాను. ఇది నదీద్వయసంగమస్థానం. పుణ్యక్షేత్రం. ఇక్కడ మీరు హాయిగా వుండవచ్చు. ఏలోటుపాటులురాకుండా శిష్యవర్గం చూస్తుంది. నా మనోరథం నెరవేరుతుంది" అని ఆదరంతో అన్నాడు.

"స్వామీ! అంతకంటెనాకుకోరతగిందేముంది? మీసన్నిధానంలో లౌకికవ్యవహారాలుమరచి, అలౌకికానందజలధిలో తెప్పతేలటం నా అదృష్టంగా భావిస్తాను. కాని కొన్ని బాహ్యకారణాలచేత విడిగావుండ తలచాను. మీ ఆశ్రమంలో వున్నట్లుతెలిస్తే, పౌరులూ, జానపదులూ, బంధువులూ మాకోసం చూడవస్తారు. మార్గానుకూలత కూడా వుంది. వాళ్ళ రాకపోకలతో ఆశ్రమవాతావరణం కలుషితంకావటం నేను సమ్మ తింపను. అంతకంటే నాకు వేరేవూహలేదు. యోగ్యమైననెలవు ఎక్కడ

వున్నదో సెలవిస్తే అక్కడ వుంటాం" అని రాముడు సవినయంగా సమాధానం చెప్పాడు.

"నాయనా! నీఇష్టం. నేను అభ్యంతరంచెప్పను. ఇక్కడికి పది కోసుల దూరంలో చిత్రకూటపర్వతంవుంది దాని శిఖరాలు ఎంతదూరం కనుపించుతవో, అంతదూరంవరకుగల ప్రాణికోటిలో చెడుతలంపులు పుట్టవు. వేలకొలది వత్సరాలు ఋషితల్లజులు పెక్కురు ఘోరమైన తపస్సుచేసి, బొందితో దివానికిపోయారు. అదంతా ఇప్పుడు విజనంగా వుంది. నీవు కోరినట్లు అన్ని అవకాశాలు అక్కడవున్నై. నీవు అక్కడికి వెళ్ళినా, ఇక్కడవున్నా నాకు సంతోషమే. ఇక్కడివలె అదికూడా మీకు సురక్షిత స్థానమే." అని వివరించి, సద్వితీయుడూ, సానుజుడూ అయిన రామచంద్రుణ్ని అతిథి మర్యాదలతో ఆనందపరిచాడు. ఆదర పూర్వకంగా మహర్షి ఇచ్చిన ఆతిథ్యం స్వీకరించి, కుశల ప్రశ్నాదులతో, ఇష్టా గోష్ఠులతో, ఒందొరులు కాలం గడుపుతుండగా, సంజకెంజాయలు నభస్సీమను నవ్యాలంకార శోభితంగా చేసినై.

నగరం వదలిననాల్గవనాటిరాత్రి,అంతఃపురంలోవలె ఆశ్రమంలో నిద్రించారు. ఉషఃకాలంలో లేచి కృత్యాలు నిర్వర్తించుకుని, మహర్షిని దర్శించి, "ఋషిసత్తమా! మీ అపారకృపారస హృదయంలో నిశ్చింతగా రాత్రి నిద్రించాం. మాకు ప్రయాణానికి అనుజ్ఞ ఈయవలసిందిగా అర్థిస్తున్నాను"అని రాముడు అన్నాడు. "పోయిరారామా! చిత్రకూటం నిజంగా చిత్రకూటమే. స్థలం పవిత్రమైంది. వృక్షాలు ఫలపుష్ప సంకలితాలు. పర్వతాలు దేవతా మిథున సంచారయోగ్యాలు. చుట్టూవున్న వనాలు, లేళ్ళతో, నెమళ్ళతో, ఏనుగులతో, కోతులతో గంధమాదన పర్వత పరిసరాల పరిహాసాలు. మీకు తగినచోటు. అపకార రహితంగా, స్వేచ్ఛగా మృగాలు తిరుగుతుంటే మీకు నేత్రపర్వంగా వుంటుంది. ఆ పర్వతంలో ఎక్కడ చూచినా సెలయేళ్ళు వంకలు తిరుగుతూ క్రిందికి ప్రవహిస్తూ, నీటి తుంపురులతో గాలిని చల్లబరుస్తుంటై. శుకపికశారికాకల కూజితాలు కర్ణానందంకలిగిస్తాయి. మయూర క్రేంకారధ్వని మాటిమాటికీ పిల్చి నేమం అడుగుతున్న ఆప్తమిత్రుడులాగా అలరిస్తుంది."

# భరద్వాజముని శ్రీరామునకు చిత్రకూట మార్గం చెప్పుట

అంటూ మునిశ్రేష్ఠుడు తెలుపుతుండగా భళ్లన తెల్లవారింది. మౌనికి మ్రొక్కి, చిత్రకూట పర్వతాల్ని చేరే ప్రయత్నంలో రాముడు రెండడుగులు వేశాడు. భరద్వాజుడు వారికి స్వస్త్యయనం సల్పి, బిడ్డలను వెంటగొని వెళ్ళే తండ్రిలాగా, వారితోకూడ నడవసాగాడు. నడుస్తూ, "రామా! నీకు మార్గం చెప్తావిను. గంగా యమునా సంగమస్థానందాకా పోయి, అక్కడనుంచి పడమర దిశగా పారే యమున ఒడ్డు వెంట కొంతదూరంపోయి, ఎక్కడ యమున అమితవేగంగా ప్రవహిస్తుందో, అక్కడ రాకపోకలు ఎక్కువ జరగటంవల్ల దారి చక్కగా వుంటుంది. కనుక తెప్పపై నదిదాటి, తర్వాత "శ్యామ" అనే మర్రిచెట్టు కడకు పోయి, దేవతా మహిమకల ఆ మర్రిని సీతచేత సేవింపచేసి మ్రొక్కించు. ఆ వటవృక్షం మీకే అంతరాయాలూ రాకుండా అనుగ్రహిస్తుంది. మీకు ఇష్టమైతే అక్కడ వుండండి. ఉత్సాహం కలిగితే క్రోసుదూరం ముందుకుపోతే "నీలవనం" వస్తుంది. విరుగబండిన రేగులూ, వెదురుపొదలూ ఎంతో మనోజ్ఞంగావుంటై. నేనుఎన్నోసారులు వెళ్ళి వచ్చాను. అక్కడి త్రోవలు మృదువుగా వుంటై. చిచ్చు భయం మీకు ఏ మాత్రం అక్కరలేదు. నే చెప్పిన గుర్తులు చూచుకుంటూ సుఖంగా లక్షితస్థానం చేరండి. ఇక నేను ఆశ్రమానికిపోనా?" అని ఆగాడు. సీతారామలక్ష్మణులు మహర్షి పాదాలకు పునఃప్రణామంచేసి సెలవు తీసుకున్నారు. మునినాథుడు స్వస్థానానికి పోయాడు.

"లక్ష్మణా! మనం నిజంగా ధన్యులం. బ్రహ్మతేజోవిరాజితులైన వాల్మీకి మహర్షిశిష్యులు, వారి అనుగ్రహం మనకు లభించింది. వనవాస దీక్షావ్రతం నిరంతరాయంగా సాగిపోతోంది. "మీ వదిన కారడవుల్లో కష్టపడుతుందేమో" అని కంగారుపడ్డాను. సుఖవంతమైన చోటు మహర్షి కృపవల్ల మనకు తెలిసింది" అని చెపుతూనే చేరాడు వాటే చోటికి. అక్కడ కొలదికాలం ఆగాడు. ఆ ప్రవాహవేగం పర్వతాలను సహితం తలక్రిందులుచేసేటట్లుకనుపిస్తున్నది. తెప్పపై దాటమని గదా చెప్పింది. తెప్పనుగూర్చి కొంతసేపు ఆలోచించారు. సీతను వృక్షచ్ఛాయను నిల్పి, ఇరువురు కొన్ని ఎండిన కట్టెలుతెచ్చి, సమంగాపరచి, తీగలతోబంధించి,

జానకి కూర్చుండుటకు కొంచెం ఎత్తుగా వేదికవంటిది ఏర్పాటుచేసి, గట్టివి, కొద్దిపొడవైనట్టివి, వెదురుబొంగులు కూర్చుకొని, తీరంనుంచి నీటిలోకిలాగి లక్ష్మణుడు కదలకుండ పట్టుకోగా, రాముడు జాగ్రత్తగా సీతను చేయి పట్టుకుని తెప్పపై చేర్చాడు. పిమ్మట రాముడుకూడా ఎక్కాడు. సౌమిత్రి నీటివాలువైపుకు తెప్పనునెట్టి తానుకూడ ఎక్కి గడల సహాయంతో నడపటం ప్రారంభించాడు. సీతకు మామగారిచ్చిన వస్త్రభూషణాలూ, రామలక్ష్మణుల విల్లులూ, కవచాలూ మొదలైనవి జారిపడిపోకుండా ఉడుపానికి గట్టిగాకట్టి జాగ్రత్తపరిచాడు. క్రమంగా తెప్ప నది మధ్యభాగానికి చేరుకోగానే, సీత గంగను వేడుకున్నట్లే యమునను కూడా వేడుకుంది.

## సీతారామలక్ష్మణులు శ్యామవృక్షం చేరువకు పోవుట

నిరపాయంగా తెప్ప దక్షిణతీరంచేరింది. ముందులక్ష్మణుడుగడను నీటిలో గట్టిగానొక్కి దాని ఆధారంతో తానుదిగి, మొలబంటి నీటిలో నిల్చుండి, తెప్పనుగట్టిగాపట్టుకున్నాడు. తర్వాతరాముడూ, పిమ్మటసీతా దిగారు. క్షేమంగాచేరినందుకుయమునకుఅందరూ అభివాదాలుచేశారు. ఆపై తెప్పను నీటిలో వదిలివేశారు. రాముడు "లక్ష్మణా! ముందు నీవూ, వెనుక మీవదినా, తర్వాత నేనుగానడుద్దాం. దారిలో సీత ఏదైనాకోరితే తెచ్చిపెట్టు" అని తెలిపి నడకసాగించాడు. మదగజద్వయ మధ్యంలో హరిణంవలె రామసౌమిత్రులనడుమ సీత నడవసాగింది. దారిపొడవుగా తామెరుంగని ఎన్నో వింతవృక్షాలు గోచరించినై. అడుగడుగునా సీత భర్తను ఆచెట్లపేర్లూ, ఆ పూలపేర్లూ అడుగుతూ, విని ఆశ్చర్యపడుతూ పోతుంటే, కుశాగ్రబుద్ధి సౌమిత్రి వాటినన్నిటినీ తెచ్చి వదినకుఇచ్చాడు. వచ్చింది వనవాసానికిఅన్నమాటమరచి, చెట్లనీడలకూ, చల్లనిగాలులకూ, తీయని పక్షుల కూతలకూ ఆనందిస్తూ శ్యామవటం సమీపించారు.ఇలోధిక భక్తితో ఆ వటవృక్షరాజాన్ని సీత పూజించి, ముమ్మారు ప్రదక్షిణించి "న్యగ్రోధరాజా! నీహృదయం ఎంత విశాలమైందో, నీ కొమ్మలుకూడా అంత విశాలమైనవి. నీ అనుగ్రహవీక్షణాలు ఆశ్రితుల మనస్సుల్లో ఎంత ప్రగాఢంగా ప్రవేశిస్తవో, నీ వూడలుకూడా భూమిలో అంత లోతుకు

పోతాయి. నీ విస్తారాన్ని చూసీ, నీ విశాలత్వాన్ని చూసీ పెద్దలు "అణో రణీయాన్, మహతో మహీయాన్" అన్నారు. నాపతి తండ్రిమాట చెల్లించి సలక్షణంగా అయోధ్యకు చేరేట్లు ఆశీర్వదించు. అనుగ్రహించు" అని ప్రార్థించింది.

అనంతరంరామలక్ష్మణులు ఆవృక్షరాజానికి పలగొని,యథాతథంగా సంభారాలు సవరించుకొని, మెత్తని ఇసుకదారివెంట పయనించారు. చేరువైనకొద్దీ, చిరుతరగలమెట్లపై చిందులువేస్తున్న గాలిపిల్లవాడు పరుగుపరుగునవచ్చి క్షత్రియుల్లాగా శరచాపాలూ, మునుల్లాగా జటా వల్కలాలూ, బంగరుజిలుగు పట్టుచీరెలూ, వలిపెంపురైకలూ వున్న యాత్రికులనుచూచి వింతపడి, విధాతదృష్టిలో తానింతవరకు ఎరుగని ఈ మూర్తులు "సచైతన్యాలా? శిల్పాలా?" అన్న సందేహంతో తాకి చూస్తున్నాడు. ఆ పిల్లవానిచేష్టలకు, పిల్లవాని అల్లరికి తల్లిదండ్రులు ముచ్చటపడినట్లు ఆ ముగ్గురూ తృప్తి పడ్డారు. దూరపు ప్రయాణశ్రమ వారికి దూరమైంది. అక్కడ ఆగక చిత్రకూటపర్వతం చేరాలనే వుత్సాహంతోముందుకుపోతున్నారు.నదీతటంలో,జలపానార్థంవచ్చినఏనుగులు ఘీంకారంచేస్తూ, తొండాలనిండా నీరు పూరించి, ఒదలిపైచల్లుకుంటూ, గగనానికిఎగచిమ్ముతూకోలాహలంచేస్తూంటే,చెట్లకొమ్మల్లోవ్రేలాడుతూ దూకుతూ,తీరంవెంట పరుగెత్తుతూ,పరస్పరంకిచకిచధ్వనులతోభాషించు కుంటూ, కోతులు తిరుగుతూంటే, బెగ్గురుపక్షులు అలల్లో కదులుతున్న చేపలను దగ్గరకురాగానే ముక్కులతో ఒడసిపట్టుకుంటూ, తీరం పొడ వునా కనబడుతుంటే జానకి ఎంతో సంతోషించి, ఈరాత్రికి ఇక్కడనే వుందామంది.

## రాముడు సీతకు చిత్రకూటంలోని చిత్రాలు చూపుట

ఆ మాటకుఅన్నదమ్ములిద్దరూ హర్షించారు.లక్ష్మణుడు దగ్గరలో మెత్తని ఇసుకపై లేతఆకులు దట్టంగా రెండు, మూడువరుసలు పేర్చి రెండు పడకలు సిద్ధంచేశాడు. పాత్రలతో యమునాజలం తెచ్చారు. రుచ్యమైనపండ్లు ఆకుల్లోవుంచాడు. సీతారాములు ముఖ పాదప్రక్షాళనం చేసి శయనస్థలానికిచేరి ఫలహారంచేయబోతూ, మరికొన్నిపండ్లుతీ,సికోసి

ఆకుల్లోవుంచి, "మరదీ! మాతో నీవుకూడా ఫలహారం చేయ"మన్నది జానకి. ముగ్గురూ తృప్తిగా భుజించి, దాహం తీర్చుకుని, గుహునిమైత్రీ, భరద్వాజ మహర్షి మహత్తూ, శ్యామవటం శక్తి, ఆ ప్రదేశంలోని ప్రశాంతతా, క్రమంగా చెప్పుకుంటూ కొంతకాలం గడిపారు. పిమ్మట సీతారాములు శయనించారు. అరమోడ్పు కన్నులతో సౌమిత్రి ధ్యాన నిష్ఠుడైనాడు. అతని బాహ్యదేహంసు ప్తమైంది. ఆసమాధిలో మాతృదేవి సాక్షాత్కరించింది. "నాయనా! లక్ష్మణా! నీవు కారణజన్ముడవు. నీవు నిద్రించటంలేదని అన్నా వదినలు గుర్తిస్తే ఎంతోబాధపడతారు.అయినా ఈ పద్నాలుగేండ్లూ అప్రమత్తుడవుగానే వుండాలి. అన్న నిన్ను నిద్ర పొమ్మని గట్టిగా అంటె, ఆ మాట నీవు దాటలేవు. అప్పుడు అనర్థం తప్పకుండా వస్తుంది. అందుకని నీకు నేనొక వరం ఇస్తున్నాను. రాత్రి వేళ వారు లేచి నిన్నుచూస్తే వారికి నీవు నిద్రిస్తున్నట్లే కనబడుతుంది. నీకు నిజమైన నిద్రరాదు. నీవు నిద్రిస్తే మీ అన్న మేలుకొనవలసి వస్తుంది. ఆ దంపతుల సౌఖ్యమే నీవు చూడవలసింది. అందుకే నేనూ కోడలూ నిన్ను పంపింది. "రామం దశరథం విద్ధి, మాంవిద్ధి జనకాత్మజాం, అయోధ్యామటవీం విద్ధి." అని పల్కి అదృశ్య అయింది. లక్ష్మణుడు "అమ్మా! అనుగ్రహించబడ్డాను" అని ఆత్మానందం అనుభవించాడు.

శకుంత సంతాన కల కూజితాలతో సీతారాములు శయ్యలపైలేచి కూర్చున్నారు. అది చూచి లక్ష్మణుడు వాలుకా తల్పంపై వాలాడు. ముందుగా రాముడులేచి, సౌమిత్రినితట్టిలేపాడు. "తమ్ముడూ! అయిదవ నాటి రేయి హాయిగా గడిచింది. ప్రభాత మంద పవనాలు సుఖంగా స్పృశిస్తున్నై. పక్షికులం కులాయాలు వదలేస్తున్నై. లే. రాత్రంతా మేలుకున్నట్లున్నావు. వల్లనివేళ పయనించి చిత్రకూటం చేరుకుందాం." అన్నాడు. సౌమిత్రి నిద్రలేచిన వానివలె ఆవులించి, ఒడలు విరిచి, కన్నులు నులుముకుని లేచాడు. జానకికూడా లేచింది. ముగ్గురూ నీటి దరికి చేరి దంతధావనం, స్నానం ముగించుకుని, తమతో తెచ్చిన వస్తువులను సర్దుకుని మహర్షి చెప్పిన మార్గం వెంట ప్రయాణం చేశారు.

దారిలో రాముడు జానకి అడిగినవాటికి ప్రత్యుత్తరమిస్తూ, "దేవీ!

అటుచూడు. ఆ కనుపించే తోట ఎంత శోభగావుందో. ఆ పూల రామణీయకం మీకు తెలిసినంతగా మాకు తెలియదు. ఎందు కంటావా? మీరు పూబోదులు. ఆ పూల తరుణారుణ కాంతులు అరుణోదయం ఐనట్లే భ్రమకలిగిస్తున్నై. అవి ఏజాతివృక్షాలో చెప్పగలవా?" అన్నాడు. "అంతమాత్రం తెలియదేమండీ? ఎర్రపూలచెట్లు" అన్నది సీత. రాముడు నవ్వాడు. సౌమిత్రి "అలాచెపితే ఆచెట్ల పేరవుతుందా వదినా? అది పలాశ (మోదుగ) వనం. ఆ పూలు ఎంత అందంగా, ఆకర్షణీయంగా వుంటవో, అంత వాసనరహితంగాకూడా వుంటై" అని అంటుంటే, రాముడందుకుని "జానకీ! వెనుక నీవంటి విద్యాంసురాలు చదువురాని భర్తకు చదువుపై ఆసక్తికలిగించుదామన్న ఆసతో చూచి "రూపయౌవన సంపన్నం, విశాలఃకులిదీపకః విద్యాహీనం నశోభంతే, పాలాశకుసుమం వృథా" అని అన్నదట. ఆవిడ చెప్పిన పూలతోటే ఇది. ఈ చెట్లు చూశావా? ఇవి జీడిమామిడిచెట్లు. ఆ పూత గుత్తులు గుత్తులుగా ఎంత ముచ్చటవేస్తున్నదో. దీని పండ్లు చాలా రుచిగావుంటై. దీని గింజలు కాల్చి పగులగొట్టి లోపలి పప్పు తింటారు. శరీరపుష్టికి చాలా దోహదం చేస్తై. ఆ పండ్లభారంతో ఆ కొమ్మలు ఎంత వంగినవో చూడు. ఆ చెట్లనుచూచే నేను వినమ్రతనేర్చుకున్నాను. అటుచూడూ. ఆ కొండ కొమ్మల్లో తేనెటీగలుపెట్టిన తేనెపెరలు. ఎంత పెద్దవిగానున్నవో ఆ ఈగలనుతోలి,ఆ పెరలను పిండితే రెండుతూముల తేనె సునాయాసంగా లభిస్తుంది. ముందుముందు నీవామాధుర్యాన్ని అనుభవించగలవు.

ఆ వనంలో వనదేవత భావాలనువెల్లడిస్తున్నట్లు చిలుకలు రొద చేస్తూంటే ఆ ధ్వనులకు ప్రతిగా నీలకంఠాలు (నెమళ్ళు) క్రేంకారం చేస్తున్నై. కరులుఘీంకారంచేస్తున్నై. తుమ్మెదలు ఝుంకారంచేస్తున్నై. తమ్ముడా! మనం చిత్రకూటం చేరుకున్నాము. మేమిక్కడవుంటాం. నీవువెళ్ళి మనం వుంటానికి యోగ్యమైన ప్రదేశం చూచిరా. నిజంగా మహర్షులవారు చెప్పినట్లు ఈనగం,నానావిహంగమనాదసంకులం.బహు ఫలమూలసంపన్నం. సరసోదక సంపూర్ణం. చారుసౌందర్యశోభితం. మంజులతాద్రుమమండితం. తపోధనగణవాసస్థలం. ఇక్కడ ఎంతకాలం వున్నా తనివితీరదు" అని చెప్పాడు. సౌమిత్రి అన్నచెప్పినప్రకారం

అన్నగాన్ని అధిరోహించాడు. సీతారాములు చల్లని చెట్టునీడకు చేరుకున్నారు.

## శ్రీరాముడు వాల్మీకి మహర్షిని దర్శించుట

పర్వతంపైన నలుమూలలు తిరిగి, నిండినసీటితో తొణికిసలాడే దొనలూ, విస్తారమయిన కొమ్మలూ, ఆకులూ, పూలు, పండ్లూ కలిగిన వృక్షాలూ, గుబురులుగా అల్లుకున్న నికుంజాలూ,వింతవింతఆకారాలూ రంగులూకలిగిన విహంగాలూ, అచ్చటచ్చట ఎండినపొదలూ గలిగి సమతలంగావున్న ప్రదేశాన్ని సౌమిత్రి చూచి అన్నకు తెలిపాడు. రాముడు సంతోషించి, "లక్ష్మణా!సమీపంలోనే వాల్మీకిమహర్షుల ఆశ్రమంవుంది. వారిని దర్శించి, వారిఅనుమతీ, ఆశీర్వాదాలుపొంది, నివాసంనిర్మించుకుందాం" అనిచెప్పి, వారిలో కలసి వాల్మీకిమహర్షిఆశ్రమానికివచ్చారు. అక్కడ అధివసించినవారందరికీ, క్రమానుగతంగా అభివాదం చేశాడు. అనంతరంలక్ష్మణుడుకూడా అన్నను అనుసరించాడు. జానకి ముందుగా మహర్షికిమ్రొక్కి, తక్కినవారికి తర్వాత యథాక్రమంగా నమస్కారం చేసింది. రాముడు వినయంతో వాల్మీకులవారికి, తననామాలూ, తాము వచ్చినసంఘటనలూ మనవిచేశాడు. చివరకు "తమఅనుమతితోచిత్రకూట పర్వతంలో కాలంగడుపుదామని సంకల్పం వున్న" దంటూ నివేదించుకున్నాడు.

మహర్షిశ్రేష్టుడు అతిథిమర్యాదలతో వారిని ఆదరించి "రామా, ఆ ప్రదేశం మీకు అన్నివిధాలా యోగ్యమైనది. తెలివిలోగాని, నిద్రలోగాని, రాత్రివేళగాని, పగలుగాని, మీకు ఎటువంటి ఆపదలూ రావు. అయోధ్యలో జరిగిన విషయాలన్నీ మా శిష్యులవలన తెలుసుకున్నాను. ధర్మమార్గానువర్తులకు కష్టాలుతప్పవు. నీయాత్ర లోకహితంగా ముగుస్తుంది. మునివేషధారివైన నీవు క్షత్రియుడవు. వనవాసానంతరం నీవు బహుకాలం ధర్మపాలనం చేయవలసి వుంటుంది. క్షత్రియోచితమైన ఆహార విహార వ్యవహారాలు శోభించినంతగా, సాత్వికజీవనం నీకు శోభించదు. చిత్రకూటం పరమయోగుల పాదరజంతో పవిత్రమైనది. మీరు ఆశ్రమానికి ఎప్పుడు వచ్చినా సంతోషంగా అతిథ్యం ఇస్తాను.

శుభంగా పోయిరాండి" అనిచెప్పారు. మహర్షులసెలవు తీసుకుని మరలి చిత్రకూటానికి చేరుకున్నారు. అందరూ పర్వతంఆరోహించి లక్ష్మణుడు ఎన్నికచేసినచోట చేరారు. ఆప్రదేశంచూసి సీతారాములు ఎంతో ఆనందించారు.

## రామలక్ష్మణులు పర్ణశాల నిర్మించుట

"తమ్ముడా! నీ ఎన్నిక ఎంతో బాగుంది. దీర్ఘకాల వనవాసం దృష్టిలో వుంచుకొని ఆకులతో ఆవాసం నిర్మించాలి. గాలి వానలకు కదలకుండా, ఎండలకూ, చలికీ, ఏమాత్రం చోటివ్వకుండా, చూడ ముచ్చటగా వుండాలి" అని సౌమిత్రితో రాముడన్నాడు. దీర్ఘచతురస్రాకారంగా, నాల్గువైపుల గోడలవలె, గడలుపాతి, కొమ్మలతో, ఆకులతో దట్టంగా పేర్చి, తీగలతో కట్టుబిగించి, ఎండిపోయిన చెట్లకొమ్మలు నిట్టాళ్ళుగా నిలబెట్టి, వెదురు బొంగులు తెచ్చివాసాలు వేసి, భూర్జపత్రాలతో కప్పి, పైన రెల్లుగడ్డి పరచి, వెదురుబద్దలు నాల్గువరుసల చుట్టూ తీగలతోకట్లుకట్టి, లోపల మూడుభాగాలుచేసి, గదులుకట్టి, పచనశాలా, శయనమందిరం, దేవతాయతనాలుగా విభజించి, అన్నకూ, వదినకూ చూపించాడు లక్ష్మణుడు. ఆ పనితనానికీ, తనకైపడుతున్న శ్రమకూ రాముడు మెచ్చుకొని తమ్ముణ్ణి మనసారా కౌగిలించుకున్నాడు.

జానకి చిరునవ్వులో, "మరదీ! ఇంత పెద్దఇల్లు ఎందుకయ్యా? ఎంతో కష్టపడి కట్టావు. ఇల్లు ఇరకటంగా వుండాలి" అంది. "ఔను జానకీ! ఇల్లు ఇరకటం అని చెప్పిన బుద్ధిమంతుడే ఇంకొకటికూడా చెప్పాడు. అది ఆలి మర్కటంగా వుండాలని. దైవదృష్టిలో అలామాకు జరుగలేదు; కనుక ఇంతఇల్లు కట్టాడు తమ్ముడు"అని రాముడుఅన్నాడు. "ఏమోనమ్మా వదినా! ఎంతఇల్లుకట్టాలో నాకేం తెలుస్తుంది. మీరిక్కడ వున్నారనితెలిస్తే మునీశ్వరులు వస్తారు. ఆటవికులు వస్తారు. ఇంకా ఎవరైనా పూజ్యులువస్తారు. వారిని ఆహ్వానించవలసిన అవసరం వుండవచ్చని అనుకున్నాను. ఆ వుద్దేశంతోనే కొంచం పెద్దగానే కట్టాను" అన్నాడు లక్ష్మణుడు. "తమ్ముడూ!నీవెప్పుడూముందుచూపుగలవాడవు.

వాస్తుశాస్త్రానుసారం కట్టి తీర్చిదిద్దావు. ఎక్కువకాలం జీవించతలచు కున్నవాళ్ళు, ఆరోగ్యభాగ్యాలు ఆశించినవాళ్లూ, నూతనగృహప్రవేశం అయ్యేటప్పుడు వాస్తుశాంతిచేయాలి. అందుకు హరిణమాంసం ముఖ్యం. నీవు విధి విధానంకోసం జింకనుజంపి తీసుకునిరా." అనిచెప్పిస్నానార్థం రామచంద్రుడు వెళ్ళాడు. లక్ష్మణుడు శరచాపధారియై మృగంకోసం అడవికివెళ్ళాడు. మైథిలి గృహం; లోపలా, బయటా వూడ్చి, నీళ్ళుచల్లి సామానులుసర్ది, గద్దెపై ఆకులుపఱచి, దేవతలవిగ్రహాలను వరుసలుగా తీర్చింది. రాతిసున్నంతో ముగ్గులువేసింది. సౌమిత్రి తనకార్యం చక్క చేసుకుని తొందరగా పర్ణశాల చేరాడు. రాముడు స్నానంచేసి, సంధ్యా వందనం ముగించుకునివచ్చి, అగ్నిహోత్రకార్యంతీర్చి, దేవతలనందర్నీ యథావిధిగా పూజించి, పుణ్యాహవాచనంచేసి, కలశజలాలను, మామిడి పత్రాలతో అంతటా ప్రోక్షించి, రౌద్రవైష్ణవాలూ, శాంతిమంత్రాలూ, వాస్తుదోష పరిహారార్థం పఠించి, వైశ్యదేవబలిచేసి, అనంతరం నదీజల స్నాతుడై వచ్చి, భూతప్రశాంతికై బలులువేసి, మృగమాంసంనివేదనం చేసి, వేదనిగదితరీతిని గృహప్రవేశకార్యం ముగించి, భార్యాసహితుడై దేవతాపూజార్థం, సమిధలతోనూ, దర్భలతోనూ, గార్హాస్త్యాగ్నిన్రవేల్చి, వన్యమాల్యఫలాదుల నైవేద్యంపెట్టి, దైవప్రసాదంగ్రహించి,తమ్మునితో దారతోగూడి ఆహారస్వీకారాన్ని పూర్తిచేసి, ముంగిలిగదిలో దేవసభను ఇంద్రుడులాగా భార్యా సోదరసహితంగా ప్రకాశించాడు.

## సుమంత్రుడు అయోధ్యకు మరలిపోవుట

రామాదులు గంగానది దాటుతున్నప్పుడు, సుమంత్రుడూ, గుహుడూ కంటికి కనిపించేవరకూ వారినిచూచి, నావ నది మధ్యానికి చేరగానే ఎంతో విచారంపొందారు. గుహుని ఆహ్వానంతో మంత్రిఅతని నివాస స్థానానికి వెళ్ళాడు. రామాదుల క్షేమోదంతాలు తెలుసుకునివేగ రులు రాగానే, వారివల్ల ప్రయాగక్షేత్రంలో భరద్వాజాశ్రమంలో వారు వున్నట్లు తెలుసుకుని సంతోషించారు. చిత్రకూట పర్వతానికి చేరే తలంపు వారికి వున్నట్లుకూడా చారులు తెలిపారు. దైవానుగ్రహంవల్ల గంగానది దాటి మహర్షి ఆతిథ్యం స్వీకరించి, పరమ పవిత్రమైన చిత్ర

కూటం చేరుటకు నిశ్చయించుకున్నంతవరకు విన్న గుహ సుమంత్రులు చెప్పరాని ఆనందాన్ని అనుభవించారు. గుహునివద్ద సెలవు తీసుకుని సుమంత్రుడు తిరిగి రథంతోలుకునిఅయోధ్యానగరానికిప్రయాణించాడు. నదీ తీర ప్రాంతాలూ, నగరాలూ,గంధవనాలూచూచుకుంటూ,ప్రతిక్షణం రాముని ఎడబాటు గుండెను రాపిడి పెడుతుండగా, క్రుంగిపోయినదేందం తోనూ, కూలిపోయిన చైతన్యంతోనూ, లజ్జపెనగొన్న ముఖంతోనూ, పురసమీపానికి చేరాడు. అయోధ్య అంతా కాలి చల్లారిన గ్రామంలాగా కనుపించింది. ప్రాణలేని అడవిలాగా పొడగట్టింది. ఎన్నో వేలవత్సరాల తన జీవితంలో అయోధ్య ఈ స్థితి పొందటం ఇదే మొదలు. ఇదేదివర. నాకోసం ఎదురుతెన్నులు చూస్తున్న ప్రజలకూ, ప్రభువుకూ, నా మొగం ఎలా చూపేది? వారికి ఏమని సమాధానం ఇచ్చేది? ఏది ఏమైనా,రాముని కోరిక నెరవేర్చితీరాలి."అనిఅందోళనపడుతూపట్టణంలో ప్రవేశించాడు.

## రామాదులు లేని రథం చూచి పౌరులు శోకించుట

కన్నుల్లో ప్రాణాలు పెట్టుకుని కాలం గడుపుతున్న పౌరులు రామాదులు లేని రథంలో సుమంత్రుడు రావటం చూశారు. వారికన్నుల్లో నామ మాత్రంగావున్న ఆకాస్తవెలుగు పోయినట్లై, రథాన్ని ఆపమని అడ్డగించారు. "రామయ్యలేని రథంలో తిరిగిరావటానికి నీకు మనస్సు ఎలా అంగీకరించిం"దని ఆక్రోశించారు. "నీకు మేం చేసిన అపకారం ఏమిటి? మాకు తెలివి రాకముందే రథం తోలుకునిపోయావె ఎందుకు?" అని, తెలివిమాలి దీనాతిదీనంగా అడిగారు. వారి మాటలకు మంత్రి నిరుత్తరుడై తలవంచుకున్నాడు. ఎట్టకేలకు తెప్పరిల్లి "నేను మంద భాగ్యుణ్ణి. అంతదూరంపోయినా ఆ రామచంద్రుణ్ణి అనుసరించే యోగం నాకు పట్టలేదు. నన్ను అయోధ్యకుపోయితాను కుశలంగా వున్నామనీ, తండ్రియాజ్ఞ పాలించి వస్తామనీ, మీఋణం తీర్చుకుంటామనీ, మీ ఆశా లతలు పుష్పిస్తాయనీ, అంతవరకు ఓపికతో యథారీతి ప్రవర్తించమనీ, అరాజకం కాకుండా చూడమనీ, మేం ఎప్పుడూ ప్రభువులంకాము ప్రజ లమే అనీ, మీ కోరిక తీరుస్తామనీ, రామచంద్రుడు మీతో నొక్కి చెప్ప మన్నాడు. వారిని గంగానదీ తీరం చేర్చాను. గుహుడు తన పరివారంతో

ఎదుర్కొని ఆతిథ్యం ఇచ్చి సురక్షితంగా నావమైన నది దాటించి, భరద్వాజాశ్రమం చేరినట్లు చారులచే విని, నన్ను మీకీవార్త చెప్పే టందుకు పురానికి పొమ్మన్నాడు. మిమ్ముల కనుమరిగించింది మీ బాధ చూడలేని మీ రామయ్య తండ్రే" అని గద్గదకంఠంలో సమాధానంచెప్పి, రాజసౌధం వైపు రథం తోలుకొనిపోయాడు.

రథం రాజమార్గంగుండా పోతుంటే, కాంతలు గవాక్షాలలో నుంచీ, ముంగిలివాకిళ్ళలోనుంచీ,చూచి, రామరహితంగా కనుపించేసరికి గోడుగోడున ఏడ్చారు. "ఎన్ని మొగాలుచూస్తే ఏం? రామయ్య ముఖం వలె మాకు సుఖప్రదమవుతాయా? ఎందర్ని పూజిస్తే ఏం? ఎందరికి మొక్కితే ఏం? మా రామయ్యకు మొక్కిన ఫలం వస్తుందా? ప్రభువు కాకముందే ప్రజల బాగోగులు చూసే మా రామయ్య ప్రభువే అయితే మా సుఖం, మా సంతోషం దేవతలకైనా వుంటుందా? వట్టి నిర్భాగ్యులం. ఆ దయా హృదయం, ఆ చల్లనిచూపు, ఆ తీయనిమాట, ఆ నలుగురు మెచ్చేబాట, ఆ రామయ్యసొత్తు. కైకమ్మకు వుంటేగా ఆమె కొడుక్కు వుండటానికి. ఆ చల్లనితల్లి పెద్దమ్మగుణాలన్నీ ఆరామయ్యలో వున్నై. ఇంతకాలం ఎప్పుడు గడుస్తుంది? ఎప్పుడురామయ్య వస్తాడు?" అని పౌర కాంతలు వాపోతుండగా, మంత్రిరథాన్ని రాజసౌధానికి దగ్గరగా తోలుకుని పోయాడు. ఆ ప్రాంతమంతా, దుస్సహమైన రామభద్ర వియోగ దావాగ్ని సంతప్త జన సంకులంగా వుంది. అక్కడనుంచి ఏడు ప్రాకారాలు దాటి కౌసల్యాదేవి హర్మ్యానికి చేరుకున్నాడు.

## దశరథుని సుమంత్రుడు చూచుట

సుమంత్రుడు వచ్చాడన్న సంగతి విని రాజకాంతలు, సౌధోపరి తలాలనుంచీ, వాతాయనసముదాయంలో నుంచీ మంత్రిరాకకై చూస్తున్నారు. రథంచుట్టూ జనులుమూగి రోదనంచేస్తున్నారు. వాళ్ళను బ్రతిమలాడుకుంటూ కోటలోప్రవేశించినసుమంత్రుణ్ణి, సీతారామలక్ష్మణులులేక తామరపూలులేని కొలనులాగా శోభావిహీనంగావున్న రథాన్నీ చూశారు. అంతవరకు బలవంతంగా చిక్కపట్టుకున్న శోకం కట్టలుత్రెంచుకున్న ప్రవాహంవలె ఒక్కసారి ముంచెత్తింది. పైకి బిగ్గరగా అనలేకలోలోపల

మెల్లమెల్లగా వారిలోవారు "ఈసుమంత్రుడు రామాదుల తీసుకునిపోయి అడవుల్లోదించి వట్టిరథంతో తిరిగివచ్చి పుత్రశోకంతో మంచంపట్టినపెద్ద దేవికి ఏమనిచెపుతాడు? ఈయనమాటలు విని ఆమె ఎలా బ్రతుకుతుంది? ప్రభువైన భర్తే దిక్కులేక అయోమయావస్థలో పడివుంటే, ఆమెను ఆదరించి ఆదుకునేవారెవరు? సుమిత్రమ్మ అక్క ఒక్కతెమాత్రం గుండెనిబ్బరంతో,అటుభర్తనూ, ఇటు అక్కనూ సమర్థించుకుంటున్నది. వెనుకటివలెకాకదాసదాసీలువుత్సాహంకోల్పోయిఉదాసీనంగాఉన్నారు. వాళ్లకూడాసీతారాములఎడబాటుతోమతిపోయిఏంచేయాలోతెలిసికోలేక జీవచ్ఛవాల్లాగా వున్నారు. ఇప్పుడు మంత్రిరాజును చూడబోతున్నారు. రామాదులపాటు తలచుకుని కొనవూపిరితోవున్న రాజు ఈయనమాటలు విని ఏమవుతాడో, ఏమో? ఇన్ని అనర్థాలకు మూలం కైకమ్మ. అవేం వరాలు? వారసుడికి వనవాసం. తనకొడుక్కు రాజ్యం. ధర్మంతప్పి "తగుదునమ్మా" అని ఈయన ఈయటం, బంగారంవంటి కొడుకులనూ, కోడలనీ అడవులపాలుచేయటం. ఒకరిని అనవలసినదేముంది? అంతా మననొసట వ్రాసిన వ్రాత. అనుభవించక తప్పుతుందా?" అని అంతఃపురకాంతలుకన్నీరుమున్నీరుగారోదిస్తూండగా, ఎనిదవకక్ష్యాంతరంలో ఆతురతతో, దీనవదనంతో, పుత్రవ్యథాహృదయంతో, క్రుంగి, శుష్కించి, రుజాజరాపీడితసింహంవలెవున్న మహారాజును చూచాడు.

తన రాకను చెప్పేవాళ్ళులేక తానేలోనికి ప్రవేశించి నమస్కరించాడు. వదిలిపెట్టిపోయేసమయంలో రాముడుచెప్పినమాటలన్నీవరుసగా వివరించాడు. కన్నెత్తిచూడలేదు. మౌనంగా రాజువిన్నాడు. మాటరాక, వుక్కిరిబిక్కిరియై, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు స్తంభించి, మంచంపైనుంచి క్రిందబడి మూర్ఛిల్లాడు. కౌసల్యా సుమిత్రలిద్దరూప్రయత్నంమీద ఎత్తి మంచంపై చేర్చి,"రాజా! ఈ వచ్చినవాడు ఘటనాఘటన సమర్థునిమాత సుమంత్రుడు. రామాదులను కారడవుల్లో దించి తిరిగి వచ్చాడు. "ఇంత అన్యాయంచేశానే" అని ఎందుకు లజ్జపడతావు? ఏ ఫలంకోరి ఏడుస్తావు? ఎవ్వతెకుభయపడిఇంతవరకుఆత్మీయులవార్తలుఅడుగలేదో, ఆముద్దుల భార్యకైకఇక్కడలేదు.లే,లేచితెలివితెచ్చుకోండి. ఇంకాఅపస్మారకస్థితిలో పడకండి. మీకెంతో పుణ్యం వుంటుంది. ధైర్యంగా మాట్లాడవచ్చు. విని

చెపుతారేమోనని భీతిపొందకండి. అట్టివాళ్ళెవరూ ఇక్కడలేరు'' అంటూ కౌసల్య స్పృహ కోల్పోయింది. ఆమె పాటుకు అంతఃపుర శుద్ధాంత కాంతా జనం హాహాకారాలు చేస్తుంటే, చుట్టుప్రక్కలనున్న కులస్త్రీలు, బాలురు, వృద్ధులు, యౌవనులు వచ్చి, అచ్చటి విషాదదృశ్యాన్ని చూడ లేక, చూచి భరించలేక చేతులతో మొగాలు కప్పుకున్నారు. "ఇంత దురంతసంతాప దహనదగ్ధంబైన అయోధ్యలో పట్టంకట్టించి కైకమ్మా, కట్టుకుని భరతుడూ ఏంసుఖాలుఅనుభవిస్తారు? ఈరెండు పెద్దప్రాణాలు ఈరాత్రిని చూస్తాయా? రాముడు అడవులకుపోతే రాష్ట్రం వల్లకాడవు తుందనీ, అడవిగా అయోధ్య రూపాంతరం పొందుతుందనీ, ఆబాల వృద్ధంగా ఆక్రందనంచేసినా, అర్థించినా వినని కైకమ్మ ఆ స్థితినేచూచి ఆనందపడతలచిందేమో. మనకు, పోయినవాళ్ళకోసమేకాక ఈ వృద్ధు లిద్దరికోసంకూడా ఏడుస్తూజీవించటంతప్పదేమో" అని వచ్చినవాళ్ళంతా వాపోవసాగారు.

## సుమంత్రుని రామాదుల వృత్తాంతం రాజు వివరింపగోరుట

పతివ్రతలైన కౌసల్యాసుమిత్రల పరిచర్యలచే ప్రభువు ఒక్కింత తెలివి తెచ్చుకుని, మంత్రి వంక రామాదుల వృత్తాంతం తెలుసుకునే ఆసక్తి కనపరుచ్చుతూ,అశ్రుధారావేగాకుల కలుషితాలైననేత్రాలతో చూడ లేక చూశాడు. అడిగమనించి మంత్రిసమీపించాడు. పుత్రవధూ వియోగ క్లేశంలో స్నానపానాదికాలు లేక సంస్కారశూన్యంగావున్న తనకంటే దయనీయమైన ఆకారంతో ఎదుట నిల్చిన మంత్రినిచూసి రాజు బావురు మన్నాడు. ఉచితజ్ఞుడైన మంత్రి ఓదార్పుమాటలు కొన్ని పల్కి దుఃఖో పశమనం చేశాడు. "సుమంత్రా! ఆగర్భ శ్రీమంతులైన బిడ్డలు ఆకులు, అలములుతింటూ ఏ చెట్లక్రింద పడివున్నారు? ఏ నయనాభి రాముడు నడుస్తుంటే పరివారజనం, పౌరజనం, విడువక సేవిస్తూ వెంటవస్తుందో ఆ రాముడు తోడుకు దూరమైనాడుగదా? రత్నకంబళాలపైననడుస్తూ, హంసతూలికాతల్పాలపై శయనిస్తూవుండేకొడుకులూ, కోడలూ, ముళ్ళ డొంకల్లో నడుస్తూ, పన్నగ వృశ్చికాదులైన విషజీవులుసంచరించే విపిన స్థలాల్లో ఎలా నిద్రిస్తున్నారు? ఎక్కడవారిని దించావు? ఏవిధంగా వారు

నిన్ను విడిచివెళ్ళారు? వెళ్లేముందు నీతో ఏంచెప్పారు? ఏంభుజించారు? వివరంగా చెప్పు. అన్నివిధాల నా కంటె నీవే ధన్యుడివి. కొంతదూరం కలసిపోయావు. కొన్ని రాత్రులు కలసి నిద్రించావు. కొన్నిసార్లు కలసి భుజించావు. కొన్నిసార్లు కలసిభాషించావు. వారిపోకనుగూడాచూశావు. ఇందులో ఒక్కటికూడా కన్నతండ్రినైన నాకు కలుగలేదు కదా?

అలభ్యమైన ఋశ్యశృంగమహర్షి అనుగ్రహంతో అశ్వమేధం చేశాను. పుత్రకామేష్టి పూర్తిచేశాను. ప్రాజాపత్య పురుషుడిచ్చిన పాయసం గ్రహించి, నారాయణుని నాల్గుచేతులవంటి నలుగురుబిడ్డలకన్నాను. పెద్దబిడ్డ లిద్దరిచే సవనసంరక్షణం సలిపించి కౌశికమహర్షి కరుణకు పాత్రుడైనాను. శివధనుర్భంగంతో జనక చక్రవర్తి వియ్యంకుడనై వెల లేని విఖ్యాతి నార్జించాను. చిన్నవాళ్ళిద్దరు మేనమామకుచేయూతనిస్తూ, సిరిసంపదలలో తులతూగుతుంటే విని ఆనందించాను. మీ వంటిసుమతులైన మంత్రుల మంత్రాంగంతో, కులగురువుల ఆశీర్వాదాలతో, సత్య వ్రతుడనీ, ధర్మపాలకుడనీ, దానధౌరేయుడనీ ప్రజలు ప్రస్తుతి చేస్తుంటే సంతోష భరంతో శిరస్సు వంచి గ్రహించాను. ఈనాడు నా తుది ఘడియల్లో ఒక్కకొడుకూ దగ్గరలేడు.

మంచివాని చావు మరణకాలంలో చూడమని లోకోక్తి. మరి నా మరణకాలం ఈ విధంగా పరిణమించింది. నేనింతకు పూర్వం చేసింది మంచిఅనుకోనా?రాజాశ్రయంకోసం కొందరూ, రాజభయంతోకొందరూ అన్న ముఖస్తుతులేగాని, అవి సత్యంకావని అనుకోనా? ఇందులో ఎవరి దోషమూలేదు. ఇప్పటి నా ఈ స్థితికి నేనే కారణం. అవివేకంతోచేయ కూడని పని చేశాను. అనుభవిస్తున్నాను. మంత్రీ! చెప్పు. నా వాళ్లేమన్నారో చెప్పు. ముందురాముడన్నదిచెప్పు. తుదిక్షణాల్లో తండ్రిచేసిన దౌర్భాగ్యపు పనికి తల్లడపడకుండాతట్టుకుని,తండ్రిని సత్యవాదిగానిలిపి, వుత్తమగతి కల్పించిన నా నాయన మాటలు వింటూ, సాధువులలో యయాతిలాగా,ఆసన్న మరణాన్ని ఆకాంక్షిస్తూవుంటాను."అనికోరాడు.

## మంత్రి రాజునకు శ్రీరాముడుచెప్పినమాటలు చెప్పుట

"ప్రభూ! మీరు కోరినట్లే చెపుతాను. రాముడు మీ ఎడబాటుకు

ఎంతో దుఃఖించాడు. పురం చేరగానే ముందు నా తండ్రిని దర్శించమన్నాడు పిదప పాదాభివందన పూర్వకంగా తా నన్న మాటలు చెప్పమన్నాడు. "తండ్రీ నీ అంతఃకరణ నాకు తెలుసు. ఈ ఘటన మీరు బుద్ధి పూర్వకంగా కల్పించింది కాదు. విధి వైపరీత్యంవల్ల జరిగింది. నా మీది మోహంతో క్రుంగిపోవద్దు. నీ మాట నిల్పలేని నేను నీ విచ్చిన రాజ్యానికి అర్హుడ నెట్లవుతాను? పినతల్లి కోరిందిపధ్నాలుగేండ్లే కదా? అంత కాలం రాజులేక రాజ్యపాలన ఎలా సాగుతుంది? ఆమె కోరినా, కోరక పోయినా, లక్ష్మణుడు నాతో వచ్చాడుకనుక, వున్న ఇద్దరిలో భరతుడే జ్యేష్ఠుడుకాబట్టి రాజును చేయకతప్పదు. ఎక్కువకాలం మేనమామల వద్ద వుండటంచేత అతని స్వభావాన్నికూర్చి అనుమానించవలసిన పని లేదు. మేం నల్గురం పాయసప్రభావంవల్ల కల్గినవాళ్ళమేకదా. నాకూ, భరతునకు భేదం ఏముంది? పిన్నమ్మ ముచ్చట తీర్చినట్లవుతుంది. మీ వరదానవాక్యం సార్థమవుతుంది. ఆమెపట్ల ఆగ్రహపడవద్దు. రాజసౌధాలల్లోపుట్టి, రాజభోగాలనుభవించి పాలించేరాజులుధర్మాలనన్నిటినీ యాంత్రికంగా నిర్వహిస్తారేకాని, హృదయంతో కాదు. ఆ ధర్మాలు హృదయంతో చేయాలంటే, ఇటువంటి కొన్ని సంఘటనలు జరిగి, సామాన్యులతో కలసి కొంతకాలం కష్టసుఖాలు అనుభవించాలి. అప్పుడే పెద్దలు ఏర్పరచిన ఆచారాలూ, ధర్మాలు అవబోధమవుతై. విషయ మాత్ర గ్రహణంతో వెక్కిరించేవారికివిషయద్వేషమేప్రధానంగా పెట్టుకున్నవారికీ అనుభవానికివస్తున్నా అర్థంకావు. మా పిన్నమ్మ నాకెంతో మేలుచేసింది. చిన్నతనంలోనే అటువంటి అవకాశాం కల్పించి యథార్థ సత్యం గ్రహించేలాగా చేసింది. ఏది జరిగినా మనమంచికే. మేం బాధ పడ్డంలేదు. మీరూ బాధపడవద్దు" అని.

ఆపై అమ్మలందరి కుశలంగూర్చి ప్రశ్నించి తమ కుశలవార్త తెలుపుమన్నాడు. మాతృదేవత విషయం మనసుకురాగానేకన్నీరుపెట్టుకుంటూ, గొంతు జీరతో మాటలు పెగలక అతికష్టంతో అన్నమాటలు చెపుతా వినండి. "అమ్మా! నీ రాముడు నీ రెండుపాదాలను స్పృశిస్తూ వేడుకుంటున్నాడు. ప్రయోజకుడైనకొడుకునుగనిప్రజాభ్యుదయంకోసం త్యాగంచేసిన ధన్యజీవివి. పట్టదేవేరివైకూడ సాపత్న్య దోషం సంక్ర

మించకుండ సంసారపక్షంగా సంచరించిన సతీమతల్లివి. ఇతరుల ఔన్నత్యానికి అసూయపడక వున్నదానితో తృప్తిపడిన వుదాత్తమాన నవు. నీ హృదయానికి పోలికచెప్పటానికి విధాత తనసృష్టిలోవిస్మృతి కొన్నాడు. నీవువృద్ధతచేతనేకాకపుట్టుకచేతకూడదుర్బలశరీరవు. నన్ను గూర్చి ఎక్కువగా శోకించవద్దు. సుమిత్రమ్మపిన్ని నీకన్నివిధాలఅండ దండగా వుంటుంది. అమెను చూచుకుంటూ ధైర్యంగావుండు. కలకాలం కష్టాలు కాపురం చేయవు. చీకటిపొతే వెన్నెల వస్తుంది. మేం తిరిగి క్షేమంగా వస్తాం. మీరిచ్చిన ఆశీర్బలం మావెంటవున్నది. నా తండ్రిని యథాశక్తి సేవించు. ఆయన సేవను మించిందికాదు పుత్రప్రేమ. సతికి పతిసేవలో సర్వం వెలితిలేకుండా లభిస్తుంది. ఇప్పటి మన ఎడబాటు చాలా అల్పమైంది. నన్నూ, కోడలినీ చూచుకుని ఆనందించే శుభదినాలే ఎక్కువవున్నై" అని. ఆమాటలువిన్న 'రాజు సౌమిత్రి అన్న మాటలు కూడా చెప్పమన్నాడు. మంత్రి క్షణకాలం ఆగి చెప్పసాగాడు.

## లక్ష్మణుడు చెప్పిన మాటలు రాజుకు మంత్రి వినిపించుట

"రాజా! సౌమిత్రి చాలా కోపంలో రోజుతూ, "ఏ తండ్రైనా పట్టంకడతానని పదిమందిలో చెప్పి అంతఃపురంలో ఆడవాళ్ళమాటవిని అడవికి పంపుతాడా? మా అన్న చేసిన మహాపరాధం ఏమిటి? మా వునికి తనకంత ఇష్టంలేకపోతే వేరుగా బ్రతుకమంటే బ్రతికేవాళ్ళం. తనకు మేలు కోరవచ్చుగాని, నిర్నిమిత్తంగా పరులకు కీడుకోరవచ్చా? కోరితే మీరాజు ఈయవచ్చా? ఆ చెడ్డపనికి సత్యవ్రతపాలన అనే ముసుగు తొడిగి అమాయకులను బాధించటం అర్హమైనపనేనా?పరవానంవల్లగానీ, ముద్దుల భార్యపై మోహంవల్లగానీ, రాజ్యలోభంవల్లగానీ లోకారాధ్యుడైన మా అన్నకు గూర్చిన దుష్కృతికి ఇక మీ రాజుకునిష్కృతిలేదు. ఒకవేళ విధి ప్రేరణవల్ల ఈ విపరీతం సంభవించిందంటే, ఆ విధికి మాత్రం కారణం అక్కరలేదా? అటువంటిది ఏదైనా వుంటే చెప్పు. వింటా. రాజు అనాలోచితంగా ముందు సంగతి చూడకుండా లోక విరుద్ధకార్యం చేశాడంటే అందుకు మేం జాలిపడతాం. చేసినపని తలచు కుని జనపతి దుఃఖిస్తాడు.

సుమంత్రా! సత్యం చెపుతున్నాను. నాకు రాముడే దైవం. అతడే భర్త. అతడే ప్రియబంధువు. నాకు రాముడే తండ్రి. భూమిపతిమీద జనక బుద్ధిపోనేపోదు. ఓ రాజా! సర్వలోకప్రియంకరుడూ, సత్యరతుడూ, అఖిల జనాభిరాముడూ అయిన శ్రీరామచంద్రుని అడవులపాలుచేసి ప్రజా రంజకరంగా ఎలా పాలిస్తావు? ఇంత లోకవిరుద్ధంగా వున్న పనులుచేసి విశాల విశ్వంభరకు విభుడ వెట్లవుతావు? ఆ కైకమ్మతో, ఆ భరతునితో హాయిగా కాలం గడపమని నాకు మారుగా రాజుగారితో చెప్పు" అని అన్నాడు" అంటూ చెప్పాడు. జానకమ్మ శోకభారంతో, విన్ననైనవదన సరోజంతో కన్నీరు తుడుచుకుంటూ వున్న భర్తవైపూ, నావైపూ చూస్తూ వుండిపోయింది. రాముడు లక్ష్మణ రక్షితుడై నేను చెప్పిన మాటలు నా తల్లిదండ్రులకు తప్పక చెప్పు"మన్నట్లు నా మొగం వంక చూస్తూ నిలబడ్డాడు."

అని సీతారామలక్ష్మణుల మాటలూ, వారి స్థితీ చెప్పగా విన్న భూపతి "ఆ తర్వాత జరిగిన విషయం యథాతథంగా చెప్పు"మనిమంత్రిని కోరాడు. "రాజా! గుహుని సమక్షంలోనే, మనోమోహనమైన శిరోజాలు మర్రిపాలతో జడలుగాచేసి మీపుత్రులిద్దరూతలపై దక్షిణంగాముడిచారు. మిత్రు డిచ్చిన నారగుడ్డలు ధరించారు. గుహునిచే కూర్చబడిన నావపై గంగానది దాటి, ప్రయాగచేరే పథంలో పయనించారు. సీతారాములసంరక్షణలో అప్రమత్తుడైనలక్ష్మణుడుముందుదారిచూపగా, అతని వెనుక సీతామతల్లి నడువగా రాముడు ఆమె వెనుకగా నడచి పోయినారు. ఇంతవరకు నా జీవితంలో ఎరుగని ఈ దుస్సంఘటనకు నేను మరణింపకుండా మీకు చెప్పటానికిరామాజ్ఞచే బ్రదికివచ్చాను. వచ్చే ముందు గుహునితో రెండురాత్రులు గడిపాను. వారివార్తకేమైనాతెలుసు కొనుటకు అవకాశం లభిస్తుందేమోనని. కాని, రాలేదు.

## సుమంత్రుడు వస్తూ తాను చూచిన విశేషాలు చెప్పుట

ప్రభూ! ఏమనిచెప్పేది? గుహునివద్ద సెలవుగొని రథానికి గుర్రాలను పూన్చితే, అశ్రువులూ, నురుసూ కారుస్తూ అడుగుముందుకు వేయలేదు. దారి పొడవునా, పోషేటప్పుడు ఎంతో ముచ్చటగొల్పిన

ప్రదేశాలువచ్చేటప్పుడుచూస్తేహృదయవిదరకంగావున్నై. మంజులంగా వున్న పూలూ, కోరకాలూ, తీగలూ, పొదాలూ, మల మల మాడి పోయినై. చల్లనినీటితో పాంధులకూ పక్షిమృగ సంతానానికీ దాహ శాంతికలిగిస్తున్న కొలంకులు సలసల కాగి, పోతున్నై. పసుపు పచ్చగా, దట్టంగావున్న ఆకులన్నీ చెట్లనుండి ఎండి గలగలమంటూరాలిపోతున్నై. ఆ దృశ్యాలను చూస్తుంటే నామనస్సు విలవిలలాడి పోయింది. పెను సర్పాలు వున్నచోటనే వున్నై కాని కదలి ముందుకుపోవు. అడవి మృగాలు దొమ్మతెగులు సోకినట్లు పడివున్న వే కాని మెదలవు. నీళ్ళల్లో వున్నా, తామరలుకానీ, కలువలుకానీ, చేపలుకానీ, వాడివత్తలైపోయినై. పూర్వంలాగా, మెట్టతామర పూలుగానీ వృక్షలతాదుల పూలు గానీ, వాసనా రహితంగా ఆకారమాత్రంగా వుండిపోయినై. తోటలలో పక్షుల నినాదాలులేవు. ఆకాశంలో తిరిగే ఒక పిట్టనుకూద చూదలేదు. ఇక మన నగరంలో ఒక్కరిమొగాన కూద వెలుగులేదు. ఒక్కరిలో కూద ఓపికలేదు. నిలువు గ్రుడ్లతో, వస్తున్న రథాన్ని చూస్తూ నిల్చున్నారు. ఇదంతా, లోకబాంధవుని అస్తమయంలో చీకట్లు క్రమ్మినట్లు, రామ చంద్రుని ఎడబాటుతో జీవకోటి చైతన్యరహితమైన శిలలుగామారి పోయింది. ఏమి రాముదు? ఏమి జన్మ? ఒక్కనికోసం ఇంత సృష్టి తారుమారైందంటే, ఇంతకుపూర్వం కన్నదా? విన్నదా? ఇన్నిజీవులు శోకోపహతమైతే గుహుడుమాత్రం రామ వనవాసానికి ఆనందపడ్డాడు. "ఈ వ్యాజమేలేకపోతే నిన్ను ఎలా చూదగలం? ఎలా పూజించగలం" అంటూ ఆలింగనం చేసుకున్నాడు. అతనిని రామచంద్రుడుకూడా ఆలింగనం చేసుకుని అతని మిత్రాసక్తికి కరిగిపోయాడు. మంత్ర బద్ధ భుజంగమైనాడు." అని మంత్రి చెపుతుంటే మహారాజు మౌనంతో ఆలకించుతున్నాడు. మంత్రి ఇంకా ఇలా చెప్పాడు.

## పౌరుల దుఃఖాన్ని ప్రభువుకు తెలుపుట

"ప్రభూ! శూన్యంగావస్తున్న రథం పౌరులు చూశారు. రథాన్ని చుట్టూమూగి నిలువరించారు. అతిదీనోక్తులతో ఆశ్రీరాముని, సౌమిత్రినీ మైథిలినీ గూర్చి అడిగారు. నిరుత్తరుడుగా తలవాల్చిన నన్ను ఎన్నో

నిష్ఠూరాలాడాడు. వారిశోకం చూడలేక కోటలోప్రవేశిస్తుంటే గవాక్ష మార్గాలగుండా కాంతలు గొల్లుమని గోలకెత్తారు. లోకంలో ఎంత గొప్ప వారికైనా,మిత్రులూ, శత్రులూ వుంటారు. మరిరామవియోగానికి లోకమంతా ఆర్తితో కూలిపోయిందంటే, రాముని గూర్చి ఏం భావన జేయాలి? సంతోషరహిత లోకంగా, సంతప్త హయద్విపాల ఆర్తధ్వానంగా, జీవచ్ఛవంగా, చింతానిశ్వాసంగా వున్న పెద్దదేవి కౌసల్యలాగా అయోధ్య నాకు కనిపించింది. ఇంక చేయతగిన పనియేమిటి? ఈ స్థితిలో నగరం ఇంకావుంటే, ఆశించని పరిణామాలెన్నో ఆవహిస్తై. జరిగినదేదో జరిగింది. ఎవరెంత శోకించినా రాముడు పధ్నాల్గేండ్లుండేదాకా తిరిగి అయోధ్యకురాడు. రాజులేకుండా ఎంతకాలం నగరాన్ని శూన్యంగావుంచుతాం? ఏదో మీరే గుండెదిటవు చేసుకుని చేయవలసిన విధులు నిర్ణయిస్తే చేస్తాం. రాముడుకూడా దేశాన్ని అరాజకంగా వుంచవద్దని మరీమరీ చెప్పాడు. ముందు మీ వుద్దేశంచెబితే దాని బాగోగులు విచారించి నిర్ణయిద్దాము" అని.

## రామునికడకు తోడ్కొని పొమ్మని రాజు మంత్రినికోరుట

ఆమాటలువివిన్న రాజు అవశ్యుడై, తేరుకుని, "మంత్రీ! పాప భాజనురాలైన కైకమాటలకు తలవొగ్గి, వివేకహీనుడనై ఇంతదురంత చింతాసంతప్తులుగా మిమ్మందర్నీ చేశాను. అక్షయమేధావిధునై, అష్ట దిగ్గజాలవంటి మంత్రులుఎనిమిదిమందివుండగా,వారితోమంత్రాలోచనం చేసినట్లయితే ఈదుర్గతి నాకు పట్టేదికాదు. మీకు తీరని ఈ శోకం ప్రాప్తించేదికాదు. స్త్రీవ్యామోహంలోపడి,కొంపమునిగినట్లు కూడనిపని చేశాను. ఇపుడు పశ్చాత్తాపపడినందున నా రాముడుతిరిగిరాడు. నాపాపం పోదు. లోకంలో అంతులేని అపవాదు తెచ్చుకున్నాను. నీకు నామీద ఏమాత్రంఅభిమానం మిగిలివుంటే నన్ను మా రామయ్యవుండేప్రదేశానికి తీసుకునిపో. నీవు నామాట పాటించకపోతే ఈరాత్రికి నేను బ్రతుకను. నాతోపాటు కొందరు కులస్త్రీలు మరణిస్తారు. క్రమంగా కులక్షయం జరుగుతుంది. నీవు రథం సిద్ధంచేయి. ఆ ఆశతోనైనాజీవించగలనేమో. ఇప్పటికింకా నన్ను ప్రజ గౌరవిస్తుంటే, నామాట చెల్లుతుంటే, నీవు నా

తండ్రి రామయ్యను తీసుకునిరా. ఇక నేను క్షణకాలంకూడా నిగ్రహించుకోలేను. "ఆశయాబద్ధతేహ్యేకే, కర్మణా బహుచింతయా" అన్నట్లు ఆశతోనైనా ప్రాణం నిలుస్తుందేమో. ఇప్పటికే చాలాదూరం పోయుంటారు. నీవు ఇంకా ఆలస్యంచేస్తూవుంటే ఇంకా దూరంపోతారు. తొందరగా నా రథంలో దోడ్కొనిరా. ఆ రమణీయమూర్తిని, విమలాయతకీర్తిని, జగజ్జాలహృద్వర్తిని, రామమూర్తిని చేరేలోపల జీవంపోకపోతే, చివర చూపైనా లభిస్తుందేమో. కన్నుమూసినా, తెరిచినా, ఆ నవ్వుతూవున్న మొగం, మణికుండలాలతో ప్రకాశించేచెవులు, వికచారవిందసన్నిభమైన కన్నులు, ఆజానులంబి పీనబాహువులు, ముత్యాలకూర్పువలెనున్న పలువరుస, కనుపిస్తూనేవున్నై. ఆ కనుపించే మూర్తిభావనాబలంతో నిల్చివుంది. భావం నశిస్తే మూర్తి నశిస్తుంది. అది నశిస్తే నేను నశిస్తాను. ఈలోపలనే నన్ను రామునిపద్దకు చేర్చు."

అని బ్రతిమాలుకున్నాడు. "హారామా! హాలక్ష్మణా! హాసీతా! కారణరహితంగా కాసలకునెట్టి, మీమీది మోహంతో దిక్కులేనిచావు చావనున్నాను. నేను మీరులేక బ్రతుకనని మీకు తెలుసు. తెలిసికూడ నన్నీస్థితిలో వదలిపోయినారు. నాకైకొన్నిగతులు యముడు వుంచినాడు. అవి దుర్గతులు. అవి నాతండ్రి రామయ్య ధర్మనిర్వహణంలో తప్పినా, మిమ్ములచూసే భాగ్యంమాత్రం ఈజన్మకు ఇక లేదు. దేవీ? రామ వియోగ శోకం అనే మహా భోగమై, కోడలు సీతయొక్క విశ్లేషణ పారగమై, నిట్టూర్పులు అనే భయంకర ఆవర్తమై, ఎడతెగని అశ్రుధారలు అనే ఫేనజలాఫేలమై, మాటిమాటికి చేయు చేతికదలికలు అనే మీన సంతానమై, ఆక్రందన ఘోషతో, అసంస్కారంతో జారి నేలబడి జీరాడు కేశశైవాలంలో, కైకేయీ రూపబడబానలతో, కంటినీటివేగంతో, మందరా వాక్యనక్ర కుటీర మహోరగ తిమింగిలాల (మొసళ్ళు, ఎండ్రకాయలు, పాములు, పెద్దచేపలు)తో, పర్యాపనా వేల (ఒడ్లు)తో, రామ వనవాసకాలాయతంతో కూడిన ఈశోకసముద్రంలోరామరక్షణనౌకలేక మునిగి పోతున్నాను. భార్యానుజ సమేతంగాబిడ్డను రాముణ్ని చూడాలని ఆశవున్నంతగా అవకాశంలేదు. "తప్పు దారినపడి,ధర్మహానిచేసినవాడు ధరణీపతి ఐనా ప్రజలు గౌరవించరు. మంత్రులు మాట వినరు. సేనా

పతులు చేతి కందరు" అని చెప్పటానికి నా జీవితమే నిదర్శనం.రామా! రామా! నీ నామమే నాకు తారకమై పున్నామ నరకానికి పోకుండా చేయుగాక" అంటూ మూర్ఛపోయాడు.

తనయుని ఎడబాటుతోనే తల్లడిల్లుతున్న కౌసల్య, మగనిపాటు చూచి భయ విహ్వల అయింది. భూతం సోకినట్లూ, వుసురు పోయినట్లూ కొయ్యబారి మంత్రిని చూచి "సుమంత్రా! ఈయన స్థితి ఎలా పరిణమిస్తుందో. ఈయనతో నేనుకూడా పోతే నాకు ఏబాధా వుండదు. ఆచెద్ద జరుగకముందే మాఇద్దరినీ అబ్బాయిటువున్న చోటికి తీసుకునిపోయి విడిచిపెట్టు. ఎన్నడూ నేను ఎవరినీ అర్థించలేదు. నీతల్లివంటిదాన్ని. నాస్థితిగుర్తించి నామాట నెరవేర్చు" అని వేడుకుంది.

## సుమంత్రుడు కౌసల్యను ఓదార్చుట

కరుణరసం మూర్తీభవించినట్లున్న కౌసల్యాదేవి పాదాలపైబడి, మంత్రి "అమ్మా! నీకు నేను రామయ్యవంటి బిడ్డను. అసలు నేనే మీ బిడ్డను.రామచంద్రుడుమొన్నగదామీకు కలిగింది. అంతవరకు ప్రభువూ, నీవూ మతిసూక్ష్మతగల మహామంత్రులున్నా, సర్వకాల సర్వావస్థల్లో, ఆటంకరహితంగా అంతఃపుర ప్రవేశార్హత కల్పించి, పెద్దబిడ్డలాగా పెంచారు. మీమాటకుఎదురాడుతున్నానని భావించవద్దు.బరువుగుండెలో పల్కుతున్నాను. నేను రామయ్యను విడిచిన వెంటనే మరణించేవాణ్ణి. నన్నా పనిచేయకుండా ఆపినవాడే రామయ్య. "మేమూ లేక, నీవూలేకపోతే, జరాజీర్ణులైన నాతలిదండ్రులను ఆదుకుని ఆదరించే వాళ్ళులేరు. వాళ్ళకోసమైనా మరలి అయోధ్యకుపోయి నేను వచ్చేవరకూ కనిపెట్టి వుండ"మని చెప్పాడు. అతని ఎడబాటుకు మనమేకాదు. జీవకోటిలంతా నిశ్చేతనంగా మారిపోయింది. ఈశరీరాలు నీటి బుగ్గల్లాగాచంచలమైనవి. కల్పాంతాలు గడచినా నిలిచేది నరుని నడక. నీవింతగా బాధపడేది "బిడ్డలు అడవుల్లో ఎలా మసలుతారు? ఎలా సుఖపడతారు?" అని. ఇది అజ్ఞానం. ఎందుకంటే, ఇంతబాధ అనుభవిస్తూన్నా ఏదో ఆశతో జీవి ఈశరీరాన్ని అంటిపెట్టుకునే వుంది. చావాలనేది పడుతున్న బాధల యొక్క తీవ్రతమాత్రమే. నిజంగా చచ్చిపోవాలనికాదు.అది అనుకున్న

వెంటనే అనుభవానికి వచ్చేదీకాదు. వచ్చినప్పుడు వద్దంటేపోయేదీకాదు. నీవు ఎవరికోసం ఇంత వలపోస్తున్నావో వాళ్ళు కర్మనిష్ఠులై కానల్లో తిరుగుతున్నారు. కాలమెరిగి సౌమిత్రికందమూలాదులు సేకరిస్తున్నాడు. కాలమెరిగి వాటిని భుజిస్తున్నారు. కాలమెరిగి జానకిభర్తను సేవిస్తూంది. ఆమె అయోధ్యలోని పుష్పారామాలల్లో తిరిగినట్లే, అడవుల్లోకూడాతిరుగుతూంది. పరిచితాలైన పెంపుడు పక్షుల్లాగాక్రూరమృగాలనుచూస్తున్నది. ఆమె ఏంకోరినా లక్ష్మణుడు సాధించి తెస్తున్నాడు.

సాయంవేళ సీతారాములు పర్ణశాలముందు పచ్చనిగడ్డిపైఆసీనులై ప్రకృతిని చూస్తుంటే విచిత్రంగా వున్న విహంగాలు ఎన్నో చెంతకు చేరుతాయి. రామునిదేహకాంతి జలదంగా భ్రమించి నెమళ్ళు క్రేంకరిస్తూ నృత్యం చేస్తాయి. వాటికి మధురఫలాలు సీత అందిస్తుంటే అవి ఆనందంతో ఆరగిస్తున్నై. దూరంగా లక్ష్మయ్య ఆ దంపతుల్లో జననీజనకుల దర్శిస్తూ జన్మకుసాఫల్యం సంతరించుకుంటున్నాడు. రామున్నదిఅడవిలోనన్నమాటఆ ముగ్గురిలోనూ కనిపించదు. అవనీజకు అయోధ్యఅడవిగానూ, అడవి అయోధ్యగానూ వున్నదంటే; ఆమె ఎంత భర్తృసేవాధీనురాలో తెలుస్తూంది. అక్కడ వాళ్ళలా వుంటే ఇక్కడ మనం ప్రస్తానోక్తులతో ఏడ్వటం ఏంసబబు? మేం కలసిపోతున్నప్పుడు జానకి దారిలో కనుపించిన వింతలనూ, విశేషాలనూ అడుగుతుంటే రామలక్ష్మణులలో ఎవరో ఒకరు ఆ సంగతులకు సమాధానం చెప్పేవారు. ఆమెఅప్పుడు అన్నమాటలుఇప్పుడుపూర్తిగాలేకపోయినా కొన్ని గుర్తుకు వస్తున్నాయి. ఆమెకైకేయిని గురించి అన్న...." (కామాసక్తురాలపై ముసలి భర్తనే విడువలేని నీవు, చిరుతవయస్కులమైన మమ్మల్ని ఆ సుఖానికి దూరంచేశావు. నీది స్త్రీ హృదయమేనా?) అన్న మాటలు ముందుగా స్ఫురించి, నాలుక కరచుకొని ఆ ప్రసంగం మార్చి, మంచి మాటలతో. హృదయం వికృతి పొందకుండాసుమంత్రుడుపొడిగించాడు.

"అమ్మా! నీపాదాలపై ఆనపెట్టి సత్యం చెపుతున్నాను. ఎండ వేడికి కాని, వడగాల్పుల తీవ్రతకుగాని, ఆకలి దప్పులకు కాని ఆమె చలించలేదు. ఆమె పెదవులపై దరహాసంపోలేదు. ఆ వదనంలో శోభ తరగలేదు. ఆమె శరీరంలో శక్తిహీనత పొడగట్టలేదు. ఆ మాటలలో

దైన్యం గోచరించలేదు. ఆమె జనకుని బిడ్డ కావటంచేత జ్ఞానివలె నున్నది. రాముని భార్య కనుక వీరపత్నిగా వుంది. అలంకారార్థం పెట్టుకునే లాక్షారసరాగం లేకపోయినా, నిసర్గారుణకాంతులతో చరణాలు అరుణపద్మాలను అపహసిస్తున్నై. ఆమెనుచూచి రాముడు తన్ను తాను సవరించుకుంటున్నాడు. గమనాయాసం కలక్కుండా, తగుమాత్రం భూషణాలు ధరించింది. ఆర్యావర్త పుణ్యభూమిలో అతివలకు అలంకారాలైన అందెలు ఘల్లు ఘల్లుమని రవళించుతుండగా, భర్తతో సరితూగునట్లు హేలగా నడిచి పోతుంటే, వనదేవత పులుగుల ఎలుగులతో పలుకరించినట్లుంది. మధ్యమధ్య దూరంగా తప్పుకుని పోతున్న పులులనూ, సింహాలనూ దయితుని భుజాదండం ఆలంబనంగా వింతగా చూస్తున్నది కాని, కంపితగాత్ర కావటంలేదు. మిమ్ముల కొని పోవటానికి నాకేమీ అభ్యంతరంలేదు. ఎట్టి పరిస్థితులలోనూ పట్టణాన్ని పాడు పెట్టవద్దనీ, భరతుని పిలిపించి తొందరగా పట్టాభిషేకం జరిపించి ప్రజలను స్వీయ కర్మాచరణానికి సిద్ధం చేయించమనీ, మరిమరి చెప్పాడు అందుకు నేను సందేహిస్తున్నాను. అమ్మా! మీరిక వాళ్ళకోసం బెంగ పెట్టుకొనక, చేయవలసిన కార్యాలు పూర్తిచేయించండి. పద్నాలుగేండ్లు నిండంగానే, గ్రహణ నిర్ముక్త సూర్యసుధాకరుల్లాగ తిరిగివస్తారు. బిడ్డల చరిత్ర పృథివీ, రవీ, శశీ, నక్షత్రాలు వున్నంతకాలం స్థిరంగా నిలుస్తుంది. అసూయాపరులూ, మత్సరగ్రస్తులూ, సంస్కారహీనులూ, జాతిద్వేషులూ, దుర్బుద్ధితో విమర్శిస్తూనైనా వారి నామస్మరణతో తరిస్తారు. చంద్రునికైనా కళంకంవున్నది కాని, వారి యశశ్చంద్రునికి అదికూడా వుండదు. పితృవాక్య పాలకుడెవడన్న రామచంద్రుడు ఒక్కడే అన్న ప్రతిష్ఠ కలకాలం నిలుస్తుంది. ఎవడు సత్యపరాక్రముడు అన్న ప్రశ్నకు రాముడు ఒక్కడే అన్న సమాధానం వస్తుంది. ఆదర్శ దంపతులుఎవరంటే సీతారాములేనని చేయెత్తిచెపుతారు. శుభాంతమయ్యే వారి చరిత్రకు శోకించటం మనకు తగదు" అంటూ వుభయ దుఃఖోపశమనం అయ్యేట్లు వూరార్చాడు.

# పతి చేసినపని పతితో చెప్పి కౌసల్య దుఃఖించుట

సుమంత్రుడు శోకోపశమనంకోసం చెప్పినమాటలు వారల ప్రేమమ కారం పెంచగా కౌసల్య బిడ్డలతలచుకొని బిట్టుగారోదిస్తూ, ప్రభువును గాంచి "నాథా! మంత్రిమాటలు విన్నావుగదా? ఆమాటలు ఓదార్పు కోసం చెప్పినవే. నీవు వదాన్యుడవనీ, కారుణికుడవనీ, సత్యవాగ్ధనుడ వనీ, ప్రియవాదివనీ, పేరు గాఢంగా సంపాదించుకున్నావు. నీకీర్తి ప్రతిష్ఠలు, రాజభోగాలులేకున్నా, లోకసామాన్యంగానైనా బిడ్డలు బ్రతుకుతున్నట్లు చేయలేదు కదా? ఇక చలికీ, వేడికీ, గాలికీ వలిగొన కుండా ప్రకృతి స్వభావాన్ని మార్చి సుఖం కల్పించగలవా? ఎన్నెన్నో ఉచ్చపదార్థాలు నోటికి ఇంపుగా సుఖభోజనంచేసే కొడుకులూ, కోడలూ వేరు వెళ్లంకులతో కడుపు నింపుకోకుండా కల్పవృక్షఫలాలిచ్చి కాపాడ గలవా? పట్టుపరుపులపై పవళించే నా తండ్రి ఆకులపైనో, గడ్డిపైనో, చేతిని దిండుగా పెట్టుకుని దిక్కులేని వానివలె నిద్రపోవలసిందేకదా? దిక్కులకెల్ల పెద్దదిక్కైన తండ్రికలుషంచి దుఃఖసముద్రములో త్రోస్తే, ఇంకా దిక్కెక్కడ? ఇక జీవితంలో నా బిడ్డలను చూస్తానో చూడనో.

పూలతావి వంటి నిశ్వాసాలతో, పున్నమిచంద్రునివంటి ముద్దు మొగంతో, తుమ్మెదలగుంపును హసించేముంగురులతో, వికసించిన పద్మాలవంటి నేత్రాలతో, వెన్నెలవలె చల్లనైననవ్వుతో కన్నులపండువు కల్పించే కన్నయ్య ఎప్పుడువస్తాడో. ఈతల్లిని ఎప్పుడు ఆదరిస్తాడో. ఇంత ఘోరాతి ఘోరమైన సంఘటన జరిగితే నా గుండె ఇంతింత ముక్కలుగావగులలేదు. వజ్రసారంతో బ్రహ్మ చేసివుంటాడు. కాకపోతే ఎందుకు వేయి తునుకలుగా ప్రీలిపోదు? నా కొడుకులనూ, నాకోడలినీ, నాపు కాకుండా, భయంకర గహనాల పాలుచేసిన భర్తవు. నీవంటివారు లోకంలో ఎక్కడైనా వున్నారా? పదునాల్గేండ్లు గడిచిన పిదప నాబిడ్డ తిరిగివస్తే, అప్పటికి భరతుడు పాలిస్తూ వుంటాడు. తమ్ముడేలే రాజ్యానికి అన్నఎన్నడూఆశపడడు. అన్నపైభక్తితో భరతుడిచ్చినా గ్రహించడు. శ్రాద్ధకర్మకుయోగ్యుడైన బ్రాహ్మణుని పిలువక, ధన లోభంతో, ఇష్టమైన వారిని సంతుష్టిగా అర్చనచేసి, "మీరుసహపంక్తి భోజనానికి రమ్మంటే,

అట్టివారి ఇండ్లలో అమృతంపోసినా, గుణవంతుడైన భూసురుడెవ్వడూ గుటకవేయడ"ని మీకు తెలియదా?

మున్ముందుగా అర్పింపబడ్డవారు బ్రాహ్మణులైనా, తిరస్కారం పొందిన విప్రులు భుజింప సమ్మతించరు. మీరు మిక్కిలి శృంగభంగంగా భావిస్తారు. ఆవిధంగానే, తమ్ముడనుభవించిన రాజ్యాన్ని, తర్వాత వచ్చి "ఇది నా రాజ్యం. కారణాంతరాలచేత కానలకు పోయినా, మాట దక్కించుకుని మళ్ళీ వచ్చాను. నాది నాకీయి" అని ప్రతిష్ఠాకరుడైన నాకొడుకు తనజ్యేష్ఠత్వాన్ని నిరూపించుకుంటూ కనిష్ఠునితో కలహిస్తాడా? దీనభావంతో దానం అడుగుతాడా? పరజంతు భుక్తశేషాన్ని వ్యాఘ్రం ఎలాతినకోరదో, పురుషవ్యాఘ్రమైన నాబిడ్డ, అనుజభుక్తశేషానికిఆసపడ తాడా? సవనంచేసే సంకల్పం కలవారు ఎప్పుడైనా, నేయి, దర్భలు, హవిస్సులు, పురోడాశం యూపస్తంభాలు క్రొత్తసవనానికి కోరు కుంటారా? త్రాగగా మిగిలినసురవలె, వ్యతసోమమైన యజ్ఞంలాగా, అన్యభుక్తమైన రాజ్యాన్ని ఆకాంక్షించటానికి అంతచెడి బ్రతికాడా నా కొడుకు? ఇంత అవమానం నాతండ్రిసహిస్తాడా? తోకతొక్కిన భుజంగం సుప్తంగా వుంటుందా? చతుర్దశభువనాలు ఏకమై ఎత్తివచ్చినా, కోదండ పాణిగా నిల్చిన నాకొడుకును యుద్ధరంగంలో ఎదురించి నిల్వగల వలంతులవునా? అధర్మాన్ని పూనినవారిని, ధర్మపథానికి త్రిప్పవలెననే తలంపులో నున్నాడు కనుకనే ఇంత సహనం వహించాడు.

యుగాంతకాలుడులాగా, బంగారు పుంఖంగల బాణాలతో జలధి సప్తకాన్ని ఇంకించగల్గినవాడు, సప్తభూతసంఘాన్ని సమయించగల వాడు, సింహబలుడు, వృషభాక్షుడు అయిన నారామయ్య, పెద్దచేపచిన్న చేపను మ్రింగినట్లు తండ్రి చేతనే విజితుడైనాడు. రాజా! నీవు వేద వేదాంగ వేదివి. వశిష్ఠాదిమహర్షుల అంతేవాసివి. నిత్యకర్మానుష్ఠాన పరాయణుడవు.రాజధర్మశాస్త్రనిష్ణాతుడవు.తోడిరాజలోకంలో,కన్న పెద్ద కొడుకునుకానలపాలొనరించి, కనిష్ఠునకుపట్టంకట్టటంధర్మమనిసమర్థించ గలవా? లేకసనాతనధర్మశాస్త్రవిధియనిఎత్తిచూపించగలవా?ఆడవాళ్ళను గూర్చి ఆర్షధర్మం ఏమనిచెప్పింది? మొదటి దిక్కు మగడు. రెండో దిక్కు కొడుకు, మూడో దిక్కు చుట్టాలు. సవతి మోహపాశంలో చిక్కి

నన్ను వదలి, నీవు వున్నా మగడు లేనిదానిగా చేశావు? నా కొడుకును అన్యాయంగా అడవికినెట్టి ఆ దిక్కు కూడా లేకుండా చేశావు. "నా"అనే బంధువు లెవ్వరూనాకు లేనేలేరు. ఆత్మజునితో అడవిలో జీవిస్తానను కుంటే, పతి బ్రతికివుండగా సతివిడిచి పోవటం ధర్మంకాదు. కట్టుకుని సుఖపెట్టక పోగా అన్నివిధాలా నన్ను నాశనంచేశావు. ఇంతకు నీవట్ల నేను చేసిన తప్పేమిటి?

నీవల్ల జ్యాతలం హతమైపోయింది. నీవునూ, మంత్రులూ హతులైనారు. నేనూ, నాబిడ్డలూ నాశనమైనాం. పౌరులుహతులైనారు. యుగ యుగాలుగా అన్వర్థంగా వెలిగిన అయోధ్యామతల్లి హతమైంది. ఇక నీప్రియురాలు, ముద్దులు కూర్చేమురిపెపు ఇల్లాలు కైకమ్మా, ఆవిడ వల్ల కన్న నీసుతుడు భరతుడూ, అతులితభోగభాగ్యాలతో అయోధ్యను హాయిగా ఇకమీద ఏలుకుంటారు. "రోగీ పాలే కోరాడు, వైద్యుడూపాలే కోరాడు" అన్నట్లు ఉభయుల కోరికలు ఒక్కమాటే సిద్ధించినై. ఇంత మమకారం నాబిడ్డపైవుండగా, ఇంతకింతెంత మమకారంకైకమ్మమీద లేకపోతే, పిలిపించి, బికారివలె నారగుడ్డలతో కారడవికి పంపుతుంటే, కఠినంగాశాసిస్తుంటేకళ్ళారాచూశావేకాని, కాదనిమందలించగలగావా?" అని కౌసల్య కడుపుచిచ్చులో కఠినంగా పలుకుతుంటే విని, చేతనా రహితుడై నేలపడిలేచి, నిలువలించుకోలేక మరల మూర్ఛిల్లి, మనస్సులో "కౌసల్య పలుకులు కఠినంగావున్నా, సత్యస్థిరాలూ, అనుభవైక వేద్యాలూ, ఇతరులెవ్వరూ చేయని ఇంత నీచకార్యం, ఇక్ష్వాకువంశంలో ఇనుడుగా ప్రకాశించిన అజమహారాజునకు ఆత్మజుడనైన నేను ఎలా చేశాను? ఎందుకు చేశాను? కారణంలేని కార్యంవుండదుగదా? అది ఎట్టిదై వుండాలి?" అని తర్కించుతుండగా,—

## దశరథుడు కౌసల్యను క్షమాభిక్ష కోరుట

తాను పూర్వంచేసిన మహాపాపం మనస్సుకు గోచరించసాగింది. శబ్దవేధి బాణ ప్రయోగంతో సంక్రమించిన మహాకలుషం, మునివరా, బుద్ధికి అందింది. పుత్రునిపోకకూ, తనకీ దుర్గతి రాకకూ కారణం కనుపించింది.

మేరు గంభీరుడైన ధారుణీపతి దశరథుడు గలంస్మృతికిరాగానే సతిదిక్కుమొగమై, అంజలించి "దేవీ! నన్ను క్షమించు. నీప్రసాదాన్ని అర్థిస్తున్నాను. అర్థులకిచ్చినవాణ్నేగాని అర్థించినవాణ్ని కాను. నాకుక్షమా భిక్షపెట్టు. ధరణీపతి శ్రేష్ఠులలోతలఎత్తినవాణ్నే కాని, తలదించినవాణ్ని కాను. తలమోకరించి వేడుకుంటున్నాను. కాని జనంపట్లకూడా కరుణ తొరంగవు. తాళికట్టిన నన్ను దయతోచూడు. నీపట్ల కసుగానకఎంతో కఠినంగా ప్రవర్తించాను. పతివ్రతలైన భార్యలకు భర్తగుణకాంతుడైనా, గుణహీనుడైనా ప్రత్యక్ష దైవ అని భారతీయధర్మం ప్రబోధిస్తున్నది. నీవు నిత్యధర్మతత్పరవు. నిత్యం లోకంలో జరిగే మంచిచెడ్డలుతెలిసిన దానివి. పతి జీవితవు. గుణవంతురాలవు.పుండుపై పుప్పుచల్లినవిధంగా పశ్చాత్తాప వహ్నిలోపడి కాలుతున్న నన్ను,నీవేదిక్కని వచ్చిన నన్ను, ఎంత పుత్ర దుఃఖితవైనా ఇంత పరుష వాక్యాలతో బాధించటం ధర్మ మేనా? శాంత కరుణారసాలు రూపొందిన నీవుఅవసానదశలోఆదరణకై అర్రులు చాచివచ్చిన నన్ను హతాశుణ్ని చేస్తావా? కన్నులగప్పిన కామాంధకారం పుత్ర వియోగంతో పుట్టిన వివేకభానూదయంతో పటా పంచలైంది. నా తప్పు నాకు తెలిసింది. కేలుకాలినతర్వాతగాని కేకయ రాజపుత్రి నైజస్వరూపం తెలియలేదు. సుమిత్ర మహాయోగిని. "ఇప్పుడు చేయవలసింది ఎత్తి పొడుపులు కావు. పతి ప్రాణరక్ష" అని చెప్పిందికదా? నీచెల్లెలి ధర్మాన్ని స్వీకరించు. నన్ను మన్నించు మన్నించు"అని దైన్యంగాపలక్క ప్రాణేశ్వరుణ్ణిచూచి, భయసంభ్రమాలు పొంది. కౌసల్య, కాంతుని కరద్వయం పట్టుకుని కన్నీరు కారుస్తూ, "హృదయపతీ" క్షమించు, నీపాదాలమీదపడి ప్రార్థిస్తాను. భార్యనుభర్త వేడుకుంటం లోకవిరుద్ధం,ధర్మదూరం. అసలేజీవమాత్రావశేషగావున్న నన్ను అర్థించి ఇంకా చంపటం నీకు న్యాయంకాదు.

ఏసతి భర్తను బాధించి, సాధించి వేడుకునే స్థితికి తెస్తుందో, ఆ సతికి ఇహపరాలు రెండూ దూరం కావటంకాక నిష్కృతిలేని నిరయం కలుగుతుంది. నిన్ను నేను తెలియని దానను కాను. నీవు కర్మిష్ఠివి. అపార కృపా సముద్రుడవు. అర్థిజనచింతామణివి. ఆశ్రితకల్పకమవు. నీ చరణ దాసిని.నిన్ను పరుషవాక్యలతో బాధించాలనే భావంనాకులేదు.సత్యంగా

చెప్తున్నాను. అకాలంలో పుత్రవతినైనాను. అందులో లోకోత్తరగుణ సౌందర్యశూరతా లక్షణాలు మూర్తీభవించిన బిడ్డకు తల్లినైనాను. ఆ జగన్మంగళమూర్తి వియోగం భరించలేక, ఆ మనోహరాకారుని మరువలేక, కడుపుశోకంతో కారుకూతలు కూశాను. ఏస్థితిలోనూ చేయకూడని పనిచేశాను. వరిలేని శోకం ధైర్యాన్ని నశియింపచేస్తుంది. ధర్మాన్ని పాడుచేస్తుంది. శ్రుతజ్ఞానాన్ని హతంచేస్తుంది. మంచిచెడ్డలు గుర్తించే మనస్స్వాస్థ్యాన్నిమంటలో కలుపుతుంది. చూడచూడగా, శోకంలోశోకం కంటేబద్ధశత్రువుఇంకొకడులేడు. వరునికరాఘాతాన్నిభరించవచ్చుగాని, హఠాత్తుగా వచ్చిన దుఃఖాన్ని ఓరించటం సాధ్యంకానిపని. అబ్బాయిని విడిచి అయిదుదినాలైంది. అయిదు యుగాలుగా ప్రాణంపరితపిస్తోంది. పూర్ణంగా ప్రవహించు నదుల వేగంలో సాగరుడు వృద్ధిపొందినట్లు, చింతించినకొద్దీ శోకం అంతకంత పెరుగుతున్నదేకాని తరగటంలేదు."

## దశరథుడు తను చంపిన తాపసిపుత్రుని కథ ధర్మపత్నికి చెప్పుట

అంటూ ఓదార్పుతుండగా సూర్యుడు అస్తమించాడు. చక్రనేమి క్రమగతిలో పగలు గతించి రాత్రి వచ్చింది. సతిహితోక్తులు వినికూడా శాంతిలేక, రాజు పగపు కలతలోనే కనుకూర్చాడు. రవి బింబాన్ని రాహువు గ్రసించినట్లు ఆత్మదోషాన్ని కూర్చిన చింత ఆవహింపగా, కొదుకుంటూ, కోడలిని తలంచుకుని ఆ ఆరవనాటిఅర్ధరాత్రిఆకస్మికంగా లేచి, భార్యను లేపి చెప్పసాగాడు. "ప్రాణేశ్వరీ! ఒకవిషాదగాథ చెపుతా విను. ఇంతవరకు నాకు మాత్రం తెలిసిందీ, లోకానికి తెలియందీ అది. మేలైనా, కీడైనా, మానవుడు ఏది ఇతరులకు చేస్తాడో అది ఫలకాలం రాగానే అనుభవిస్తాడు. దాని పరిహారానికి దారి ఏమీలేదు.

"అవశ్యమను భోక్తవ్యం కృతం కర్మ శుభాం శుభమ్." ఎవడు కార్యప్రారంభంలో చేసేపని, శుభ దుష్పరిణామాలల్లో దేనికి దారితీస్తుందో విచారించకుండాతొందరపడి చేస్తాడో వాడు బావిశాభముడు. పూర్వంఒక మూఢుడు పంకలకంటే పూలు అధికంగా లభిస్తాయని మామిడి తోటనరికి మోదుగు చెట్లు నాటి, ఎంతో శ్రద్ధతో, నీళ్ళుపోసి పెంచి ఫలాసన్నకాలం

రాగానే వట్టి పూలేకానిపండ్లులేని, వాసనలేని ఆచెట్లను చూచి తలమోదు కున్నాడట.అవిధంగానేవిచారించక ఆనాడుచేసి ఈనాడుఏడుస్తున్నాను. నూనూగు మీసాల, నూత్న యౌవనంలో శ్రమసాధ్యమైన శబ్దవేధి సాధించిన గర్వంలోచేయరాని పాపకార్యం చేశాను. లినుబండారం అని బాలుడు విషం మ్రింగినట్లు లక్ష్యశుద్ధి కోసం చేసినపని ఇంత విపరీత పరిణామానికి దారి తీస్తుందని అనుకోలేదు. ఆ సంగతి సముద్రం బడ బానలాన్ని దాచినట్లు ఇంతవరకూ దాచుకున్నాను. అనుభవకాలం, అవ సానసమయం ఆసన్నమైంది కనుక చెపుతాను విను.

దేవీ! అప్పటికి నీ కింకా పెండ్లికాలేదు. నేను యువరాజ పదవిలో వున్నాను. వానకాలం వచ్చింది. సహస్రకరుడు, మదనశరా విద్ధుడైన మానిని మదవతిని పీడించినట్లు భూదేవిని పీల్చి పిప్పిచేసిదక్షిణ దిశాభిముఖుడైనాడు. వేడిగాల్పులు చూడ మచ్చుకైనా లేవు. ఆకసం మేఘావృతమైంది. మండూకాలరొదలు నిండుకున్నై. తుమ్మెదల ఝుంకారం, నెమళ్ళ క్రేంకారం గగనతలం క్రమ్ముకుంది. స్నానంచేసిన చందంగా రెక్కలు తడిసిన పక్షులు గాలికీ, వానకూ కదలాడుతున్న చెట్లకొమ్మల గూళ్ళలోకి చేరుకుంటున్నై. భోరుమంటూ వర్షంకురు స్తూంది. ఆ ధారల్లో దోగినమత్తమాతంగం. గిరీ,అలలులేని అంబుధిలాగా గోచరిస్తున్నై. గైరికధాతువులచే కూడి, గౌరారుణ వర్ణంలో సెలయేళ్ళు ప్రవహిస్తూ, దవానల దగ్ధాటవీ భస్మరాసుల్లాగా భ్రమకల్పిస్తున్నై. ఆసమయంలో ఎర్రని జలంతో నదులు ఒడ్డు ఒరుసుకుంటూ పొర్లిపారు తున్నై. ఆకాలం మనస్సుకు ఎంతో వుల్లాసం కల్పించుతూంటే రథా రూఢుడనై వేటకు వెళ్ళాను. సరయూనదీ తీర సమీ పారణ్యాలలో, దుప్పులూ, అడవిదున్నలూ, ఘాతుక మృగాలూ లెక్కలేనన్ని నాబాణా నలానికి భస్మమైనై. ఆనాటి రాత్రిమాటు చాటున దాగి, మత్తేభ వ్యాఘ్ర సింహాలను మట్టుబెట్టుదామని ఆసక్తితో విల్లెక్కుబెట్టి వేచి చూస్తున్నాను. అప్పుడు కొంత దూరంలో నీటిలో చప్పుడు వినిపించింది. ఆశబ్దం ఏనుగు జలపానం చేస్తున్నట్లుంది. కటిక చీకటి. కాళరాత్రి. కన్ను పొడుచుకున్నా కానరాని సమయం. వుత్సాహం వురకలు వేస్తూంది. శబ్దవేధి లాఘవంలో శరసంధించి నీరు త్రాగుతున్నది ఏనుగు అని

భావించి విడిచాను. ఏ ధ్వని దిక్కుగా బాణంవేశానో ఆ దిక్కునుండి బాణపాతంకాగానే "అబ్బా" అన్న మనుజ కంఠస్వరం వినిపించింది.

ఆవిషదగ్ధ శరాహతికి అవశుడైపడిన ఆ ప్రాణిబాధలోమూల్గుతూ, "అయ్యయ్యో! నేను మునిబాలకుణ్ణి. నామీద ఇంతవాడి బాణం ఎందుకు పడింది? ఎవరు వేశారు? మానవ సంచారంలేని అడవిలో అర్ధరాత్రివేళ, నీటికై వచ్చిన నన్ను చంపటంకోసం ఎప్పుడువచ్చారు? వాడికినేను ఏం ఎగ్గుచేశాను? హింసాకర్మాన్ని వదలి ఆకులలములు తింటూ ఋషివలె పొట్టపోసుకొను నేను, జడలుదాల్చి, నారచీరెలుకట్టి మారుమూల బ్రతికే నే నెక్కడ? క్రూరదారుణ బాణానికి గురియై కూలు టెక్కడ? నన్ను వధించి ఏమి సాధించ తలచాడో? ఇది తెలిసినలోకం అతని దుమ్మెత్తి పోయదా? భగవంతుడా! బాధ భరింపలేకుంటా వున్నాను. నామరణానికి అంతగా నేను శోకించను. ముసలి తల్లిదండ్రుల తలచిన గుండెలుఝల్లు మంటున్నవి. నామరణానంతరం వారికి దిక్కేది? ఎవరు చూస్తారు? బుద్ధిమాలిన మూర్ఖుడు ఒక్క బాణంతో ముగ్గురిని బలిగొన్నాడు" అని రోదిస్తుంటే నాఅవయవాలు విరవిరలాడి పోయినై. ఆ దుఃఖంలో నా చేతిలోని శరచాపాలు ధరణిపైబడినై.

పొంగివస్తున్న శోకాన్ని ఆపుకుంటూ సరయూ తీరానికిపోయి నెత్తుటిలో తడిసి, పగిలిన కుండమూతి చేతిలో వుండగా నేలపై పడి కొట్టుక లాడుతున్న మునిబాలకుణ్ణి చూశాను. నన్ను చూసిన వెంటనే ఆబాలుడు మండిపడుతూ అన్న మాటలు ఏమనిచెప్పేది? తాపసవృత్తిలో అడవిలో జీవిస్తున్న నేను నీకేమి అపచారం చేశాను? తలిదండ్రులుదప్పి తీర్చుకునేందుకు నీళ్ళకోసంవచ్చాను. నిష్కారణంగానీచేతిలోచచ్చాను. నీబాణం నన్నొక్కణ్ణే కాక ఇంకా ఇద్దరి ప్రాణాలు తీసింది. ఇంకా వస్తాననిఎదురుచూచే చీకులూ, అంధులైన తల్లిదండ్రులకు నాచావువార్త ఎవరు చెపుతారు? వెదకికొంటూ రావటానికి కళ్ళులేవు. నడవటానికి కాళ్ళల్లో శక్తిలేదు. ఏ విధంగా వారికి తెలుస్తుంది? కూలిన చెట్టు కూల నున్న చెట్టును కాపాడుతుందా? అయ్యో! చేసిందేమో చేశావు. నీవే మా తల్లిదండ్రులకీ వృత్తాంతం చెప్పు. ఆలస్యంచేస్తే ఆగ్రహంతో శపిస్తారు. అనర్థంవస్తుంది. జరిగినసంగతిచెప్పి వేడుకుంటేఅనుగ్రహించ

వచ్చు. ఈకాలిదారినపోతేమాఆశ్రమంవస్తుంది. బాధపడలేను.బాణంతీసి వేయి. బాణంతీయగానే మరణిస్తే బ్రహ్మహత్యాపాతకం వస్తుందనిభయ పడబోకు. నేనుద్విజుణ్ణికాను. నాతల్లి శూద్రకాంత. నాతండ్రి వైశ్యుడు. నాప్రాణం తీవ్రవేదనకు గురి అవుతున్నది. భరించలేకుండావున్నాను" అని దీనంగా పలుకుతుంటే, ఒక్కొక్కమాట ఒక్కొక్క కత్తిపోటు వలె గుండెల్లో నాటసాగింది. యాతనావస్థలోచూడ భయంకరంగావున్న ఆ మునిబాలునిశరీరంలో నాటిన శరాన్ని తీసివేశాను. భీతక్రీతుడై నన్ను చూస్తూ మరణించాడు.

ఆబాలుని మరణావస్థను కళ్ళారాచూచి బహుకాలం శోకించాను. "మునిబాలుని జననీ జనకుల దర్శనార్థం వెళ్ళటమా, మానటమా" అని చింతించి నీటింగొని, విన్నదారిపట్టి ఆశ్రమానికి చేరుకున్నాను. కాళ్ళు కదపలేని వాళ్ళను, కన్నులులేనివాళ్ళను, వృద్ధులైనవాళ్ళను, కొడుకు కోసం అడలుతున్నవాళ్ళను చూశాను. అడుగులుతడబడుతూ, నడవలేక నడిచి సమీపించాను. అడుగుచప్పుడు ఆలకించి "ఏమిరా! బిడ్డా! ఇంత సేపైనరాకపోతేఎంతోదిగులుపడుతున్నాం.వాహంతోకొట్టుకుంటున్నాం ఎప్పుడూ ఇంత కాలహరణంచేయలేదు. తొందరగా నీళ్ళుత్రాగించి ప్రాణాలునిల్పు" అంటూ బిడ్డకోసం పరితపిస్తున్న మునికి నమస్కారం చేసి, "అయ్యా! పాపాత్ముణ్ణి. నన్ను దయతో రక్షించండి. మీపాదాలపై ప్రమాణంచేసి పలుకుతున్నా. నేను మీపుత్రుణ్ణికాను. అయోధ్యాపతి అజమహారాజు కొడుకును. నాపేరు దశరథుడు. క్షత్రియవంశంవాణ్ని. సజ్జనగర్హితమైన కార్యం బాల్యచాపల్యంవల్ల సలిపాను. ఈ పాపం బుద్ధి పూర్వకంగాచేయలేదు. వేటకైవచ్చి, అర్ధరాత్రిమాటులోనుండిదూరంగా ఏనుగు జలపానంచేస్తున్న విధంగా ధ్వని వినిపిస్తే శబ్దవేధిలాఘవంతో శరసంధానంచేసి ప్రయోగించాను. ప్రయోగానంతరం బాణంపోయిన దిక్కుగా పోయిచూస్తే ఏనుకు మారుగా మీపుత్రుడు పడివున్నాడు. నేను క్షమాభిక్షకోరాను. ఆ బిడ్డడు మీ వృత్తాంతంతెలిపి పొమ్మంటే మీకడకు వచ్చాను. తెలిసికాని, తెలియకకాని మీబిడ్డను చంపిన మహాదోషిని. శిక్షించినా,రక్షించినాసత్యంమీకువిన్నవించుకున్నాను"అనిప్రార్థించాను.

నామాటలువినగానే పుత్రమరణశోకసంతప్తులైన ఆ దంపతులు

హాహాకారంచేశాను. అందులో మునిశ్రేష్ఠుడు ఆగ్రహంతో ఇట్లుఅన్నాడు. "రాజా! తాపసులమై వానప్రస్థులమై, అంధులమై, ఆ ఒక్క బిడ్డడు ఆసరాగా కాలంగడుపుతున్నాం. నీవేకాదు, ముల్లోకాలకుఅధిపతి ఇంద్రుడైనా ప్రజ్ఞాపూర్వకంగా వధిస్తే ఈ పాటికి దండి కరదండానికి గురి అయ్యేవాడే. నీవు తెలియకచేసి, పశ్చాత్తాపంపొంది, చేసినపాపం చెప్పి ఒప్పుకున్నావు కనుక బ్రతుక కలిగావు. లేకపోతే నీ శిరస్సు వేయిముక్కలుగా ఎప్పుడో ప్రేలిపోయేది. నీతో రఘువంశ నాశనం కూడా జరిగేది. నా బిడ్డ చచ్చిన స్థలానికి మమ్మల్ని తీసుకొనిపో. వాణ్ని చూడాలని వుంది." అని. వారిమాట ప్రకారం వృద్ధుల ఆ ప్రదేశానికి చేర్చాను. అంధులైన తలిదండ్రులు బిడ్డను తడవి తడవి, పనవి పనవి అనేకవిధాల తలచుకుని ఆక్రందించారు. అనంతరం ఆ వృద్ధతాపసికొడుకునుద్దేశించి "నాయనా! నిన్ను క్షత్రియుడు చంపినందున, నా సత్య తపోబలంతో శస్త్రయోధులు పొందే స్థానం పొందు. యుద్ధంలో మరమ ద్రిప్పకుండా పోరిమరణించిన శూరులు చేరేలోకం చూరగొను. సగర దిలీపులు, శైబ్య నహుషులు. దుంధుమార జనమేజయులు పొందిన పుత్తమగతులు నీవు పొందు. ఏకపత్నీ వ్రతస్థులూ, అనేక గోసహస్ర దాతలూ, గుర్వర్చనాభి గతులూ, యోగంతో శరీరత్యాగంజేసినవారూ, ఏ స్థానం పొందుతారో ఆ స్థానం నీకు అప్రయత్నంగా వచ్చుగాక. పితరులు పూర్వలోకంలో సుఖంగావుండటానికి గంగాకళిందజా సంగమ స్థానంలో పిండోదకాలు పుత్రులు విడిస్తే ఏ సుఖం పొందుతారో ఆ సుఖం పొందు. ఇంతవరకు మా వంశంలో పుట్టినవారికి ఎవరికీ అధమ గతులులేవు. నీకు మాత్రం ఎందుకు కలుగుతవి?"

అని పల్కుతూ పుత్తమగతులు పుత్రునికి గలిగేట్లు పుద్దేశించి, సర్వతపః ఫలంతో వుదకం దారపోశాడు. ఆ ముని బిడ్డడు ఉదకక్రియ చేయగానే దివ్య రూపంతో ఇంద్రునిపజ్జరథంలో కన్పించి గగన వీథి నుంచి, తల్లిదండ్రులతో "తల్లిదండ్రులారా! మీ సేవాభాగ్యంతో, మీ అనుగ్రహంతో నాకు పరలోక సుఖాలన్నీ ప్రాప్తించినై. మీ రిక చింత పడకండి. త్వరలో మీ దివ్య దర్శనం నాకు లభిస్తుంది" అని పల్కుతూ అంతర్హితుడైనాడు.

# దశరథునకు ఋషి శాపం ఇచ్చుట

ఆ వృద్ధతాపసి ఆత్మజుని పల్కులు ఆలకించి, భార్యతో కలసి, సామసార్థకంగా లఘువుగా శ్రాద్ధకర్మ ముగించి, కడసారి కొడుకును తలచుకుని కడుపు మంటతో నన్ను జూచి "రాజా! నీవు ఏక పుత్రకుడనైన నన్ను అపుత్రకుణ్ని చేశావు. వాడుమాకు పిండోదకాలు ఇచ్చుటకు మారుగా వాడికి నేనే ఇచ్చే దుఃస్థితికలిగించావు. తెలివిమాలి, ధీశాలినీ, శుచినీ, సంరక్షకుణ్ని, కొడుకును సంహరించావు. మేంకూడా బిడ్డను చేరబోతున్నాం. నీ పాపం నీవు అనుభవించక తప్పదు. మాకీ ముసలితనంలో నేపుత్రశోకంకల్పించావుకనుకనీవుకూడాబిడ్డపైబెంగతో ముసలితనంలోనే ఏకాంతంగా ఏడ్చిఏడ్చి కూలుతావు. తెలియక చేశావు కాబట్టి నీకు బ్రహ్మహత్యాపాతకంరాదు. దాతపు ఇచ్చిన దక్షిణఫలితం లాగా శీఘ్రంగా నీవుమాత్రం అనుభవిస్తావు" అని శాపంఇచ్చి, నాచేత చితిని పేర్పించుకుని ఆ దంపతులు అందులో ప్రవేశించి ఆత్మాహుతి చేసుకున్నారు. ఆ శాపానుభవకాలం ఆసన్నమైంది. అపథ్యంచేస్తే రోగం తిరగబెట్టినట్లుబాల్యంలో వేడుకగా చేసిన పాపఫలంఇప్పుడుఅనుభవానికి వచ్చింది. ఆ అంధఋషిశాపం అక్షరాలాజరిగింది. పుత్రమమకారం అంతకంతకూ అధికం అవుతూంది. కళ్ళు కానరాకుండావున్నై. నీవు కనుపించటంలేదు. దగ్గరకువచ్చి నన్నుతాకు. రామచంద్రునిపట్ల నేను చేసింది నాకే సరి. నాపట్ల రామయ్యచేసింది రామయ్యకే సరి. ఈరెండు ఘటనలూ వెనుకలేవు. ముందురావు. ఏమంటే, ఎంత దుర్మార్గుడైనా కొడుకును వెళ్ళగొట్టే తండ్రిలోకంలో లేడు. నేనొక్కణ్నితప్ప. ఎంత మంచివాడైనా కొడుకు, దుష్టుడైన తండ్రిమాట మన్నించి అడవులకు పోవటం ఇంతకుపూర్వం లోకంలోలేదు. రాముడు ఒక్కడుతప్ప. చచ్చినవాళ్ళు బ్రతికినవాళ్ళనుచూచే అవకాశంలేదు. చావకముందేబిడ్డను చూడాలనివుంది. మారామయ్యను చూసి మరణిస్తే యమలోకగమనం రాదు. నాతండ్రి నన్నుతాకితే దివ్యశరీరంవస్తుంది. లేదు. నాకు అంతటి యోగ్యతలేదు. ఋషిశాపం సమీపించింది. అర్ధరాత్రి ఆ ముప్పూరూ మరణించారు. నేనూ ఈ రాత్రే మరణిస్తాను. నా జగదభిరాముని, నా కల్యాణరాముని, నా ఆనందధామునిచూస్తేప్రాప్తినాకులేదు. వనవాసా

నంతరం. బ్రహ్మచర్యంలో సాధించిన దివ్యతేజంతోవచ్చిన నా విద్యను ఎవరుచూస్తారో వారు ధన్యులు. వారు మానవులుకారు దివ్యులు.

దేవీ! వున్నావా? ఉంటే దగ్గరకురా. ఇంతవరకు కన్నులే పోయినై. ఇప్పుడు చెవులుకూడా పోయినయి. పుత్రవ్యామోహంలో గుండెపగిలి ముక్కలైనట్లుంది. నూనెలేనిదీపంవలెచిత్తనాశంకాపటంతో ఇంద్రియాలు స్వశక్తి కోల్పోయినయి. ప్రవాహవేగం ఒడ్డులనున్న వృక్షాలను గూల్చినట్లు పుత్రమోహం నన్ను అవశుణ్ణి చేస్తున్నది. నేను చెడ్డాను. నీకు తీరని అనర్థపరంపర చేతులారా తెచ్చిపెట్టాను. సుమిత్ర కూడ భార్యయన్న సంగతి బొత్తిగా మరచి ఆమెను అన్నివిధాలా అన్యాయంగా వంచించాను. కట్టుకున్న భార్యను కష్టాలపాలుచేసి, యౌవనమదంలో స్వేచ్ఛగాతిరిగి, ఇంద్రియాల పటుత్వంతప్పగానే, అన్నోదకాలకుదూరమై ఆదరించేదిక్కులేక ఆ భార్యనే ఆశ్రయించ వచ్చినవానికీనాకూ భేదంఏముంది? అధికారం పోయింది.అహంచచ్చింది. దేహబలం, బుద్ధిబలం మొదలే నశించినది. గతంఅంతా స్మృతికివచ్చి కన్నులకు కట్టినట్లు కనుపిస్తూంది. సుమిత్రను పిలువు. రాత్రిగడవదు.

## దశరథుడు మరణించుట

ఓసీ! కేకయ సంతానమా! వంశ ఘాతుకీ! గుణవతులైన సతుల వదలి, నీతో కులికినందుకు తగినవిధంగా దండించావు. దైవంనీకిచ్చిన సౌందర్యం, తెలివితేటలూదగ్ధంచేసుకున్నావు. నాకొడుకునుదూరంచేసి, నన్ను చంపుకుని, విధవవయినావేకాని, నీకొడుక్కు పట్టం కట్టుకో గలిగావా? నీఇంటిలో నన్నుంచుకో గలిగావా?.... ఆఁ! అవును, తండ్రీ! నీవు చెప్పింది సత్యం. ఇక నాకు ఈలోకంతో పనిలేదు. నిన్ను పుత్రుడుగా పొందటంవల్ల నా చేసిన పాపాలు నాశనమైనై. పశ్చాత్తాపం వల్ల పరిశుద్ధమైంది హృదయం. ఇంక ఎవరినీ నిందింపను. శోకం పోయింది.జ్ఞాననేత్రాలువిప్పారినై.ఎవరికివారే,యమునాతేరే."ఋణాను బంధ రూపేణ పశుపత్నీ సుతాలయా, ఋణక్షయం క్షయం యాంతి, కాతత్రపరివేదనం!" అని పెద్దలన్నారు. నాతుదిక్షణంలో నీ సంపూర్ణ దర్శనం అయింది. చిత్తక్షోభం నశించింది. రామా! రామా! రఘువంశ

సోమా! తారకనామా! లోకాభిరామా! కామకలుషవిరామా! విజితవైరి వార సంగ్రామా! సౌందర్య సీమా! ఆనందధామా! నిన్ను మనసార దర్శిస్తున్న మహానందంలోమాయా మోహిత మైనమట్టిశరీరంవిసర్జిస్తున్నా" అంటూ అర్ధరాత్రివేళ అసువులు వదలాడు.

తూర్పు తెల్లవారింది. లోకంతెల్లవారింది. అయోధ్యతెల్లవారింది. అంతఃపురం తెల్లవారింది. వెసంధిన స్వీయ కర్మాచరణం నిమిత్తం పట్టపుదేవి కౌసల్యప్రాసాదంలో వుదయమంగళ తూర్యనాదాలు మ్రోగించాచు. వందిమాగధులు సుప్రభాతాలతో,స్తుతులతో పాటలు వల్లించారు. పాణివాదకులువచ్చి కరతాళధ్వనులు గావించారు. ఆధ్వనికిపంజరాలల్లో వున్న పక్షులు మేల్కొని కిలకిల రావాలుచేసినై. అనంతరం, వీణా వాదనం, సంగీతం, నృత్యం, విధివిహిత మంగళా శాసనాలు జరిగినై. పరివారం వేడినీటి కడవలతో, మంచిగంధం, పూలూ, జలసేచనార్థం నవరించింది. అంతఃపుర పరిచారికలు, అనులేపనాలూ, దర్పణాలూ, ఆభరణాలూ, అంబరాలూ దాల్చి సిద్ధంగా వున్నారు. పూర్వంవలె రాణి మందిరం సర్వలక్షణ సంపన్నంగా వుంది. తెల్లవారకముందే వచ్చిన దాసదాసీజనం, రాజు ఎంతకూ రాకపోవటంలో తల్లడపడింది. వారిలో వారు గుసగుసలు పోయారు. అందులో కొందరు అతి సన్నిహితలైన కాంతలు రాజశయన మందిరంచేరి తలుపులుత్రోసి లోనికి ప్రవేశించారు. దీర్ఘనిద్రలో మంచంపై పడివున్న మహారాజును చూశారు. కదలికగాని, మెదలికగాని కానరాకపోవటం వారిని కలతపెట్టింది. మెల్లగాఒంటిపై చేయివేశారు. చల్లగావుంది. వేసినవైపు చేయివేసినట్లూ, వేసినకాలు వేసినట్టూవున్నై. ఎక్కడ తాకినా వేడి ఏ మాత్రం కనుబడలేదు. నాసిక వద్ద వ్రేలుంచితే శ్వాస తగలలేదు. గుండెలమీద చెయిపెట్టితే కొట్టు కోటంలేదు. వాళ్ళకు అనుమానం కలిగింది. ప్రహరంగా పరిశీలించారు. ప్రవాహంవేగంలోవున్నగడ్డిపరకలాగా,వాళ్ళప్రాణాలుకొట్టుకొంటున్నై.

## అంతఃపురకాంతలు అవనీశుని మృతికై విలపించుట

ఒక వృద్ధ స్త్రీ, కౌసల్యకు అంతరంగికురాలు మేను వణకు తుండగా ఆమె వున్నచోటికి పోయింది. శవప్రాయలుగాచేలచెరంగులపై

పడివున్న కౌసల్యను, సుమిత్రనూ చూసింది. కళాహీనంగావున్న మొగాలూ, తిమిరావృతమైన నక్షత్రాలవంటి కన్నుల్లో, దీపంలేనిగృహం వలె తేజో విహీనలై, వున్నదో లేదో తెలియని ఉసురుతో, నిద్రో మూర్ఛో ఎరుగరాని స్థితిలో వున్న వారినిచూసి మీది ప్రాణం మీదనే పోయింది. ఇటు రాజు మృతీ, అటు రాణుల దయనీయస్థితీ ఆ వృద్ధ కాంతను వేదనపాలుచేసినయి. పాపం, ఆ వృద్ధ పూర్వానుభవాలతో పండిపోయింది కనుక ధైర్యం తెచ్చుకుని వారిద్దరినీలేపి, రాజు స్థితి క్లుప్తంగా చెప్పింది. వెంటనే అక్కా చెల్లెలూ పరుగునవచ్చి పడివున్న భర్తను గాంచి మరణించినట్లుగా మనసులో దృఢపరచుకుని మాటరాక మొదలు నరికిన కదళీతరువుల్లాగా పుడమిపై పడిపోయారు. ఆ దృశ్యం చూస్తున్న పరిచారికలు పెద్దపెట్టున ఏడ్వసాగించారు.

ఆవార్త అంతఃపురంలో ఆకుటీర్ళపై పడిన అగ్నిలాగా క్షణంలో వ్యాపించింది. ప్రాణాలు చిక్కబట్టుకుని ప్రాణేశ్వర దర్శనార్థం భార్యలంతా చేరారు. కైకేయికూడ కాలుతున్నగుండెలో కాలినడకనువచ్చింది. మరణించిన భర్తనూ, మరణావస్థలో వున్న సపత్నులిద్దరినీ చూచి, ఒక్కపెట్టున రోదాంతరాళం ప్రతిధ్వనించేలాగా రోదిస్తూ దివంనుంచి తెగిపడ్డ చుక్కల్లాగా కులకాంతలందరూ నేలకూలి పడ్డారు. అంతలో రాజబంధువులంతా మూగారు. చేతులుపట్టుకునికొందరూ,కౌగలించుకుని కొందరూ అయినవాళ్ళతో చెప్పుకుని ఆక్రందిస్తున్నారు. కైక కంఠస్వరాన్నివిని కౌసల్య దండితాడిత దందశూకం (పాము)వలె తెలివితెచ్చుకుని "దుర్మార్గురాలా! ఇప్పుడు ఏడ్వడానికి వచ్చావా? ఇక నీ పుల్లం చల్లగా, అకంటకంగా సర్వరాజ్యాన్ని కైవసంచేసుకో. నామమాత్రంగా అడ్డంవున్న అధిపతికూడా అస్తమించాడు. వారసుడు వనాలపాలైనాడు. నీకోరిక నిర్విఘ్నంగా నెరవేరింది. తస్కరమృగ భయ సహితమైన అడవిలో ఒంటరి స్త్రీ ప్రయాణంవలె, పతిసుతుల పోగొట్టుకుని ఇక్కడ బ్రతకటం నాకు సాధ్యమా? తన పాలిట దైవమైన దయితుని మరణానంతరం కులకాంత ఎవతె బ్రతుకుపై భ్రాంతి పడుతుంది? నీవొక్కదానవు గాక. పిసినిగొట్టుపీనుగు లక్షలు గడించి, పొట్టకు తినక, పరులకు పెట్టక వ్యర్థపదార్థంతింటూ, ద్రవ్యం చూసుకుంటూ, వెంట

కొనిపోయే దారిలేక లోలోపల దిగులుతో క్రుంగి కృశించి చచ్చిన రీతిగా, నాగలివైకూడ మంధర తృప్తికై మగనినిచంపుకుని, కొడుకుతో, లోకంలో "ఛీఛీ" అని అనిపించుకుని, రాజ్యం చూచుకుంటూ, అవసాన సమయంలో అది వెంటరాక ఆక్రోశిస్తావు.

భార్యచెప్పిన పాపపుమాటలపై పతి కన్నబిడ్డను కానలపాలుచేసి, దురంత దుఃఖంలో మరణించాడన్న వార్త తెలిస్తే నా తల్లిదండ్రులెంత కుమిలిపోతారో, ఇక్కడ కథవునిచావుతో విధవనై, దిక్కులేని దీనురాలనై పొక్కుతుంటే,అక్కడదూరంగా,అడవుల్లోవున్ననాకన్నయ్యకు తెలియదుకదా? ఆదరించేవారులేక, అడవిలో, క్రూరమృగరావభీతయైన సీత అష్టకష్టాలు ఎలా అనుభవిస్తున్నదో. అగ్రజునిపైగల ఆసక్తితో భార్యను వదలి భయంకరాటవికిపోయిన సౌమిత్రి, వారిసేవలచేస్తూ ఏ విధంగాకాలం వెళ్ళదీస్తున్నాడో. అల్పపుత్రకుడు (సంతానంలేనివాడు) వలె, ఆత్మజులు నలుగురున్నా లేనివాడై, వృద్ధుడై, తలకొరివిపెట్టే దిక్కులేక భర్త మరణించాడు. సతీసువ్రతమైన సహగమనంచేసి, ఆయనపోయే లోకానికి పోతాను." అంటూ కౌసల్య హృదయవిదారకంగా ఏడుస్తుండగా, రాజ్యతంత్రజ్ఞులు రభసగమనంతో వచ్చారు. వచ్చినవెంటనే ఆమెను పూరార్చి, అవనీపతి శరీరం భద్రంగా నూనె కటాహంలోచేర్చి, అనంతరం చేయదగినవన్నీ పూర్తిచేశారు.

దహనసంస్కారం జరిగించటానికి తనయులు లేకపోవటంతో ధర్మవిదులు దశరథకళేబరం తైలద్రోణంలో భద్రంచేసి ఆప్రాసాదంలో మూలగావుంచినపిమ్మట, ''సత్యసంధుడూ, ప్రియవాదీ, గుణవంతుడూ అయిన రామయ్యను ఎడబాసి ఏడుస్తుండగా,నీవుకూడా మమ్మల్నువదలి పోయావా? తల్లి బిడ్డలకు దూరంచేసింది. పతిప్రాణాలు బలిగొన్నది. విభుణ్ణిపోగొట్టుకునివిధవలమై, చెనటి కైకమ్మకుసేవచేస్తూజీవించలేము. రాముణ్ని రాజ్యశ్రీకి తొలగించి, వీరాధివీరుడైన లక్ష్మణుని విడిచిపెట్టి, ముగ్ధఅయిన ముద్దుకోడలు సీతను దూరంచేసి, చివరకు జీవితేశుణ్ణే చితికెక్కించిన కైకమ్మ ఏమైనాచేస్తుంది. ఎంతకైనాతెగిస్తుంది. విధాతమా నొసళ్ళపై ఏమివ్రాశాడో. మా బ్రతుకులు ఎలా నడుస్తాయో. బ్రతికి ప్రామికొనేదేముంది? అందరం ఆత్మేశ్వరుని చితిలోబడి ఆత్మార్పరణ

చేద్దాం" అంటూ అంతఃపురస్త్రీలు ఆవేదనపొందుతున్నారు. రాముని వియోగంతోనే రామణీయకం కోల్పోయిన అయోధ్యానగరం మహారాజ మరణంతో, పతిలేని సతివలె, చంద్రుడులేని రాత్రివలె, పూలులేని లతలవలె తేజోవిహీనమై పోయింది. అలుకులూ, ముగ్గులూలేని గృహాలలో, అంతఃపురకాంతలహాహారవాలలో, ప్రాణావశిష్టులుగావున్నపౌరులలో, క్రొత్తవారికి గుర్తింపరాకుండా పరివర్తనం పొందింది.

మహారాజుపుత్రశోకంతోమరణించాడు. భర్తమరణంతోభార్యలు ఆర్తిలో అవనిపై వాలారు. రవి అస్తగిరి చేరాడు. చీకట్లు చేరాయి. ఎందరున్నా వుండవలసిన కొడుకులలో ఒక్కడుకూడా లేనందున,ధరణీపతి శవదహనం జరగలేదు.బుద్ధిమంతులు కింకర్తవ్యతా మూఢులైనారు. ఆ రాత్రి గడవటం అందరికీ దుర్భరమైంది. సూర్యోదయంకోసం చూచి చూచి కళ్ళు కాయలు కాసినాయి.వచ్చినవారంతా పలవోస్తుంటే,ఓదార్చే దిక్కులేక ఉక్కిరి బిక్కిరి అవుతున్నారు. ఏట్టకేలకు భానూదయం అయింది. రాజకర్తలూ, ద్విజరాజులైన గౌతమ, మౌద్గల్య,కాత్యాయన, మార్కండేయ, జాబాలి, కాశ్యప,వామదేవాదులు,వసిష్ఠమహర్షిఆధ్వర్యములో సభచేసి, మంత్రులనూ, సేనాపతులనూ, పౌరముఖ్యులనూ రావించారు.

## అరాజకత్వ దోష వర్ణనం

"గడచిన రాత్రి కాళరాత్రిగా మహారాజు ప్రాణాలు హరించింది. మనం వుండికూడా ఏమీ చేయలేకపోయాం. ఇప్పుడు కర్తవ్యం ఏమిటి? చనిపోయిన రాజేంద్రునకు శ్రాద్ధకర్మ జరిపించుటకు రామలక్ష్మణులు అడవిలో వున్నారు. భరత శత్రుఘ్నులు మాతులగృహంలో వున్నారు. ముందు కర్మాధికారిని నిర్ణయించి, మీదట రాజ్యాధిపతినినిర్ణయించవలసి వుంది. రాముడు గడువు గడిచేవరకు అయోధ్యకురాడు. అన్ననేఅనుసరిస్తాడు లక్ష్మణుడు. మిగిలింది భరత శత్రుఘ్నులు.వంశగురుడవేకాక, రాజగురుడవు. మంత్రులలో ముఖ్యుడవు. ఆలోచించి మాకు ఆదేశం ఇవ్వండి. రాజ్యం అరాజకం కారాదు, అరాజకమే ప్రాప్తించితే—

మేఘాలు, పురుములతో, మెరుపులతో సకాలంలో సంపూర్ణంగా వర్షించవు.

కాలెలకు అనుగుణంగా కాపుజనులు విత్తులునాటి, సస్యాలను పెంచి, ప్రాణికోటి సంతృప్తికొరకై పాటుపడే అవకాశం వుండదు.

మనోహరాలైన వుద్యానాలూ, ప్రశస్త పుణ్యాగారాలుకనుపించవు. పౌరులు పరస్పరం శుభావహమైన కార్యాలు నిర్వర్తించరు.

యజమాని కనువర్తులుగా పెళ్ళాంబిడ్డలు నడువరు. రాజముద్రిక గల ద్రవ్యం సమాజంలో సంచరించక క్రయవిక్రయాలు జరుగవు.

బ్రాహ్మణులు విత్తంలేక, పదార్థాలు లేక, సవనాలుసలిపే ప్రయత్నం సలుపరు. తస్కరభయంతో ధనవంతులు దానంచేయరు.

వర్తక నటనటీ నాయక రహితమై, రాష్ట్రసమృద్ధి తరిగి, వుత్సవ యాత్రా సంచారాలు వుడిగిపోతై.

వ్యాపారులు వ్యాపారం చేయరు, తగవరులైన అధికారులు తీర్పులలో లంచాలకు ఆశిస్తారు.

అలంకార ప్రియులైన అంగనలు అలంకారాలపై ఆసక్తిచూపరు. పురుషులు కర్మ భ్రష్టులై, స్వేచ్ఛాచారులై చెడిపోతారు.

సతీపతులు సుఖాభిలాషులై కేళీవనాల్లో సాయం వాహ్యాళి నిమిత్తంపోరు. తల్లులు కూతుళ్ళకూ, అత్తలు కోడళ్ళకూ ముచ్చటలు జరుపరు. ద్వారాలు తెరిచి నిద్రించే గృహస్థులు చోరభయంతో తలుపులు మూసుకుంటారు. విలువగల హేమరత్నాల సంచయంతో యాతాయాత జనం ఘంటా పథాలల్లో సహితం ప్రయాణం చేయటానికి భయపడతారు. క్షత్రియ కుమారులు గణవిద్యాభ్యాసంలో చేసే మౌర్వీటంకారనాదం వినపడదు. వీరులచిత్తాలు వికలమై పోతవి.

దేశాంతర వ్యాపారార్థం వెడలిన వణిక్కులు సంపదలతో స్వరాష్ట్రానికి తిరిగిరారు. సంయములు ఒంటరిగాపోరు. పాంథులు సూర్యాస్తమయం కాగానే దారిలోని గ్రామాలల్లో పండుకొనుటకు ఇష్టపడరు. ఆ చోట్లలో అన్నంపెట్టే దాతలు కరువు కావటంచేత ప్రయాణాలు అందుచే ఆగిపోతై. పుణ్యం, పురుషార్థం, యోగం, క్షేమం, రూపరహితం అవుతవి. పరరాజులు దాడిచేసిముందుగా సైన్యాన్ని సంహరిస్తారు. ప్రజలు

ఆనందంతో తిరుగరు. మహర్షులూ, వేదవిదులూ, శాస్త్రపారంగతులూ సభలుచేసి, విశ్వశ్రేయః కారణమైన విషయాలు నిర్ణయించటానికి వాదోపవాదాలు చేయరు.

అత్యాహితమైన అరాజకదోషం అయోధ్యావాసుల అలమకుండా కాపాడండి. సత్యసౌచాల సంరక్షణం జనపతిలేక జరుగదు. రాజులేని రాజ్యం నీళ్ళులేని నూయి. గడ్డిలేనిబీడు. గోపాలుడులేని గోవు. రథానికి కేతనం, అగ్నికి పొగా చిహ్నాలైనట్లు, రాష్ట్రానికి రాజు చిహ్నం. రాజ శాసనం లేకపోతే ఏది ఎవరిసొత్తో, ఎవరెంతవరకు ప్రవర్తించాలో, ఏది ధర్మమో, ఏది అధర్మమో, తెలియక మానవులు చేపలవలె స్వజాతినే మ్రింగుతారు. రాజున్నప్పుడు అణగిపోయిన అవినీతిపరులు, రాజు లేక పోతే జంకుగొంకు లేకుండా సాటివారిని సర్వనాశనం చేస్తారు. దేహికి నేత్రాలవలె ప్రజలకు ప్రభువు ముఖ్యం. ప్రజలు ఈతి బాధలు లేక సుఖసంతోషాలలో కలకాలం గడపవలెనంటే అవనీపతి అవసరం.రాజు ధర్మకర్మ నిష్ఠితుడైతే, అష్ట దిక్పాలకులుగానీ ఆ త్రిమూర్తులే కానీ, అతని పరిపాలిత జనాన్ని ఆవంతగూడ బాధించలేరు. మనుజపతి, మానవులలో మంచివారనీ చెడ్డవారనీ విభజించకపోతే, బలవంతులు బలహీనులనూ, గుణవంతులు గుణహీనులనూ, విద్యానిధులు విద్యా హీనులనూ పెద్దలు చిన్నలనూ విచక్షణారహితంగా స్వార్థం వినియో గించుకొనుటకు హింసించరా? చంద్రుడులేని రాత్రివలె, విశాల విశ్వం అజ్ఞానంలో, అహంకారంలో మునిగి అంతరించిపోదా? ప్రభువు బ్రతికి యున్నప్పుడే నీ ఆజ్ఞమీరము. ఇప్పుడు ఇక చెప్పటందేనికి? సాగరంవేల అతిక్రమించనట్లు మీ మాటను మేము అతిక్రమించం. రాజపుత్రులలో ఎవరినో ఒకరిని ప్రభువుగా నిర్ణయించండి" అని మహాసభ పక్షాన వామదేవుడు వసిష్ఠ మహర్షిని ప్రార్థించాడు. ఆయన మాటలకు అందరూ సమ్మతి తెలిపారు.

## మంత్రుల దూతలుగా మహర్షి భరతునివద్దకు పంపుట

వామదేవుడు ఆసీనుడు కాగానే, వసిష్ఠుడు తీవ్రంగా ఆలోచించి,

సభ వంక తిలకించి "పూజ్యులారా! నాపై మోయరాని బరువు మోపారు. ఏ కార్యం చేయాలన్నా, శవదహనం కాకుండానే చేయుట క్షేమంకాదు. రామలక్ష్మణులు పినతల్లికై కైక విధించిన సమయంముగియక ముందురారు. ఇకవున్నవారిలో భరతుడే పెద్ద. ఆతడేపితృకార్యం చేయటానికిఅర్హుడు. కాబట్టి రాజగృహంలో సుఖంగావున్న భరతుని ముందు తీసుకునిరావలసి వుంది. అందుకు మంత్రులే సమర్థులు. సిద్ధార్థ విజయులూ, జయంతా శోకులూ, నందనామాత్యుడూ కలసి దూతలుగా వ్యవహరించాలి. చేయ వలసినకర్తవ్యంచెపుతావినండి. జవనాశ్వాలపైనత్వరంగారాజగృహానికి చేరాలి.రాజమందిరంలో శోకంలేకుండాప్రవేశించాలి. భరతుడురాగానే, బహుమతులు సమర్పించి ముక్తసరిగా మూడు మాటలలో ముగించాలి. "గురువులూ, మంత్రి శ్రేష్ఠులూ అయిన వసిష్ఠుడు నీ క్షేమం తెలుసుకొని నిన్ను త్వరగా రావలసిం"దని నాయాజ్ఞగా చెప్పాలి. వివరం అడిగితే, "ముఖ్యమైన కార్యం వుంది. ముహూర్తకాలంకూడా జాగుచేయకుండా రమ్మన్నారు. సమక్షంలో అన్ని సంగతులు వారేచెపుతామన్నారు" అని మాత్రం చెప్పండి. అతనికి ఎక్కడా అనుమానం రాకుండా చూడండి. అందుకేమహామంత్రాంగవేదులైనమంత్రి పుంగవులసామాన్యదూతలుగా పంపుతున్నాను. అన్యథా భావించరని ఆశిస్తున్నాను." అని కర్తవ్య నిర్ణయం కావించాడు. అప్పటికి అపరాహ్ణంకావస్తున్నది. అందరూ కార్య తత్పరులై గృహోన్ముఖులైనారు. ద్విజశ్రేష్ఠులు, వసిష్ఠులవారు నిర్ణ యించిన పద్ధతియుక్తంగా, వుచితంగా, గంభీరంగావుందనిశ్లాఘించారు.

మహర్షి ఆజ్ఞానుసారం మంత్రులు మందిరాలుచేరి, ప్రయాణ సంభారాలుభద్రంచేయించి, వుత్తమతురంగారూఢులైవచ్చి వశిష్టులవారి అనుమతిపొంది ప్రయాణంసాగించారు. ''అపరతాలం'' అనేపర్వతానికి పడమరదిశగా పయనించి, ''ప్రలంబాద్రి''కి వుత్తరంగా కొంతదూరం పోయి, రెండునగాలమధ్య మహావేగంతోపారే ''మాలినీ''నదిఒడ్డుననుస రించి చని,హస్తినాపురంచేరి,అక్కడగంగానదిదాటి,పిమ్మట పడమరగా ప్రయాణంచేసి, జాంగల(మెరక)భూములగుండాపోయి,పాంచాలనగరం చేరారు. ఆ పట్టణసౌభాగ్యాన్ని, ఆ సుందరవనాల, సరోవరాల రామ ణీయకంగాదర్శిస్తూ ముందుకుపోయి, సంతతజనాకులమైన ''శరదండ''

అనే తటినిదాటి దానికిపశ్చిమంగావున్న ''సత్యోపయాచన'' అనేనామం గల షృక్షాన్ని చుట్టి,''కుళింగపురం''చేరి''అభికాళ'' గ్రామాన్ని అధిగమించి, సమీపంగావున్న ''బోధీభవనం'' అనే భూధరాన్ని చేరుకుని, అజమహారాజానుభవపూర్వమైన ''ఇక్షుమతి'' వాహినికాంచి, అశ్వావతరణంచేసి, అందలి పరమపావనోదకం పానంచేసి, అక్కడవున్న తాపసులను సందర్శించి పిమ్మట ''బాహ్లిక'' దేశమధ్యంగాపోయి, ఆ తర్వాత ''సుదామ'' ''విష్ణుపదం'' అనే పర్వతాల వీక్షించి, ''విపాశ'' ''శాల్మలీ'' తరువులనూ, మనోజ్ఞంగావున్న వాపీకూపనదీపల్వల క్రమ తటాకాదుల కనుగొని, మృగద్వీపమృగేంద్ర శార్దూలాది భీకరసత్వాల దృష్టించి,పోయిపోయి, కొంతకాలం విశ్రాంతిచెంది, మరలప్రయాణించి ''గిరివ్రజ''పురం సమీపించి అక్కడ ఆగి, ఆ నగరప్రభువునకూ,భర్తృ వంశప్రతిష్టకూ, అభ్యుదయ పరంపరాభివృద్ధిగా, మంచిముహూర్తంలో రాత్రికొంతగడువగా ప్రవేశించి యోగ్యప్రదేశంలో ఆ రేయిగడిపారు.

## భరతుడు దుస్స్వప్నంగాంచి పలవించుట

బుద్ధిమంతులైన మంత్రులు శుభచింతామానసులై పురిప్రవేశించిన నాటిరాత్రిసుఖశయనంలో వున్నప్పుడు భరతుడు, గోడుకుడిపేపీడలతో నిండిన పాదుకలగాంచి, అదరిపడిలేచి,అటుఇటుచూచి, ఆందోళనతగ్గక పెచ్చు పెరుగుతుంటే, సంబాళించుకుని మళ్ళీ శయనించాడు. చలుకుతో చరిచినట్లుకాగా, గుండెలు కొట్టుకోగా, తిరిగి లేచికూర్చునికళ్ళునులుము కొని నలుమూలలు చూశాడు. బయట ఏమీ కనుపించలేదు. కడుపులో నుంచి తాటాకుమంటవలె ఏదో తెలియరాని వేదన వెలికివస్తూంది. ఎంత యత్నించినా శమించటంలేదు. ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందన్న కలవర పాటులో కడమరాత్రి గడిపాడు. ప్రభాతమైందికాని, భరతునితో ప్రమోదం ప్రవేశించలేదు. కాలకృత్యాలన్నీ మరిచాడు. మంచంపై కూర్చుండి రాత్రివచ్చిన దుస్స్వప్నాన్నిగూర్చి మరీమరీ ఆలోచించ సాగాడు. ''ఎన్నడూఎరుగని ఇంత భయకారణమైన కల నాకెందుకు వచ్చింది? అయోధ్యలోనాతండ్రి క్షేమంగాలేడా? తల్లులకేమైనాప్రమాదం దాపురించిందా?అన్నలకేదైనాఆర్తికలిగిందా?అటువంటి అల్పవిషయాలు

అయోధ్యా పౌరజనానికే ప్రాప్తించవు. నా తల్లిదండ్రులకూ,అన్నలకూ ఏవిధంగా ప్రాప్తిస్తె? తెలియక ముందుగా అశుభాన్ని చింతించటం తప్పు. ఏమైనా బహుకాలం అయింది అక్కడి క్షేమోదంతం తెలియ వచ్చి. వెంటనే వార్తాహరుల పంపటమో, స్వయంగా మేముపోవటమో జరగాలి" అని అనుకుంటుండగా, ఆప్తమిత్రులంతా బిలబిలలాడుతూ వచ్చి, అతనిస్థితి చూచి ఆశ్చర్యచకితులైనారు.

కొందరు సరసాలాడారు.మరికొందరు ఎత్తిపొడుపుమాటలన్నారు. ఇంకాకొందరు ఏవేవో వికృతపుచేష్టలు చేశారు కాని భరతుడు వులకడు, పలకడు. ఆప్తులను ఆహ్వానించడు. ఆదరించడు. దీనవదనంతో నేల చూస్తూ, ఏమోతలపోస్తూ, వ్యక్తంకాని బాధ అనుభవిస్తున్నాడు. అత డున్న వునికి అందరికీ భయకారణం, సంశయకారణంకూడా అయింది. సాహసంచేసి ఒక సఖుడు సన్నిధిచేరి "హితుడా! ఇందరు మిత్రులువచ్చి నీతో వినోదించకోరుతుండగా, వుదాసీనంగా ఎందుకు వూరకున్నావు? ఈమౌనవ్రతం ఎందుకుపూనావు ? మామై నిర్హేతుకంగా ఆగ్రహం ఎందుకువచ్చింది? శయనసమయంవరకు ఎంతో సంతోషంగావుండి విడి పోయిన మావల్ల ఇంతలో ఏమితప్పువాటిల్లింది? నీకు మాత్రం తెల్లవాడు లోపల మనస్సు ఎందుకుమారింది? తలలోనాల్కలవలె కలసిమెలసి, అరమరలేకుండా కాలం గడుపుతున్నాంకదా ? మమ్మల్ని ఈవిధంగా వ్యాకులపెట్టటం నీకు ఏమిధర్మం?" అని బ్రతిమాలగా, భరతుడు తేరు కుని,"మిత్రులారా! మీమీద నాకెంతమాత్రం భేదభావంలేదు. పైగా మీరు లేకుంటే నాకు కాలమేగడువదు. ఈనాదీనదశకు కారణంచెపుతావినండి. రాత్రి మూడోజాము ముగిసేసమయంలో పెద్దపీడకలవచ్చింది. అందులో కనుపించిన పీడంతా ఆత్మీయమైంది. అప్పటినుంచీ ఎంతో ఆందోళనగా వుంది. ఎంత ప్రయత్నించినా నయమం కలగటంలేదు. అంతర్లోకం కల్లోలితం కావటంతో బాహ్యలోకమంతా భ్రష్టంగాకనుపిస్తూంది. అంతే కాని మీమీద నాకుకోపం ఏమిటి? అంతా ఆ పవర్గమేకదా!" అనిచెపుతూ నిట్టూర్చాడు. అదివిన్న మిత్రులంతా ఆకలఎట్టిదోనని ఆతురతచెందుతూ ఆసక్తిదాయకంగా వున్నందున వివరంగా చెప్పమని వేడుకున్నారు. సహచరులవంకచూస్తూ, హీనస్వరంతో "హితులారా! ఏమనిచెప్పేది ?

నాతండ్రి మలినదేహుడై, విడిపోయిన జుట్టుతో, పెద్ద కొండపైనుండి పేడనుడుగులోపడి, అందులో కప్పగంతులు వేస్తూ, నవ్వుకుంటూ, దోసిలి నిండా నూనెపోసుకుని త్రాగుతూ, ఒడలంతా పూసుకుంటూ, నువ్వులు తింటూ, తానా తైలకుండికలో మునుగుతున్నట్లుగా కనుపించాడు. జలధులలో నీళ్ళులేవు. చంద్రుడు ఆకసంనుండి నేలపైపడ్డాడు. లోకమంతా చీకటిమయమైంది. పట్టపేనుగుదంతం భగ్నమైంది. అగ్ని చల్లారిపోయింది. భూమి బ్రద్దలుగా పగిలింది. చెట్లు ఎండి మోడులైనై. అంతటా పొగలాగా కావిరిక్రమ్మింది. పర్వతాలుమంచులో క్రమ్మబడినై. నల్లని ఇనుపపీఠంపై నల్లని వికృతమైన బొమ్మవుంది. ఆ బొమ్మకు నల్లని వస్త్రాలు చుట్టబడినై. కొంతసేపటి కా బొమ్మ నా తండ్రిలాగా మారింది. కృష్ణ, పింగళ అనే అంగనలు నా తండ్రిని చూసి నవ్వుతున్నారు. ఎర్రని పూలుధరించి, గాడిదలుకూర్చబడిన బండిపై యమదిశగాపోతున్నాడు. రక్తంపూసుకుని, రక్తంత్రాగుతూవున్న పెనుభూతం నాతండ్రిని పరిహాసంచేస్తూంది. వికృతమైన మొగంలో, విడివడినదట్టపు వెంట్రుకలలో, కర్కశమైన కోరలతోవున్న రాక్షసి ఒకర్తు, నాపితృదేవుని ఇబ్బపట్టుకుని బలవంతంగాలాగుతూంది. ఈ విధంగా భయంకర దుస్స్వప్నం వచ్చింది. ఈ పీడకలవల్ల నా తండ్రికో, నా అన్నలకో, నాకో చావుతప్పదు. ఎవరు గాడిదలుపూన్చిన వాహనంపై పోయినట్లు కలలో కనుపిస్తాడో, అచిరకాలంలో అతని చితిమంటల ధూమం అంబరానికి ఎగుస్తుంది. ఈ దుస్స్వప్న పరిణామం ఎలావుంటుందో, ఏమి వింటానో తెలియదు. రాత్రినుండి మాటలు తడబడుతున్నై. గొంతు ఎండిపోతూంది. మనస్సు సుళ్ళుతిరుగుతూంది. ఎందుకో నాస్వరం జీరపోతూంది. శరీరకాంతి మాస్తూంది. గుండె విపరీతంగా కొట్టుకుంటూంది. మునుపెన్నడూ ఇట్టిదోషజుష్టమైన దుస్స్వప్నాలురాలేదు. ఇదే మొదటిసారి. ఆలోచించినకొద్దీ ఈ కల సద్యఃఫలితంగా కనుపిస్తూంది.

"కలలు కల్లలుగాక నిజమవుతవా?" అని అనుకుంటే, చిత్తవిభ్రమంకలవారికీ, దుర్వ్యసనాలుకలవారికీ, దురాలోచనలుకలవారికీవస్తే అవి నిజంగా జరగవు. సాధుచింతనులకూ, సంతోషస్వాంతులకూ, సమ్యగ్దర్శనులకూ, సంయములకూ, సత్యాన్వేషులకూ, శాంతప్రియులకూ

అసలు కలలేరావు. వస్తే అవి భావిఫలసూచకంగా వస్తై. అవి తప్పక జరుగుతై. అందులోనాల్గవయామంలోవస్తేఎటువంటి వాడికైనా దినాల్లలో ఆఫలితం అనుభవానికి వస్తుంది. నన్ను నేను ఎరుంగుదును కదా? కేవలం కలగాంచినందుకైతే ఇంత మనఃక్షోభంఎన్నటికికలుగదు. ఏదో జరిగివుంటుంది. అది తెలియని మనసు ఆరాటపడుతూంది. అంతే కాని వేరేమీ కారణంలే"దని చెప్పి ముగించాడు.

## రాజదూతలు భరతునితో భాషించుట

గిరివ్రజం చేరిన మంత్రులు సూర్యోదయాత్పూర్వం మేల్కొని, కార్యకరణీయాలు ముగించుకుని, రాజదర్శనార్థమైన వుడుపులుధరించి, కానుకలు గైకొని,ఒకరినొకరు హెచ్చరించుకుని, మితభాషులై,కల్లోలం లేని కల్లోలినివలె వాహనారూఢులై, కోటసింహద్వారంచేరి,వారిరాకను ప్రతీహారులతో తెలియచెప్పించి అనుజ్ఞాతులై రాజసభా ప్రవేశంచేశారు. వారిని ముందుగానే ఎదుర్కొని,రాజమర్యాదలతోకొనివచ్చిఆసనాసీనుల కావించిన కేకయాధిపతికి ప్రణమిల్లి తాము తెచ్చిన పసదనములు సమర్పించి, కుశలమడిగి కూర్చున్నమంత్రులనుయథోచితంగాగౌరవించి రాజు "మహామంత్రులు దూరంనుండి దూతలుగావచ్చారంటే ఏదో అత్యవసరమూ, అతి నిగూఢమూఅయిన కారణంవుండి తీరుతుంది. విచ్చేసిన పని విశదపరిస్తే సంతోషిస్తాం" అని కోరగా, "ప్రభూః తమ అల్లుని కొరకై వచ్చాము. పిలిపించవలసిందని మనవి చేస్తున్నాం"అని మంత్రులన్నారు. వెంటనే భరతుని సభకు పిలిపించాడు.సమయానికిసభలోలేక పోవటం, తేజుమాసి వుండటంచూసి, ఎంతో ప్రసన్నంగా,వుత్సాహంగా భరతునకు ఆశీరభినందనలు అమాత్యులు అందించారు.

"చిరంజీవి దాశరథీః అందరూ ముందుగా నీక్షేమాన్నిఅడిగారు. తామంతా కుశలమని చెప్పమన్నారు. ముఖ్యంగా గురువులైన వశిష్ఠ మహర్షులవారు "సుశ్రీసంప్రాప్తిరస్తు" అని దీవిస్తూ, "అత్యయికమైన కార్యం నీవు చేయవలసింది వున్నందున, ఈకానుకలు గ్రహించి, వేరు మాట చెప్పక వీరివెంట త్వరితంగా రాష్ట్రానికి రావలసింది" అని ఆదేశించారు" అంటూ బహుమతులు సమర్పించారు. "ఇరవైకోట్ల విత్తం

తాతగారికీ, పదికోట్ల బంగరు నాణేలు మీ మేనమామగారికీ పంపాం. ఆ విధంగా వారిని తృప్తిపరచి రావలసింది'' అన్నలేఖను ఆ ఉపహారాల మధ్య చూసి, గురువుల వుదారతను కొనియాడి, భరతుడు తాతగారికీ, మేనమామకు అవి సమర్పించి, ఆతురతతో దూతలను ప్రశ్నాపరంపరలో ముంచసాగాడు. "అయోధ్యాపతుల యశోహేమహర్మ్యానికి మూలస్థంభాలైన అమాత్యశ్రేష్ఠులకు అభివాదాలు. మా తండ్రి దశరథ మహారాజు కుశలంగావున్నాడా? ప్రజాహృదయ సంతోషసాగరసోముడైన నాఅన్న రాముడు సుఖియే కదా? భ్రూవిక్షేపమాత్ర కంపిత చతుర్దశభువనుడు లక్ష్మణుడు క్షేమంగా, అన్న పరిచర్యలో ఆనందిస్తున్నాడా? అగరా నాగతజ్ఞుడు, బ్రహ్మర్షిఐన వశిష్ఠ మహర్షులవారు అయోధ్యావాసులపై అమృతవీక్షణముల వర్షిస్తున్నారా? ధర్మదేవత, సత్యమూర్తి,క్షమారూప శాంతస్వరూపిణి, నాపెద్దమ్మ కౌసల్యాదేవి భద్రంగాపతిభావనలోపండు తున్నదా?అన్నివిధాలా పెద్దమ్మను మరపించేరెండోపెద్దమ్మసుమిత్రమ్మ అక్కను అనుసరిస్తూందా? అనర్ఘరత్నం, జ్ఞానభాస్కరం, పతిరూపం నావదినె అయోధ్యకు అలంకారం ప్రసాదిస్తూందా? కన్నతల్లి కైకమ్మ నాకోసం బెంగపడదుకానీ, ఆరోగ్యంగావుందా?" అని.

అమాత్యులన్ని ప్రశ్నలకూ "అంతా క్షేమం" అన్నమాటలోసమాధానం ముగించి, "ప్రయాణానికి త్వరపడండి" అని హెచ్చరించారు. భరతుడు, మాతామహునితో "తాతా! విన్నావుగదా, నేవెళ్ళివస్తా. మీరు ఎప్పుడురమ్మంటే మళ్ళీవచ్చి మిమ్ముల దర్శిస్తాను. అనుజ్ఞ ప్రసాదించండి." అని కోరాడు. వృద్ధరాజు, మనుమని ఆలింగనం చేసుకుని, నాయనా! అందరిక్షేమం అడిగామనిచెప్పు. మేం పంపే కానుకలు వేరు వేరుగా వారికిఅభివాదపురస్సరంగాఅందించు. నీకులోడుగాఅశ్వపతినీ, అమాత్యులనూ పంపుతున్నాను. చేరిన వెంటనేక్షేమ సమాచారం మాకు చేరేట్లుగా చూడు. పోయిరా." అని సెలవిచ్చాడు. యుధాజిత్తు, తన అల్లునికి ప్రేమపూర్వకంగా,ఐంద్రశిరాలూ, ఏనుగులూ,ఖరాలూ,వుక్కు ముక్కల్లాంటి కుక్కలూ, వస్త్రాభరణాలూ ఇచ్చి సాగనంపాడు.

అన్ని సత్కారాలు గ్రహించినా, ఆత్మీయులు ఆశ్లేషించి, ఆనందంతో వెంటవస్తున్నా భరతుని హృదయంమాత్రం ప్రఫుల్లం

కాలేదు. రాత్రి వచ్చిన పీడకలలకు, మంత్రులు పెడుతున్న తొందరకు, తెల్లవారేసరికి వారి రాకకు, ఏదో అవినాభావ సంబంధం వుండి వుంటుందని భావిస్తూ భరతుడు బాధతో వీడ్కోలిచ్చి తమ్మునితో రథమెక్కి అయోధ్యకేగే దారిని అనుసరించాడు.

## భరతుడు అయోధ్యకు ప్రయాణించుట

రాజగృహం వదలి తూర్పుగా కొంతదూరంపోయి, "అడ్డదారిని ప్రయాణం" అని అందరికీ హెచ్చరికచేసి, "సుదామా" నదిచేరి, ఆపై అతివిశాలమైన "హ్లాదినీ" ప్రవాహం అవతరించి, పశ్చిమాభిముఖంగా పారుతున్న "శతద్రు" తటిని లంఘించి, "అపరసర్పటాలు" అతిక్రమించి, "శిలావహ" వేణినిదాటి,ఆగ్నేయంగాపోయి,సుందరమందిరాలంకృతమైన "శల్యకర్తనం" కాంచి, "చైత్యరథం" అందానికి ఆనందించి. గంగా సరస్వతీనదులను కనుగొని, "వీరమత్స్యోత్తర" దేశాలను కడిచి, కొండలనడుమనున్నకుళింగం, పిమ్మట యమునాతీరంవరకు ముందుకుపోయి, అక్కడబలాన్నిఆగవలసిందిగాభరతుడుఆజ్ఞాపించాడు.తత్క్షణం విశ్రాంతికివిడుములుకల్పించి, సేదదీరి,గుర్రాలనుకడిగి నీరు పెట్టి,తాము స్నానపానాదులు పూర్తిచేసి, షుత్తుతీరభుజించి, పోయేప్రదేశమంతా జలాభావంకలది కనుక, సరిపడు నీటిని నిల్వజేసుకొని, భరతుని అనుమతితో పరివారం మరల ప్రయాణంసాగించింది. దారిలో ఘోరారణ్యాలురాగా, భరతుడు రథందిగి దంతావళంపై తమ్ముడూ, తానూ ఎక్కి దేవతా విమానవేగంతో వాటినిదాటి "భాగీరథీ"నదీతీరానికి చేరుకున్నాడు. ఆ తీరాన్ని అనుసరించిపోయి, "అంశుధానం" అనేదేశంలో "ప్రాగ్వటం" అనే పట్టణం దరిసి, అక్కడ గంగదాటి ఆపిమ్మట"కుటికోష్టిగా" నదినీ, "ధర్మవర్ధన" పురాన్నీ దర్శించి "తోరణ" నగరానికి దక్షిణంగాపోయి, "జంబూప్రస్థ" పట్టణంచేరి,"వరూథం"అనే గ్రామం చొచ్చి అందున్న వనంలో కొంత శ్రమదీర్చుకుని, తూర్పుగాగమించి, వుజ్జిహానంలోవున్న"ప్రియకారామం"చేరుకున్నాడు. అదిస్వరాష్ట్రంలోని ప్రదేశం. అక్కడ జావతరణంకావించి, జవనాశ్వాలను తేరుకు కట్టి, వెంటవస్తున్నవారందరనూమెల్లగారావలసిందనిచెప్పి,మంత్రులలోకూడి

సత్వరప్రయాణంసాగించి "సర్వతీర్థ"లో ఒకరాత్రిపుచ్చి, "కుటికహస్తి" పృష్ఠభాగంలో"వుత్తాని" కాదిలహరులదాటి, "లోహిత"పట్టణసమీపంలో "కపీవతి" తరియించి, "ఏకసాలం"లో"స్థాణుమతి"నీ,"వినత"పురంలో "గోమతినీ" దాటి, మార్గశ్రమతీర్చుకోవటానికి "కళింగపురంలోని సాల వనం"లో రాత్రిగడపి, అదివదలి అరుణోదయవేళకు ఆత్మపురమైన అయోధ్యను దర్శించారు.

## అయోధ్య దుస్థితికి భరతుడు ఆక్రోశించుట

ఏడురోజులు ఏకధాటిగా ప్రయాణించి పట్టణంచేరిన భరతుడు, మంత్రులవంకచూచి "అమాత్యా! చూడూ. రాజపాలనలోవుండి, యజ్ఞాలతోనూ,శమదమగుణవిశిష్టులైన విప్రవరుల వేదఘోషలతోనూ, సుధారాశిలాగా దూరానికికానుపించే అయోధ్య,ఆవిధంగా గోచరించటం లేదు. నేను రాజగృహానికి పోయేటప్పుడు కలకలమని స్త్రీ పురుషులు పలికేధ్వని ఇప్పుడు వినపడదేం? కేళీవనాల్లో రేయిహాయిగా వేగించి దంపతులు వేకువకాగనే ఇండ్లకు పోయేవారుకదా? ఇప్పుడువారెవ్వరూ కనుపించరేం? నాకు చూడగా అయోధ్య మహాపురంగా గాక, మహా రణ్యంలా కనుపిస్తూంది. ప్రజల రాకపోకలులేవు. వాహనాలతొక్కిడిలేదు. తురగారూఢులై, గజారూఢులై యౌవనులు క్రీడింప రెందుకు? నా దృష్టిదోషమా? ఇది యథార్థమా? మత్తమధుకరశుకపికకలకూజితాలతో చెవులకింపునింపుతూ, ఫలపుష్పభరితమై వంగిన కొమ్మలతో, వానలుచిమ్మే వృక్షజాతి ఎండి మోడులుగావున్నదేం? అకాలంలో ఆకులురాల్చి, దిక్కులేని దీనునిశవంలాగానిల్చిన ఈ మర్రి చెట్టు ఈ నగర దుర్దశకు చిహ్నంగా తోస్తూంది.

వీథుల్లో జనసంచారంలేదు. తోటల్లో పక్షులధ్వనిలేదు. ఇండ్లల్లో, అగురుచందనధూపంలేదు.పరిమళవాయువ్రసారంలేదు. భేరీమృదంగ వేణువీణాచారునినాదాలుకలికానికైనాకనపడవు.పురప్రవేశసమయంలో కనుపించిన శకునాలుకూడా మంచిగాలేవు. పరిపరివిధాలుగాహృదయం పరియలవుతూంది. గురుదేవుడు తొరతొరగా కారణరహితంగారమ్మని కబురెందుకు చేశాడు? సారథీ! ఏదో అశుభమే జరిగివుంటుంది. మహా

రాజ మరణసమయంలో ఏమేమి సంప్రాప్తమవుతవని పెద్దలు చెప్పారో అవి అన్నీ అయోధ్యలో కనపడుతున్నై. ఏ ఇల్లు చూసినా, కసవూడ్చి, కల్లాపులు చల్లి, ముచ్చటగా ముగ్గులుపెట్టి సుగంధ ద్రవ్యాలతో గృహ దేవతల నర్చించి, వంటలు వార్పులుచేసి, బలులువేసి, వుబుసుపోకకు పురాణశ్రవణం చేస్తున్న చిహ్నాలే కనపడ్డంలేదు. గృహస్థుల భవనాలన్నీ అపాస్త శ్రీకాలు (పోయిన సంపదగలవి) అయినై. జనులంతా ప్రభ చెడ్డారు. అంగళ్ళలో క్రయవిక్రయాలే లేవు. నిత్యోత్సవ, వారోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవాలతో, పౌరులకు ప్రత్యక్ష ఫలా లిస్తూ తేజరిల్లే దేవతాయతనాలు (గుళ్ళు) మూసిన తలుపులు తెరిచిన జాడలేదు." అని మాటి మాటికీ సారథితో చెప్పుకుంటూ, శూన్యంగా వున్న శృంగాటకాలు (నాల్గువీధులు కలిసేచోటు) రథాలూ, ప్రాసాద మందిరాలూ, చైత్యాలూ దాటాడు.

## భరతుడు కైకేయి ప్రాసాదానికి పోవుట

దారి పొడవునా అనిమిత్తంబులతో, అల్లకల్లోలంగావున్న అయో ధ్యను చూసి దూపిల్లిన మనస్సుతో శీఘ్రంగా కోటచేరి, సరాసరి జనక మందిరానికి చని, ప్రభు వున్న గృహంవలె భాసింపక, నీరవంగా, నిర్జ నంగావున్న ప్రాసాదాంతర్భాగంలో ప్రవేశించాడు. భరతుని రాకచూసి పరమానందంతో బంగరుసింహాసనంనుంచిదిగి కైక ఎదురుగాపోయింది. ఎదురుగావచ్చిన తల్లికి సాష్టాంగ నమస్కారంచేసి నిల్చున్న కొడుకును తన అంకపీఠంపై చేర్చి శిరంమూర్కొని, శరీరం పుణికి "తండ్రీ! ఎన్నాళ్ళయింది నిన్నుచూచి? దూరంనుంచి వచ్చావు. అలసినట్లున్నావు. నీ తాతా, నీ మేనమామా సుఖంగా వున్నారు కదా? మమ్మల్ని మరచి ఇన్నాళ్ళు అక్కడ ఎలా వున్నావు? ఇక్కడివలె అక్కడ అన్ని సౌఖ్యాలూ అమరినవా? ఎప్పుడూ నీవు నా కళ్ళముందే వున్నట్లుగా రోజులు గడిపాను. ఇప్పటికైనా తల్లి గురుతువచ్చి వచ్చావు. లోనికిపో. పథశ్రాంతి తీర కొంతసమయం పండుకో. నేను కాదగిన కార్యాలు చూస్తాను." అని నదురు బెదురులేని గుండె నిర్భరంతో కైక అన్నది. ఆ మాటలువిని భరతుడు "అమ్మా! రాజగృహం వదలి ఏడురోజులైంది.

అక్కడ అందరూ క్షేమంగా నేవున్నారు. వారంతా నిన్నూ తండ్రినీ ఎంతో ఆదరంతో అడిగారు. వచ్చేటప్పుడు మామయ్యా, తాతా విలువకందని వస్తువులు ఎన్నో ఇచ్చి పంపారు. అవి వెనుక వస్తున్నై. దూతలు తొందరించటంతో ముందుగా నేను వచ్చాను. కాని అడిగినవాటికి సరిగా సమాధానం చెప్పు. తండ్రి సింహపీఠం, హేమతల్పం శూన్యంగా ఎందుకువుంది? పరిచారికా గణం పరివేదన పొందుతున్న దెందుకు? ఈవేళకు తండ్రి నీమందిరంలో కొలువు తీరేవాడు. ఈరోజు ఏల రాలేదు? తండ్రిని చూడాలన్న తాప త్రయం కొద్దీ త్వరత్వరగా వచ్చాను. ఆయనకు పాదాభివందనం చేయాలనీ, ఆయన ఆలింగన భాగ్యం పొందాలనీ ఆశించాను. పెద్దమ్మ ఇంటి వద్ద వున్నాడా? చెప్పు. ఆయన్ను చూడకుండా అర్థనిమేషం ఆగలేను. మనసు మనసులో లేదు. అంతా తారుమారుగా కనబడుతున్నది. జరిగిందంతా సత్యంగా చెప్పు" అని అడిగాడు.

భవిష్యత్పరిణామాన్ని ముందే దర్శించి నిర్ణయించుకున్నది కనుక ఏమాత్రం జంకక, చలింపక కైక కన్నకొడుకుతో అన్నది. "తండ్రీ! భరతా! అనఘుడు, యజ్ఞశీలి, అవనీపతి, అధికతేజుడు అయిన నీ తండ్రి ఎల్లభూతకోటి ఏగతిచెందుతుందో ఆ గతిని పొందాడు" అని. ఆమాటలు పూర్తికాకముందే గాలివిసరున కొమ్మనుండి ఫలం రాలినట్లు నేల భరతుడు వ్రాలాడు. లేచి ముఖంపై చేతులు పెట్టుకుని భోరున ఏడ్చాడు. దిగ్భ్రమ చెందాడు. "తండ్రి నేను భరతుణ్ణి. నీకై వచ్చాను. నన్ను ఆదరించు. ఆశీర్వదించు. నిన్ను చూచి, నీ ప్రేమాలింగన భాగ్యం అనుభవించి ఎన్నాళ్ళయిందో. ఇంతకాలం రాని నాతప్పు క్షమించు. నీ ఇష్టానుసారంగా పోయినవాణ్ణే కాని, మామపై పెంచుకున్న మమకారంతో కాదు. తండ్రీ! నేనేగునప్పుడు ఎంతో ఆరోగ్యంగా, వుల్లాసంగా వున్నావు. ఇంతలో ఏమి వూహించరాని విషపరిణామం వచ్చింది? ఈజన్మకు నిన్ను చూసే భాగ్యం నాకు లేదు" అంటూ మొరబెట్టాడు. పున్నమినాటి చంద్రునిచే శరత్కాలయామినీరమణి శోభించినట్లు నాతండ్రిచే ఈ ధర్మతల్పం శోభించేది. ఇప్పుడు సూర్యదర్శనంలేని దుర్దినంగా కనిపిస్తూంది. నీరు లేని సాగరంవలె ఎడారిగా వుంది." అని ఏడ్చాడు. మదదంతావళంవలె, ఇనుదురీతి, చంద్రుడులాగా వున్న తన తనయుని మెల్లగా లేవనెత్తి కైక

కన్నీరుతుడిచి, లాలించి, చల్లనిమాటలుచెప్ప మొదలుపెట్టింది. "తండ్రీ! లే. దుఃఖించకు. ఎంత ఏడ్చినా పోయినవారు రారు. ఎవరైనా ఎంత కాలం జీవిస్తారు? నీవంటిబుద్ధిమంతుడు, కాలందీరిన వారికోసమైకన్నీరు కార్చటంతగదు. ఎన్నోవేల ఏండ్లు పరిపాలించి, ప్రఖ్యాతినార్జించి, అద్భుతంగా సవనాలుచేసి, అన్ని సౌఖ్యాలు అనుభవించి పండి రాలిన పండువలె పరలోకంచేరాడు. వేదశాస్త్ర పురాణేతిహాసాలు వల్లించావు. సుమతివని పేరు పొందావు. లేచి కాగలకార్యంచూడు." అని. తల్లి మాటలు తనయుని తాపం తీర్చలేదు. కొరవితో గోకినట్లైంది. ఆమె మాటలను మధ్యలోనేఆపి, "మా అన్న రామచంద్రుని యౌవరాజ్యాభి షిక్తుణ్ని చేస్తున్నాడనో, లేక నూతన క్రతువునకు జనకుడు సంకల్పం చేశాడనో ఆశతోవచ్చాను. అటువంటివిఏమీలేవు. ఆకస్మికంగా ఆయన మరణించాడని ఆత్మ నమ్మటంలేదు. మరణించినమాటనే చెపుతున్నావు. ఆయనకు వచ్చిన అనామయమేమిటో చెప్పవు. ధన్వంతరులను మించిన రాజభిషగ్వరులు (వైద్యులు) వున్నారు. అంతటి అసాధ్యమైనవ్యాధి అయినప్పుడు నాకు ముందుగా ఎందుకు తెలుపలేదు? ఎంత ఘోరం జరిగింది?

నా అన్నలే అదృష్టవంతులు. మరణసమయంలో ఉపచారాలన్నీ చేసి పుత్రధర్మం పూర్తిగా నిర్వహించారు. నా తండ్రికి లోకాచారంగా వచ్చిన చావుకాదిది. అయితే అయోధ్య ఇంత అడవిగామారదు. రోగ పీడితుడైమరణిస్తే, వ్యాధిప్రబలంగావున్నప్పుడేవర్తమానంనాకు వచ్చేది. ముందుతెలిస్తే నేవచ్చేవేళకు జీవించిన తండ్రిని చూచేవాణ్ని. చివరకు నాకా యోగంకూడా కలుగలేదు. ఆయన ఏమాత్రం ప్రాణంతోవున్నా, నన్నీ స్థితిలో వుంచేవాడా? బలిష్ఠాలైన తన బాహువులుచాచి, యజ్ఞకర్మ కర్మలతో, దానధర్మాలతో పవిత్రమూ, పావనమూ ఐన పాణిపల్లవంతో ధూళితుడిచి, లాలించడా? పుత్రుడనైపుట్టి ఆయన అనురాగాన్నే చూర కొన్నాను, కాని సేవచేసి ఆయన్ను ఆనందపరచలేక పోయాను. అన్ని విధాలా వ్యర్థుడనయ్యాను.తండ్రికి శ్రాద్ధక్రియలు జరిగిన జాడకానరాదు. నే వస్తూ చూచిన దృశ్యాలను తలపోస్తే, శవదహనం జరుగనేలేదని బోధిస్తున్నవి. ఏ యుగంలోనూ ఇట్టి వైపరీత్యం ఘటిల్లినట్లు వినము. అమ్మా! చివరిమాట చెప్పు. మరణ సమయంలో మాతండ్రి ఏమన్నాడు?

నాకేమని సందేశం ఇచ్చాడు? అంతమాత్రమైనా చెపితే విని అసువులు నిల్పుకొని ఆలోచిస్తాను." అని ప్రాధేయపడ్డాడు భరతుడు.

## రాముని వనవాస వృత్తాంతం కైకేయి భరతునకు తెలుపుట

ఆత్మజుని చిత్తం కైకేయికి అవగతమైంది. అనృతదోషాన్ని అడ్డగించింది. తను తలపెట్టినకార్యం తుది చూడాలని సంకల్పించింది. ఆత్మవంచనకు ఆశ్వాసాంతం పలికింది. యుగయుగాలుగా మాయని మచ్చను తెచ్చే తన సీతను తానై ఆనందంతో ఆహ్వానించింది. తన మార్గం ధర్మబద్ధమనిమళ్ళీస్థిరపరుచుకుంది.భరతునిచూసింది."నాయనా! భరతా!యథార్థం చెపుతున్నాను. నీతండ్రి మరణసమయంలో, ఎవ్వరికీ ఏమి చెప్పలేదు. "హా!రామా!హా!సీతా!హా!లక్ష్మణా!" అని సంతాపిస్తూ శరీరత్యాగంచేసి స్వర్గధామం చేరుకున్నారు. బంధంలో చిక్కిన మద మత్తేభంవలెరోజుతూ, సీతాలక్ష్మణసమేతుడై రాముడుతిరిగి అయోధ్యకు వచ్చేటప్పుడుఎవరుచూస్తారోవారేధన్యులు.వారిపాదపరాగంతోఅయోధ్య పావనం అవుతుంది" అన్న చివరిమాటలో జీవితం చాలించారు. పైన ఒక్క పలుకుకూడా పలుకలేదు" అని చెప్పింది. విన్న భరతుడువిషణ్ణుడైనాడు. "జరగగూడనిదంతా జరిగింది. ఒకటికి రెండు ఘోరవార్తలు విన్నాను. మాఅమ్మ మొదటినుండి కుదించి చెపుతూంది. తండ్రి మరణానికే తపించిపోతున్న నాకు, పుండుపై పుప్పు పులిమినట్లు అన్నలూ, వదినా అయోధ్య వదలివెళ్ళారా? అంతా అనుమానంగానే వున్నది. అసలు విషయం అర్థంకాలేదు."

## కైక రాముడు అడవులకు పోవుట భరతునకు తెలుపుట

అని పరిపరివిధాల విచారించాడు. "అమ్మా! వారెందుకురాజ్యపరిత్యాగం చేయవలసి వచ్చింది? వివరంగా వినిపించు" మని అడిగాడు. "నారలుగట్టిదండకారణ్యానికిసీతాలక్ష్మణులతోకలసిరాముడు వెళ్ళారు" అని తల్లి చెప్పిన ప్రత్యుత్తరం విన్నారు. భయవిదారిత మానసుడయ్యాడు. ఇక్షుఖండంవంటి ఇక్ష్వాకులచరిత్రగుడుతుకుతెచ్చుకున్నాడు. సీతారామలక్ష్మణుల శీలాన్ని శంకించలేక, భావాంతరంగా తల్లినిప్రశ్నిం

నాడు. "అమ్మా! ఒకరు కాక ముగ్గురు దోషులా? ఏమిచేయగూడనివి వారు చేశారు? అందులో, మా అన్న శ్రీరామచంద్రుడు బ్రాహ్మణ ధనాపహరణం చేశాడా? గుణవంతుడైన ధనవంతుణ్ణి క్రూరుడై నిరుపేదను చేశాడా? పరాంగనాసంగమ పాపం కట్టుకున్నాడా? ఇంకా ఇతర హేతువు లేమైనా వున్నవా? భ్రూణహత్య చేసిన మహాపాపికి విధించే శిక్ష విధించబడింది. మహాసాధ్వి, అసూర్యంపశ్య, ఉభయ కులోత్తారిణి, మా వదిన చేసిన నేరం ఏమిటి? అవక్రపరాక్రమ విక్రముడు, అన్న సేవకాక అన్యమెరుగని మహాపురుషుడు, నా చిన్నన్న దండకాటవికి పంపించే దారుణ కార్యం చేయటం సంభవమా? సూర్యచంద్ర గమనం సరిగానే వున్నది. వేలలుదాటి సప్తసాగరాలు విజృంభించలేదు. పగలు చుక్కలు కాయలేదు. భూభ్రమణం స్తంభించలేదు. ప్రళయ సమయపుష్కలావర్త మేఘాలు తెగబడి వర్షించలేదు. మరి ఈ ఘోరశిక్షలకు వారేల పాత్రులైరి? నామీద దయవుంచి చెప్పమ్మా చెప్పు. ఇక్ష్వాకు వంశభవుల ఇంట్లో ఇటువంటి పనులు జరిగితే, విశ్వాన్ని సత్యధర్మ చక్రాలపై నడిపించే నాథుడెవడు?" అని.

"నాయనా! వారట్టివారైతే నీవు అన్నట్లుజరిగేది. వారా విధంగా చేయలేదు. అవి జరగలేదు. అందుకు కారణం నేను. నీ తండ్రిని రెండు వరాలు కోరాను. ఆయన అవి ఇచ్చాడు. నీ పట్టాభిషేకం, రామదండకారణ్యవాసం. ఆయన అంగీకారంతోనే రాముడు పితృవాక్యపాలనకై అడవికి వెళ్లాడు. సీత భర్తను అనుసరించింది. శత్రుఘ్నుడు నిన్ననుసరించినట్లే లక్ష్మణుడు అన్నను అనుసరించాడు. వారు పోయినపిమ్మట వారివియోగం భరించలేక పరలోకం చేరాడు. తండ్రి! ఇదంతా నీ మీది మమకారంకొద్దీ చేశాను. శోకంమాను. పౌరపురోహితామాత్యులు నీకోసం ఎదురు చూస్తున్నారు. నీవు రాగానే రాజునుచేయటం నిమిత్తం సిద్ధంగా వున్నారు. నీవుకూడా అభిషేకానికి సిద్ధంగావుండు. పితృకార్యం

## భరతుడు తల్లిని దూషించుట

కాగానే అభిషేకంకూడా పూర్తిచేస్తారు. రాజాధిరాజువై రాజ్యం పాలించు" అని చేసింది చేసినట్లు కైకేయిచెప్పింది. "అమ్మా! ఆలో

చించి ఈపనిచేసింది నీవేనా? తండ్రిని చంపుకుని, అన్నలను అడవికి పంపుకుని ఆహోరిస్తున్న భరతయ్యకు పట్టాభిషేకంకూడనా? చేయక చేయక కొడుకుని వుద్ధరించటానికి గొప్పపనిచేశావు. ఈబుద్ధి నీ తల్లో పుట్టిందా? ఎవరితలైనా ఎరువు తెచ్చుకున్నావా! చండీ! నీ నోటినుంచి ఎంత శాంతవచనాలు వస్తున్నాయి. కొడుకుకు రాజ్యంవస్తుందని కులికావేకాని, నీ తాడుతెగుతుందనీ, నిందలకు చిహ్నంగా నీవు నిలుస్తావనీ, కొడుకు కొంపకు నిప్పంటించావనీ ఎంచావా? నిర్హేతుకంగా నాతండ్రిని నీవే చంపావు. పాలవంటి మా కులం పాడుచేశావు. నీ కరగ్రహణం నా తండ్రి కాళరాత్రి కరగ్రహణంచేసినట్లయింది. నాకోసం రాజ్యంకోరావా? అందుకు ఇంతకురాగతానికి పాల్పడ్డావా? ఎప్పుడైనా నన్ను అడిగావా? నాఇష్టం తెలుసుకున్నావా? దేవునివంటి భర్తనుచంపుకుని, కన్నతల్లి కన్న మిన్నగాచూచిన బిడ్డల కానకుసెట్టిన ఘోరపైశాచికమూర్తివైన నీ చెంత నా పెద్దమ్మలు ప్రాణాలతో బ్రతుకగలరా? నన్నుమరపించిన నా అన్నను నట్టడవికి నెట్టటానికి ఇంతసాహసం ఎలావచ్చింది? మాతృ హృదయం మంటకలిపావుగా దుర్భగురాలా! సవతిమచ్చరంతో ఈనీచ కార్యం చేశావనుకోవటానికి పెద్దతల్లి తోబుట్టువులాగా నిన్ను ఆదరిం చిందే? భర్తపై అధికారం సంపాదించి తనకు దూరం చేశావని అసూయ పడలేదే. పల్లెత్తుమాటైనా పలుకలేదే? నాకడుపుకే కాక ఆమె కడుపుకు కూడా చిచ్చుబెట్టావే?

ఆ జగన్మంగళమూర్తికి నార చీరలు కట్టనిచ్చిన నీ చేతులు రాలి పడలేదెందుకు? అన్నపై ఈగ వాలటంకూడ సహించలేని లక్ష్మణుని కఠోరకరవాలానికి నీ శరీరం ముక్కచెక్కలు కాలేదెందుకు? ఎందుకు అవుతుందీ. ధర్మతత్పరుడైన .చిన్నన్న మహాపాపివి, అందులో ఆడు దానివి నిన్ను చంపుతాడా? తానుకూడ పాపం పంచుకుంటాడా ? మా అన్నపట్ల నా ప్రవర్తన ఎటువంటిదో ఎన్నడైనా తెలుసుకోటానికి యత్నించావా? నేను వీరపుత్రుణ్ని, సుక్షత్రియుణ్ని. ఆడుది సంపాదించి ఇచ్చిన రాజ్యం అంగీకరిస్తానా? అలా జరుగుతుందని ఆశించావా? రామ లక్ష్మణ వక్షితంగాని రాజ్యం భరతుడు పాలింపగలడా? మహాశూరుడైన రాముడు ధరించే రాజ్య భారం అల్పుడైన భరతుడు ధరించగలడా?

వృషభం నాగలి బరువు మోస్తుందని వేగమోయ గలదా? ఏకారణం చేతనయినా ఒకవేళ మోయవలసివస్తే, పుత్రగర్భినివైన నీపాపవాంఛను తీర్చదానికి పాల్పడతానా? ఓసీరాక్షసీ! బెడిసికొట్టిన నీమంత్రాంగానికి నీవే బలికా. లక్ష్మణుడు నిన్ను నిజంగా బ్రదుకనిచ్చాడంటే, ఎవని కారడవుల కంపావో వాని కరుణాకటాక్షంవల్లనే. అన్న అభిమానించిన నిన్ను చంపను. నీవు నాకు తల్లివికావు. నీమాట మన్నించను. హేయ చరిత్రవు. నీవు నాకు తల్లివని చెప్పుకోటానికి సిగ్గువేస్తూంది.

మావంశంలో పూర్వంనుండి పెద్దవాడురాజ్యభారం వహించాడు. అతని సోదరులు దైవసమానంగా అన్న ఆజ్ఞలను తలదాల్చారు. ఈ సంప్రదాయం ఎల్లరాజలోకంలో చెల్లుతుంది. ఈవిషయంలో మా వంశం మేరుపుగా గురుతింపబడింది. అట్టివంశంలో పుట్టామన్న పొగరు నీ సంబంధంతో బంధమైంది. నీ వంశంలోనూ ఇదే ఆచారంగదా? నీ తలలో ఈ దుర్బుద్ధి ఎందుకు పుట్టింది? నీవు సంతోషంగాచేసిన ఈ పాపం, నాకు రౌరవ నరకం కూర్చేదిగా పరిణమించినందున నేను మరణిస్తాను కాని నీ మాట పాటించను. పైపెచ్చు నీకు అనిష్టంగా అన్ననుకొనివచ్చి అభిషేకిస్తాను. అధిపతిని చేయటమేకాదు, అంతః కరణశుద్ధిగా అన్నపాదోపజీవినయి బ్రదుకుతాము. నీవు తీసిన గోతిలో పడి నీవేచావు" అని, రౌద్రాకారుడై, శోకమూర్తియై, దాసుడై, దీనుడై, జ్ఞానియై, ధర్మియై, మానవోత్తముడై, గర్తంలోపడిన కరీంద్రంలాగా ఘీంకరించి, దుఃఖించి, ప్రాధేయపడి, స్తుతించి, నిస్పృహుడై, సమ చింతనుడయి, భరతుడు వంశ మర్యాదను పాటించి, లోకానికి మార్గ దర్శిగా నడచి, ఆరని తీరని దారుణ కోపంతో—

"నేటినుంచి నీకు నేను చచ్చినవానిక్రింద జమ. భ్రూణహత్యా దోషాన్ని మించిన దోషం చేశావు. నీ ఈ చేతకు అధోలోకాలు తప్ప పూర్ధ్వలోకాలురావు. ఓ భర్తృ ఘాతినీ! నీ కోరిక తీరలేదు సరికదా, నాకుమాత్రం తండ్రినీ, అన్ననూ దూరంచేశావు. నిన్ను దూషించటం కూడ తప్పు.అన్నమాటలకు అనుతాపం పొందుతున్నాను. అంగప్రత్యం గోత్పుడయిన పుత్రుని కంటె తల్లికిప్రేమింపదగిన పదార్థం పృథివిలో లేదు. మాతవైకూడ మాతృ సుత వియోగం కల్పించావు. ఒకనాటి

కాలంలో, నాగళ్ళను ఈడ్వలేక, రైతుల కశాఘాతానికి ఓర్వలేక, మిట్ట మధ్యాహ్నం, మెడలు వ్రేలవైచుకుని పుడమిబడిన బిడ్డలచూచి సురభి, వాటిపాటు హృదయం కాల్చగా భోరని ఏడ్చింది. క్రింది భాగంలో పోతున్న ఇంద్రునిపై అశ్రువులు ధారావాహికంగా పడ్డై. ఆ నీరు పరిమళ భరితంగా ఉన్నందున, కామధేనువు కన్నీళ్ళని గుర్తించి శిరం పైకెత్తి ఆకాశంలో నిల్చి దుఃఖిస్తున్న కామగవిని కాంచి, ఆమెను చేరి అంజలించి నిమిత్తం అడగ్గా, భూలోకంలో కాపులచేత కష్టపడుతున్న తన సంతానాన్ని చూపింది. తల్లికి బిడ్డపై కల ప్రేమ ఎట్టిదో, ఆత్మ సంతాన రహితులగు దేవతలపతి తెలిసికొన్నాడు. కోటానుకోట్ల సంతానం గల దేవతాధేనువే బిడ్డల బాధనుచూసిశోకిస్తే, ఏకపుత్రక, పెత్తల్లి, కొడుకును పీడి ఎలా బ్రతుకుతుంది? ఇప్పుడేపోయి మా అన్నలను తీసుకుని వస్తాను. పట్టం కడతాను. ఆయన అరణ్యవాస నియమం నేను పాటిస్తాను. నీవు చూస్తుండగనే ఈపనిచేస్తాను. నాఒడలు భగ్గనమండుతున్నది. తండ్రిని చూడలేదు. తండ్రి అంతటివాడు అన్న దర్శనంతో గాని ఈఅగ్ని చల్లారదు.

నీవేమైనా సరే. అగ్నిలోపడు. అడవులకుపో. ఉరిపోసుకో. ఉన్నత శైలపాతంచేయి. ఏమిచేసినా నీ పాపానికి ప్రాయశ్చిత్తంలేదు. నీకు పతిసేవాఫలం ప్రాప్తించదు. నీకొడుకును అయినందుకు ఏమీ ఎరుగని నానెత్తిపై ఇంత అపకీర్తి భారంపడేశావు. నేను పోతున్నాను. రామునికన్న తల్లే నాకన్నతల్లి. లక్ష్మణుని మాతే నామాత" అని, రక్త నేత్రాలతో, కందినమొగంతో, కంపిస్తున్న కాయంతో. ఒడలిపైనున్న ఆభరణాలన్నీ త్రెంచి భూమిపైపారజల్లి, తలముడి వీడిపోగా, అడుగులు తడబడగా, కంఠంలోగద్గదఆవరించగా, మహాక్షయకాలం వచ్చినప్పుడు ఇంద్రుని ధ్వజం విరిగిపడ్డట్లుపడి లేచి వెర్రివానివలె చేతులు పైకి ఎత్తి, "ఓ మాతలారా! అయోధ్యాపౌరులారా! కోరలేదు రాజ్యం. కుత్సితంగా ఆలోచించలేదు. భూమిపతిత్వం కోరమని ఈ మానవాకార దానవిని ప్రేరేపించలేదు, రామపట్టాభిషేక వార్త నాకు చేరలేదు.తండ్రి మరణం,

రామవనవాసం ఇక్కడనే, ఇప్పుడే, ఈమంత్రుల సమక్షంలోనే తెలిసింది. ఏడురోజులు ప్రయాణంచేసి తమ్ముడూ, నేనూ, మంత్రులూకలిసివచ్చాం. నానిర్దోషిత్వానికి మహామంత్రులే సాక్షులు" అంటూ శత్రుఘ్నునితో కైకేయీ మందిరం గమించాడు.

## భరతుడు కౌసల్యను చూడబోవుట

బిగ్గరగా గొంతెత్తి ఘోషించిన భరతునికంఠధ్వనికౌసల్యవిన్నది. ప్రక్కనవున్న చెల్లెలుసుమిత్రతో "ఆ గొంతూ, ఆమాటలూ భరతునివలె వున్నై, పెద్దలు పిలిపించారేమో. పోయి చూచి వస్తాం. వస్తావా?" అని. కార్శ్యంతో, వివర్ణంతో, ప్రాణాలువున్నవో లేవో అన్న సందేహంకలిగే స్థితిలోవున్నఆమెచెల్లెలిచేయిపట్టుకుని లేవపోతూంది. ఆవేళకుభరతశత్రుఘ్నులు పాదచారులై వడివడినడకతో వచ్చి అమ్మల నిద్దర్నీ ఆలింగనం చేసుకునిఆవురుమంటూఏడ్వసాగారు. ఆదుఃఖంలోనే తల్లులిద్దరూబిడ్డలను ఇద్దర్నీ గుండెలకు హత్తుకున్నారు. "నాయనా! భరతా! అయిందేదో అయింది. మాకేడుపు ఎట్లాగూ తప్పనేతప్పదు. నీవెందుకు ఏడుస్తావు? నీతల్లి నీకు అన్నివిధాలైన అడ్డంకులు లేకుండా తొలగించి, మందహాస మాత్రంతో, భ్రుకుటిబంధంతో, మహావిశ్వంభరను సాధించి నీకుఇచ్చింది. ఇక రాజ్యాధిపతివై గుండెపై చేయివేసుకుని ఇద్దరూ నిద్రపోండి. నార గుడ్డలు కట్టించి నాతండ్రినినట్టడవులకు నెట్టిన నీతల్లి నన్నుకూడ నెట్టి నట్లయితే కొడుకుతో, కోడలితో కలసి జీవించేదాన్ని. ఆమె అలా చేయక నన్ను చిత్రహింసచేసింది. నిజంచెప్తున్నాను బిడ్డా! నాకొడుకు రాజ్యభ్రష్టుడయినాడని నేను శోకించటంలేదు. తండ్రి ఎవరికిస్తే వారే పాలిస్తారు. నాఏడుపుఅంతా అన్యాయంగా నాకొడుకు అడవులపాలైనా డనీ, ముసలితనంలో బిడ్డసేవలో శేషజీవితం వెళ్ళిపోలేదనీ. నాకుఒకరి ఆజ్ఞఎందుకు? పతి బ్రతికివుండగా, సతి విడిచివెళ్ళటం ధర్మంకాదని, విషంమ్రింగినట్లు పుత్రవియోగం మ్రింగాను. ఆ అడ్డుకూడ మీ అమ్మ లేకుండాచేసింది. ఇక మేమే పోతాం. వృద్ధులమైన మాపట్లనీకుదయ కల్గితే మీ అన్నవున్నచోటుకి చేర్చు. అది నీరాజ్యాభిషేక సంతోష

సమయంలో మాకిచ్చినబహుమతిగా సంతోషిస్తాం" అనికౌసల్య అన్నది. సుమిత్ర ఇది ఏమీ పట్టనట్లు పుత్రుని పరామర్శించింది.

కౌసల్య కౌగిటిలోవున్న భరతుడు ఆమెపల్కిన పల్కులకు అగ్నిలో కాల్చితీసిన ఇనుపసలాకలు అంటించినట్లై, ఆమెపాదాలపై నిర్జీవప్రతిమలాగాపడి మూర్ఛిల్లాడు. భరతునిపాటుకు కౌసల్యాహృదయం కరిగింది. నర్మగర్భంగా తానన్నమాటలకు తానే లజ్జించింది. అన్నాహారాలులేక అలమటించి శుష్కించిపోయిన శరీరంతో వంగింది. కట్టతెగిన జలంలాగా, కన్నీరు భరతుని శిరంపై వర్షించింది. చేతులతో ఎత్తబోయింది. భీమబలుడైన భరతుడు కదలలేదు. ఆమె కరుణార్ద్రకర స్పర్శతో తెలివివచ్చిన భరతుడు తెప్పరిల్లి "అమ్మా? నీ పాదములపై ప్రమాణంచేసిచెపుతున్నాను. ఇందుకుసర్వదేవతలుసాక్షులగుదురుగాక.

## భరతుడు కౌసల్యతో ప్రతిజ్ఞచేయుట

నేనే, నా అన్న అరణ్యవాసానికి అంగీకరిస్తే-

పెద్దల పరిచర్యలో సంపాదించిన శాస్త్ర పరిజ్ఞానమహిమ నాకు లేకుండ పోవుగాక, అరుణగభస్తి మండలానికి అభిముఖంగా నిల్చి మేహసర్జనం (మూత్రవిసర్జనం) చేసిన దురాచారిపొందే దుర్గతులునాకు కలుగుగాక. నృశంసుల పాదసేవ ప్రాప్తించుగాక. నిద్రించేగోమాతను నిష్కారణంగాకాలితో తన్నేవానికీ, కార్యార్థియైనవాడిచే చాగల కార్యాలన్నీ చేయించుకుని, భుక్తికి కాసుకూడనీయనిపురుషాకారరాక్షసునకూ యముడు ఏమి శిక్షలు విధిస్తాడో అవి నాకు వచ్చుగాక. తల్లిబిడ్డలను చూచేవిధంగా చూసే ధరణీపతి పట్ల కృతఘ్నుడుగా మెలగేవంచకునకు వచ్చే కిల్బిషంనాకు వచ్చుగాక. ప్రజలశ్రమలో ఆరవభాగంబలవంతంగా గుంజుకుని ప్రజలను బాధించేజారిశప్రభువునకు ఎట్టిదండనవిధించబడుతుందో అది నన్నాశ్రయించుగాక! ఎవరుభూరిదక్షిణలతో సత్కరిస్తానని ద్విజశ్రేష్టుల ఆహ్వానించి యజ్ఞానంతరం ఇతరమైనసాకులతో నిందించి, వట్టిచేతులతో పంపుతాడో వాడుపోయేలోకం నన్నుపొందుగాక! సంగ్రామంలో పారిపోయే క్షమాపతికీ, గురునిర్దిషతత్వాన్నికూలదోసిననడచిన శిష్యుడికీ, ఏఏ శిక్షలు యమాలయంలో చెప్పబడ్డవో వాటిని నేను పొందు

దునుగాక. సూర్యచంద్రప్రభలతో శోభిల్లుతూ, ఆత్మసౌందర్యం అలంకారంగా, శివధనుర్భంగానికి నారిలాగిన దక్షిణహస్తంలో రాజదండం ధరించి సింహాసనాసీనుడయిన సింహవిక్రముని దర్శించి ఆనందించే మహాభాగ్యాన్ని కోల్పోదునుగాక.

శవహస్తంతో వుంచిన తిలపిండాలను తేరకుతిని బ్రతికే వాడికైన గతినాకు కలుగుగాక. విశ్వాసపాత్రునిగా విశ్వసించి ఆత్మలోని రహస్యంచెపితే, అది అందరికీ వెల్లడించే అధమాధమునికి పట్టేగతినాకు పట్టుగాక. మేలుచేసినవాడికి మేలుచేయనివాడూ, చేసిన మేలుమరచేవాడూ,సజ్జనుచేవిడువబడినవాడూ, సిగ్గుమాలినవాడూ, సంఘంగర్హించినవాడూ, కుటుంబసభ్యులపొట్టకొట్టి కలమాన్నాలు కడుపునిండా మెక్కేవాడూ, వయోధర్మం పాటింపకవనితను కట్టుకునిసంతతిలేకుండా చచ్చేవాడూ,పొందేదుర్గతులను నేనుపొందుదునుగాక. తల్లీ! ఒకటేమిటి? శ్రుతిస్మృతి ధర్మశాస్త్రాలు విధించిన నిషేధాలు అన్నీ చేసిన పాపం నన్నంటుగాక. అమాయకుడను. అగ్రజపాద భక్తుణ్ని. అనుమానించ వద్దమ్మా నీ ఆత్మసుతుని వంటివాణ్ణి" అని ఆక్రందనంచేస్తూ అవనిపై వ్రాలాడు.

## కౌసల్య భరతుణ్ని ఓదార్చుట

భరతుడు చేసినప్రతిజ్ఞలకు కౌసల్య కడుపుతరుక్కొనిపోయింది.మూర్ఛిల్లిన బిడ్డనుఒడిలోచేర్చుకుని "తండ్రీ! ఎంతెంతశపధాలు చేశావు. ఏదో కష్టంలోఅన్న మాటలకుఎంతనొచ్చుకున్నావు.పెద్దతల్లిని, కష్టంలోవున్న దాన్నిచూచిఆదరించవచ్చిననిన్ను అనుమానించటంనాపొరబాటు.బాధలో అన్నమాటలుగా భావించు. నామాటలకునీవు పొందిన మనఃక్షోభంకంటే వేయంతలు నీ ప్రతిజ్ఞలతో, నేను క్షోభిస్తున్నాను. నాపల్కులు నిన్ను బాధపెట్టినవే కాని శాంతి కల్పించలేదు. నీమాటలు బాధించికూడా పోయే నా ప్రాణాలు మళ్ళీనిల్పినై. నీ అన్నయ్య సౌమిత్రి రామయ్య సేవలో పొందే మహాభాగ్యం నీవుకూడ పంచుకున్నావు. పెద్దలు పొందిన కీర్తి నీవుకూడా పొందు. సుకర్మల ఫలితాలన్నీ నీకు చేకూరునై. నీయెడల రాముడు ఎల్లప్పుడూ ప్రసన్నుడై వుండుగాక అని దీవిస్తున్నాను. నామాటలుపాటికి తెచ్చుకోకు, "ఆదర్శసోదరుడవు" అని అనిపించు

కున్నావు. అన్న లేని అయోధ్య అడవిగా మారింది. ప్రభువులేక పట్టణం పాడుబడ్డది. నామభేదంకాని రూపభేదంలేనినీవు, సర్వసద్గుణసంపూర్ణుడ వైన నీవు విచారం విడిచి, ఇక చేయదగిందేదో చూడు" అని ఓదార్చింది. పెత్తల్లి మనసులో అనుమానం అంతరించి, అనురాగం కల్గినందుకు భరతుడు కొంత నిబ్బరం కూర్చుకున్నాడే కాని, తండ్రి మరణానికీ, తల్లి దుశ్చర్యకూ, అన్నల అరణ్యవాసానికీ మనసులో నాటిన శోకశల్యం పూర్తిగా పోలేదు. భరతుడు పట్టణంలో లేనప్పుడు జరిగిన సంగతులన్నీ తల్లులవల్ల భరతుడు విన్నాడు. మేనమామల ఇంటివద్ద అనుభవించిన సుఖాలూ, దూతలువచ్చి తోడ్కొని రావటంలో పొందిన ఇబ్బందులు, భరతుడు చెప్పగా తల్లులు విన్నారు. కైకేయి చేసిన కాని కార్యాన్ని భరతుడు ఖండించాడు. ఆమెను దూషించి తిరస్కరించి వచ్చినవిషయం విశదపరిచాడు. తల్లులిద్దరూ, "కారణార్థం ఇలాజరుగవలసి వున్నందున కైకేయి నిమిత్తమైంది కాని ఆమె మాత్రం ఇంతదూరం వస్తుందని వూహించలే"దని సమాధాన పరిచారు. గతాన్ని త్రవ్వుకుని కొంతసేపు అందరూ చింతించారు. ఎన్ని ప్రళయాలు వచ్చినప్పటికీ, ఎన్ని విలయాలు జరిగినప్పటికీ కాలగమనం మాత్రం ఆగదు. పగలు గడవగా రాత్రి వచ్చింది. రాత్రిపోగా, తెల్లవారింది.

## భరతుడు తండ్రి శవాన్ని చూచి పరితపించుట

తెల్లవారిన మొగాలతో, దీనత్వం రూపుగట్టినట్లున్న కౌసల్యా సుమిత్రలనూ, భరతశత్రుఘ్నులనూ, బంధుజనులనూ, వశిష్ఠాది ద్విజ శ్రేష్ఠులు వచ్చి పరామర్శించారు. ధైర్యం చెప్పారు. ప్రాప్తించిన దుర్యోగానికి విలపిస్తే ప్రయోజనం లేదన్నారు. కారణం లేకుండా కార్యం పోదన్నారు. సర్వజీవులకూ చావు సహజం అన్నారు. "యద్భావ్యం తద్భావ్యం" అని వేదాంతోపదేశం చేశారు. అన్నీ కోరుకున్నట్లు జరిగితే ఆ దైవంతో పనేమున్నారు. గ్రహచారయోగం కాదన్నా తప్పదన్నారు. వచ్చినవారంతా తలకొకరీతి ఓదార్చారు. వశిష్ఠులవారు భరతుణ్ణి వేరదీసి, "నాయనా! విచారించకు. దుర్యోగమేవచ్చింది. మీ తండ్రి మారకం సమీపిస్తుందని ఎన్నోసారులు నాతో చెప్పారు. అందుకే

వ్యవధానంలేకుండా అభిషేకముహూర్తం తానే నిర్ణయించారు. దూరస్థులకు వార్తలు అందింపలేదు. విధివైపరీత్యంవల్ల అది వేరుగామారింది. ఆయన అనృతదోషంరాకుండా ఆత్మత్యాగంచేసి దుర్లభమైనపుత్తమలోక విహారం సాధించారు. ఇంతవరకు అయోధ్యావాసులు అన్నం నీరం ముట్టలేదు. ముందుదహనక్రియ జరుగవలసివుంది. ఇప్పటికే కాలాతిక్రమణం చాలా జరిగింది. అందుకే నిన్ను పిలిపించాను. అక్కడతెలిస్తే అంతా తారుమారవుతుందని క్లుప్తంగాచెప్పి కొనిరమ్మని మంత్రులనే దూతలగాపంపాను. నీ ఇక లేచి శవస్థానానికిరా. కర్మకాండచాలావుంది" అని చెప్పారు. అన్నిటికంటే తన తండ్రి అపరక్రియ ముఖ్యం కనుక, భరతుడు ధృతివహించి శవనిక్షిప్తస్థానానికి చేరుకున్నారు. శరీరం చెడకుండా తైలద్రోణంలో భద్రపరచిన తండ్రిశవాన్ని చూశారు.

తమ్ముడు తోడుగా, బంధువులసాయంతో అందులోనుంచివెలుపల రత్నపరిష్కృత హేమశయనంపైకి చేర్చి "తండ్రీ! నాల్గుదిక్కుల్లాగా, బ్రహ్మ నాలుగుముఖాల్లాగా, మహావిష్ణువు నాలుగుచేతుల్లాగావున్న నలుగురు కొడుకులకని, ఒక్కకొడుకుకూడా వుండకుండా మరణించావా? త్రేతలో ధర్మం నాల్గుపాదాలతో ఎక్కడనడుస్తున్నదన్న ప్రశ్నకు, మహర్షిమండలం, అయోధ్యలో ఆజిధర్మదండంలోనని సత్యలోకంలో సమాధానం చెప్పింది నిన్నుగురించేకదా? నీవులేని అయోధ్య చంద్రుడులేని రాత్రివలె శోభింపదు. జనకా! అన్ననూ, నన్నూ సమానమైన అనురాగంతో చూచేవాడివికదా? నాకు రాజ్యం, అన్నకు అడవి శిక్షలుగా విధించావా? ఈ ధరాపాలనం ఎవరుచేస్తారు? మరల ప్రజలకు సుఖసంతోషాలు ఎలా ప్రాప్తిస్తై? ఈ వృద్ధమాతలు ఏమిచూసుకుని జీవిస్తారు? నీవులేవు. నీయంతవాడయినఅన్న లేదు. అయ్యమాటనిల్పినకీర్తిఅన్నకుదక్కింది. ఆయనను సేవించినపుణ్యంచిన్నన్నకుదక్కింది. మిమ్మల్నిపోగొట్టుకుని ఏడ్చేయోగం నాకుదక్కింది. నన్నుచూసి ఏడ్చేస్థితి నాతమ్మునికి దక్కింది. నీ అంకపాళిపై నుండవలసిన నేను, నీఆలింగనంలో పరవశించవలసిన నేను, నీ సేవలో తరించవలసిన నేను, నిన్ను ఎలా దహనంచెయ్యను? నీ మూర్తిచూస్తూ అగ్నికార్యం నీకుచేయలేను. గురుదేవా! శిష్యుణ్ణి క్షమించు. వీడు దుర్బలుడయినాడు. మతిభ్రష్టు

దయినాడు. అయిన ఆలస్యం ఎలాగైనా అయింది.అన్నలను పిలిపించు. వారినీడలో నే నిలుస్తాను. వారుచేసే పనులలో నేనూ కలుస్తాను. ఈ గంభీరమూర్తికి, ఈ దీర్ఘ బాహునికి, ఈదానధౌరేయునికి, ఈ కరుణా పయోధికి అగ్ని అంటించలేను" అని శవంపై భరతుడు పడ్డాడు.

## భరతుడు తండ్రికి ఉత్తరక్రియలు సలుపుట

వశిష్ఠులవారు ప్రేమతో లేవదీసి, "నాయనా! భరతా! ఈదుఃఖ సముద్రంలో మునిగింది నీవేకాదు. మేంకూడా. నీవు ధైర్యంతెచ్చుకుని పితృకార్యంపూర్తిచేయి"లే. అనిచెప్పారుభరతుడు."గురుదేవా! ఆచార్య ఋత్విక్పురోహితాదుల పిలిపించండి." అనగానే, బయట నుంచిన నృపాలుని అగ్నిని పురోహితులు తెచ్చారు. ఆ తర్వాత రాజేంద్రుని శవం శిబికపైచేర్చారు. వాహకులు మోయగా, వెండి, పైడి, కూర్చిన వస్త్రాలు బాటపై పరుస్తూ పరిచారకులు పోసాగారు. కొందరుచందనం, అగురూ, సరళపద్మకం, ధూపంవేస్తూ నడిచారు. శ్మశానస్థానంచేరగానే, మంచిగంధంచెట్లు కొట్టితెచ్చిన కట్టెలతో చితిసిద్ధంచేశారు. దానిపైధరణీ పతి శవం వుంచి, ఋత్విజులు మంత్ర పఠనంతో భరతునిచేత తలవైపు అగ్నిని ప్రజ్వలింప చేయించారు. సామవేదఋక్కులు చదువుతుండగా, రాజకాంతలు పల్లకీలెక్కి వృద్ధసంయుక్తంగా నగరం వెడలి దహన స్థానానికి వచ్చి, సవ్యాపసవ్యంగా చుట్టుకుని ఆర్తిలో అందరూ ఆక్రందనం చేశారు. అంతఃపుర కాంతల రోదనం చూస్తే కరుణరసవాహిని గట్లు తెగి పారుతున్నట్లు కనిపిస్తూంది. దహన కార్యం పూర్తికాగానే పల్లకీలపై రాజకాంతలూ, పాదచారులై బంధువులూ, మంత్రి సామంత పౌరజనులూ, భరతుని అనుసరించి సరయూతీరం చేరారు. యథావిధిగా అర్హతగల వారంతా మంత్రయుక్తంగా తిలోదకాలిచ్చారు.

పిదప స్నానాలు చేసి వాహనాలపై స్వగృహాలకు తరలివెళ్ళారు. దశరాత్రాశౌచం (పది దినాలు సూతకం) పాటించారు. పదకొండో రోజు భరతాదులు ఆశౌచస్నానాలుగావించి, పన్నెండోనాడు, దశ దానాలూ, షోడశదానాలూ, అపరకర్మవిధులన్నీఆచరించారు. వచ్చినవారికివిచక్షణ చూపకుండా అన్నదానం చేశారు. రత్నాలు, వెండి, బంగారం, గోవులు,

భూములు గృహాలు, వాహనాలు, వస్త్రాలు కోకొల్లలుగా పంచిపెట్టారు. "ఆనాడు దశరథుడు సుతయజ్ఞం చేశాడు. ఈనాడు సుతులు చేసింది పితృ యజ్ఞం" అని ఆబాల గోపాలం ఆశ్చర్యంలో మునిగిపోయారు. పదమూడోరోజున భరతుడు అస్థిసంచయనార్థం ప్రేత భూమికివచ్చి, తండ్రి దహనస్థానాన్ని దరిసి, రుద్ధబాష్పకంఠుడై రోదించాడు. "నన్ను అన్న హస్తానికి అప్పగించి అమరలోకం చేరావు. ఆయన అడవికి పోయి నన్ను నిరాశ్రయుణ్ణి చేశాడు. ఏకపుత్రక, వృద్ధ, అమాయిక నా పెద్దతల్లి ఇంక ఎవరిని చూసుకుని కాలం వెళ్ళదీస్తుంది. పిన్న పెద్దమ్మ మహాయోగిని. చిన్న వదిన గాఢ సుషుప్తురాలు. కన్నా విద కాశిక. పౌరులు ఉదాసీనులు. మంత్రులు మనస్సు చెడినవారు. అన్నలు అరణ్యవాసులు. నేను ఎవరి కోసం జీవించేది? ఎవరిని సంతోషపెట్టేది? ఇంతవరకు ఆకుచాటు పిందెలవలెనున్న మేం ఎవరిని, ఏమని ఆశ్రయిస్తాం? అడుగుతాం? ఇంక మాకు కోరిన కోర్కెలు తీర్చేవారెవరు? మమ్మల్ని ఆలించి, లాలించి పాలించే దెవరు? ధర్మాధర్మాలు, రాజతంత్ర మర్మాలు, కల్యాణకరమైన కర్మాలు మాకు ఎవరు బోధిస్తారు? తల్లివిగా, తండ్రివిగా, దాదివిగా మాకే కొరతలు లేకుండా, మా ఆరోగ్య భాగ్యాలు చెడకుండా, శీలం చెడకుండా కాపాడావే. నిన్ను మరవటం, మరచి బ్రదకటం మాకు చేతనవుతుందా?" అంటూ, ఆరోదనంలోనే బిగువు తప్పిన ఇంద్రుని ధ్వజంలాగా, నాకపతితుడైన యయాతిలాగా వసుమతిపై వ్రాలి మూర్ఛిల్లాడు. అన్నతోపాటు శత్రుఘ్నుడుకూడా, తండ్రి గుణగణాలు దల్చుకుని పనవి పనవి ఏడ్చి పడి పోయాడు. ఈ విధంగా భరత శత్రుఘ్నులు కొమ్ములు విరిగి కూలిన కోడెల్లాగా కూలగా, వెంటవచ్చినవారుకూడా విలపించారు. జ్ఞానియైన వసిష్ఠులవారు "పదమూడో రోజు కర్మ పరిసమాప్తంగాకుండా పితృ కర్మ ముగియదు. వృథాకాలహరణం చేయకుండా శేషాస్థిసంచయనం సేకరించు.

"ఆకలీ, దప్పి, శోకం, మోహం, జరా, మరణం అనే ఆరూ, మర్త్యుడెవడూ తప్పించుకోలేడు. అపరిహార్యమైనదానికి శోకంపొందటం విజ్ఞుల లక్షణం కాదు" అని బోధిస్తుండగా, సుమంత్రుడు శత్రఘ్నుణ్ణి సమీపించి లేవనెత్తి శోకాపహరంగా భూతాల జనన వృద్ధి క్షయాల

రహస్యంచెప్పి ఓదార్చారు. వారిని వారు సంబాళించుకుని మిగిలిన కార్యం ముగించి నాటికి ఇండ్లకు చేరారు.

## భరతుని ఓదార్చి శత్రుఘ్నుడు మంథరను తన్నుట

ఆవాసానికి చేరిన అనంతరం శత్రుఘ్నుడు అన్నలను చూడాలనే ఆకాంక్ష అధికంకాగా, అన్నతో "అన్నయ్యా! గతిచెడివగచే భూతకోటికి గతి ఎవ్వడో, అతడే నీకూ, నాకు గతి. అనంతజీవకోటిలో మనమెంత? సమస్తజీవులకూ ఆధారభూతమైన అప్రక్ర విక్రముడు అన్నయ్యే ఆడుది పొమ్మంటే అడవికిపోయాడు. అన్యాయాన్ని సహించనివాడు, అందులో అన్న అవమానం సహించి, తండ్రినీ, పిన్నమ్మను దండించకుండా అన్న వెంటనే అరిగాడు రెండో అన్న. అడుగడుగునా మానవుని మించిన శక్తి పని చేస్తున్నది" అంటూ చెపుతూంటే, వారికి తూర్పువైపుగా, ఒడలికి గంధం పూసుకుని, పూలదండలు చుట్టి రాణులు ధరించే ఏడువారాల నగలూ, చీరెలూ, ఒడ్డాణం ధరించి, త్రాటికి కట్టిన క్రోతిలాగా, ప్రతీహార ప్రదేశాన్నించి మంథర వస్తూంది. దాని వెనువెంటనే ద్వార రక్షకులువచ్చి పట్టుకుని సోదరులవద్దకులాగుకుని వచ్చారు. శత్రఘ్నుడు "ఎవరిది?" అని వాళ్ళను ప్రశ్నించగా "దేవరా! చిత్తగించండి. ఇది చిన్నరాణి కైకమ్మగారి అంతఃపురదాసీ. ఆమెకు ఆప్తురాలు. శుభం చూడలేని దుర్బుద్ధిగలది. దీనిపేరు మంథర. పెద్దదొర మరణానికీ, చిన్నదొరల అడవికాపరానికీ ఈ ముండే మూలం. అమృతంవంటి ఆ అమ్మ మనసులో విషంపోసింది. అలిగింది. అల్లరిచేసింది. అనకూడదు కాని ఆ తల్లిని చేస్తానసేదాకా చెవినిల్లుకట్టుకుని చెడ్డమాటలన్నీ చెప్పింది. మాకు ముందుగా తెలిస్తేముక్కముక్కలుగా తరిగి వుప్పులో వూరవేసే వాళ్ళం. ఇదే తన ప్రతాపం తక్కిన పనివాళ్ళతో చెపితే తెలిసింది. ఇంతలోమహారాజులు మరణించటం జరిగింది. మీరాకకోసంకనిపెట్టుకుని వున్నాం. ఈముండ ఎప్పుడయినా ఇంత విలువగా అలంకరించుకుందా, వున్నసంగతి చెప్పాం. దొరలు చిత్తంవచ్చినట్లు చేయండి" అని విన్నవించారు. జరిగినదంతా అనుపూర్వికంగా తెలుసుకుని, శత్రుఘ్నుడు పరితపించి "ఈ దురాగతానికి మూలమైన ఈ ముండను ఏం చేస్తానో

చూడండి" అను పలుకు ముగియకముందే తోడి చెలికత్తెలతో విర్రవీగుతూవచ్చినగూనిదాన్నిద్వారపాలకులుముందుకునెట్టగా శత్రుఘ్నుడు నేలపడి మన్నుకరచేలాగా ఒక్కతన్ను తన్నాడు. ఆతన్నుకు తన పాప ఫలితం నెమరుకురాగా, క్రిందపడి ఆప్రదేశం మార్మ్రోగేలాగా ఏడ్వసాగింది. పడినదానిని పడినట్లే నేలపై ఈడ్చి, పైకెత్తి మళ్ళీతన్నాడు. ఆ తన్నుతో మాటరాక, వూపిరిసలుపక, కన్నులుతిరిగి, చెట్టునుండిపడ్డ మేడిపండులాగా భూమిపై బోరగిలపడ్డది. తోకవచ్చిన దాసీలు—

అతని కోపాన్నిచూచి ఒకళ్ళతో ఒకళ్ళు సైగలుచేసుకుంటూ, "ఇక్కడవుంటే దాని చావుసంగతి అబద్ధం, మన చావుసంగతి సిద్ధం, పోదాం పదండి. పెద్దదేవేరమ్మపద్దకు పోయి "కాపాడండి తల్లీ!" అని కాళ్ళమీదపడదాం" అంటూ తలకొకదారిగా ఆమె మందిరానికి పారిపోయారు. అంతకంతకూ అధికం అవుతున్న ఆగ్రహంతో, ఈడుస్తూ, తన్నుతూ, చిత్రవధచేసి ఒదలిపైవున్న నగలన్నీ వూడబెరికి త్రెంపి పారేశాడు! దాసీదానిఏడుపువిని వచ్చినకైకేయిఅడ్డుపోగా,శత్రుఘ్నుడు మండిపడుతూ, "నేను శత్రుఘ్నుణ్ని. సుమిత్రాదేవి బిడ్డను. మా అన్న సహించాడుకాని, నీ దుర్బుద్ధికార్యాన్ని నేను సహించను. ఏ మొగం పెట్టుకుని ఈ ముండకొరకు అడ్డంవస్తున్నావు? మేరుగంభీరులూ, శాంతస్వభావులూ, ధర్మమూర్తులూ అయిన అన్నలం మేంకాము. అతి వృద్ధాప్యస్థితిలో అనృతం ఆడలేక, నీపై మమకారంచావక, కన్నవాణ్ని కానకునెట్టిన అయోధ్యాపతులంకాము. దీనిసాయంతో తీసిన కొంపలు చాలక ఇంకా ఎన్నికొంపలు కూల్చుదామనుకున్నావు? ఇక నీ ఆటలు సాగవు! అడుగు ముందుకువేస్తే దానికి పట్టినగతే నీకు పట్టుతుంది. దూరంగా తొలుగుతావా? తొలగవా?" అని దూషించి తన్నబోతే కొడుకు చాటుకుపోయింది.

తల్లిపాటు చూచి భరతుడు "తమ్ముడా! ఆగ్రహించకు. అన్ని ప్రాణుల్లో ఆడవాళ్ళు అవధ్యులు! మన అన్న "మాతృ ఘాతుకు" డని మన మొగం చూడడేమోననే భీతివల్ల ఈ కులపాంసను ఇంతవరకు వదలిపెట్టాను. ఆ మాటలు విన్నప్పుడే మాతృహత్యాదోషాన్ని కూడా చూడక అప్పుడే హతమార్చేవాణ్ణి. ఇది నీచురాలు. దీనికి సంస్కారం

ఎక్కడిది? తేనెలో నానపెట్టినంతే, వేపకాయ తీపిగా వుంటుందా? ఇది కూడ అరుదే. చేసినంతవరకు చాలు. శాంతించు. పోపొండి. లోకాన్ని చూచే యోగ్యత మీకులేదు" అని చెప్పగా, శత్రుఘ్నుడు శాంతించి పట్టును వదిలివేశాడు. అది కైక కాళ్ళపైబడి ఏడ్వగా, వెంటబెట్టుకుని కైక మందిరానికి చేరింది.

## రాజకర్తలు వచ్చి భరతుణ్ణి పట్టం కట్టుకొమ్మని ప్రార్థించుట

అనంతరం అన్నదమ్ములు అరణ్య ప్రయాణానికి ఆలోచన చేస్తూండగా రాజకర్తలు వచ్చారు. వర్తక, మంత్రి సామంత పురోహిత వర్గంతో పట్టాభిషేక సంభారాలు కొనివచ్చి "దేవా! పితృకార్యాలు ముగిసినవి. అశుచిత్వం అయోధ్యకు పోయింది. ఈ రోజు పద్నాల్గు. ఇక ఎంతమాత్రం రాష్ట్రం అరాజకాన్ని భరించలేదు. పెద్దకుమారుల ఇద్దర్నీ ప్రభువు వివాసులుగా చేసి పరమపదం అలంకరించారు. ఇకమాకు నీవే రాజువు. ఇది అయోధ్యకనుకా, ఇక్ష్వాకు ప్రభువుల ఛత్రచ్ఛాయలో నిలిచిందికనుకా, రాజరహితమైనా, అరాజకలక్షణం పొందకుండావుంది. ఈస్థితి ఇతరత్రా అసాధ్యం. అభిషేక సంభారాలతో రాతగిన వారంతా ఇక్కడికివచ్చారు. పితృపితామహపాలితంబైన పృథ్వీమండలంవహించి, మమ్మందరినీ మరల మానవులుగా చేయండి. మీపాలనలో, గతంలో పొందిన శోకాన్ని గతం చేస్తాం. వర్షాన్ని చాతకం కోరినట్లు నిన్ను రాజుగా మేం కోరుతున్నాం" అని అన్నారు

భరతుడు వచ్చిన వారందరకూ చేయెత్తి మొక్కి, "పూజ్యులైన పెద్దలారా! పౌరులారా! మీకోరిక ఎంతైనా మెచ్చదగ్గదే. మీరు నన్ను అర్థించటంలోకూడా అర్థం వుంది. అయినా, నేనందుకు అర్హుణ్ణి కాను. యుగయుగాలుగా మావంశంలో పెద్దవాడే రాజు, తక్కినవారు రాజ్య రక్షకులు. ఇక అరాజక దోషం రానీయను. మీరు కోరేది రాజునేకదా! ఆ రాజును నేను తెస్తాను. మీకప్పగిస్తాను. ఆయనకు మారుగా అరణ్య వాసం నేను చేస్తాను. నా యత్నం ఫలించకపోతే అప్పుడుఆలోచిద్దాం. ఇంతలో మునుకునిపోయింది ఏమీలేదు వచ్చినవారు రానేవచ్చారు. నేనొక్కడనేకాదు, నాతో మీరంతా రండి. సైన్యాన్ని సన్నద్ధంచేయండి,

మనతో అభిషేక వస్తువులు కొనిరండి. అక్కడే అభిషేకించి, నవ నాగ్నినితెచ్చినట్లు రామభద్రుని, సలక్ష్మణునిగా, సతీసమేతునిగారాజును చేసి రాష్ట్రానికి కొనివస్తాను. ఇది మీరు సమ్మతమేగా? అయితే వెంటనే కదలండి. అంతేకాని, పేరుకుమాత్రం తల్లిఅయిన కైకేయి కోరిన ప్రకారం భరతుడెప్పుడూ పాలకుడు కాడు. ముందుగా, మార్గంతెలిసిన వారినీ, శిల్పులనూ పంపండి. మెరకలు పల్లాలు సరిచేయించండి. దుర్గాధి కారులను పర్యవేక్షకులుగా పంపండి" అని కోరాడు.

ప్రజలంతా ఆ మాటలకు అమితానందం పొందారు. అందరూ ఏకంగా "ఆ తండ్రికితగిన పుత్రుడవూ, ఆ అన్నకుతగిన తమ్ముడవూ అని అనిపించుకున్నావు. దేవతలుమెచ్చే మార్గం ఎన్నుకున్నావు. పర లోకంలోవున్న నీ తండ్రి పరమానందాల్ని పొందేభావం వెలిబుచ్చావు. నీకు నీవే సాటి. అనాయాసంగా లభ్యమైన రాజ్యం తృణంగా పరిగ ణించి త్యాగంచేసినవుదాత్తహృదయుడుమానవులలోనేకాదు, దేవతలలో కూడా లేడు. అల్పపదార్థానికే, అన్యాయాలూ, వంచనలూ, హత్యలూ చేసేస్వార్థలోకంలో, నీవంటివాడు పుట్టటం నిజంగా అసంభవం. అది అయోధ్యావాసుల అదృష్టం. ఇప్పుడే నీ ఆజ్ఞను పాలిస్తాం" అని పంప వలసిన వారినందర్నీ ముందుగా పంపించే ఏర్పాటుచేసి, "ఆ జగన్మాత అనవరతం నీ అభిమతాన్ని తీర్చి అనుగ్రహించుగాక" అని ఆశీర్వదించారు.



౩.

# అరణ్యకాండ

మహామాత్యచోదితులై, స్థలజ్ఞులు, యంత్రికులు, ఖనకులు, సూత్రకర్ములు, శూరులు, కమ్మరి, వడ్రంగి, కమ్మటీలు, కూలివారు, మేదర్లు, బావులు త్రవ్వేవాళ్ళు, తాపీపనివాళ్ళు, మార్గదర్శకులు, అనుక్షణంలో అరితేరిన పనివాళ్ళంతా మహోదయంనాటి జలధిలాగా పొంగి పొరలిపోయినట్లు పోయారు. కాలం గణించరు. ఒడళ్ళు దాచరు. ఆకలి దప్పులుగూర్చి ఆలోచించరు. కోరినవారేకాక, కోరనివారుకూడా రామచంద్రుని దర్శనం లభిస్తుందనే ఆశతో కొరముట్లు తీసుకుని, దండుకట్టి దండకారణ్యానికి నడిచారు. కొందరు బాటలలోవున్న ముండ్లను ఏరుతున్నారు. కొందరు రాళ్ళను తొలగిస్తున్నారు. కొందరు గండ్లుపూడుస్తున్నారు. చెట్లు లేనిచోట్ల కొందరు చెట్లు నాటుతున్నారు. కొందరు దారికి రెండువైపులా పెరిగి అడ్డంగావున్న ముండ్లపొదల్ను గండ్రగొడ్డళ్ళతో, కత్తులతో ఛేదిస్తున్నారు. ముందుపోయేవాళ్ళు ఈవిధంగా చేస్తుంటే, వెనుకనుంచి పీపాలతో నీళ్ళుచల్లుతూండగా, రాతియంత్రంతో చదునుచేసుకుంటూ కొందరు వస్తున్నారు. కొందరు మరీ దుస్సాధ్యంగా వున్న అడవిప్రదేశాలను తగులబెట్టారు. ఎత్తైనచోట్లను మట్టంగాకొందరు చేశారు. పల్లపుగుంటల్లోకి బండ్లతో మట్టితెచ్చి మరికొందరు పోశారు. వంతెనలు వలయుచోట్ల కట్టారు. చెరువులగట్టులు సరిచేశారు. వాగులు, వంకలుదారికనుగుణంగాబాగుచేశారు. జలాశయాలులేనిచోట్లమడుగులు త్రవ్వారు. చలిపందిళ్ళు సవరించారు. గారపూతలతో అందంగాకట్టి మతలాలు కూర్చారు. సరోవరాలల్లో జలపక్షులనుచేర్చారు. పూలచెట్లను పొందుపరిచారు. వాటిమధ్యగా విశ్రాంతి మందిరాలు నిర్మాణించారు. మందిరాలనిండా చందనం, పునుగు, జవ్వాది, కస్తూరి, ఘటాలల్లోనిండుగా సీధూ, తాళవృంతాలూ, ఆసనాలూ సమృద్ధిగా సంతరించారు. మందిర శిఖరాగ్రాలపై మనోజ్ఞమైన ఇక్ష్వాకుల రాజచిహ్నమైన ధ్వజాలను నిలిపారు. రాత్రులు గడపవలసినచోట, రమణీయ రత్నదీపాలూ, కాగడాలూ, గాజుకుప్పెల్లో మైనపువత్తులజోతులు చక్కగాఅమర్చారు.

భోజనభాజనాల నిమిత్తం వంటశాలలు వేసి,బండ్లలో పదార్థ సంచయం భద్రపరిచారు. వినోదానికి, కాలక్షేపానికి, తగిన పరికరాలనుకూర్చారు. సంగీత సాహిత్య నృత్యాభినయ శ్రీమంతులైన కళావంతుల కార్యక్రమాలతో కరపత్రాలు లిఖించి పంచారు.

పూర్వంప్రవేశదుర్గమమైనకీకారణ్యాలు,భాసురప్రాసాదపంక్తులతో ప్రకాశించాయి. ఇసుకలో, దుమ్ముతో, ముళ్ళతో నిండినమార్గాలు,పట్టణ వీథుల్లాగా మానవసంచారయోగ్యాలైనై. జలశూన్యంగా వందలక్రోసుల విస్తీర్ణంగల ఎడారిభూములు జనపదరూపాలను సంతరించుకున్నై. అరణ్యప్రవేశ ప్రారంభప్రదేశంనుంచీ గంగానదీ తీరంవరకు కన్నుల పండుగ్గా భరతుని ఆజ్ఞానుసారం పథనిర్మాణం బాగుగా నిర్ణయించిన కాలానికి ముందే పూర్తిచేశారు. పనివారలచే పూర్తికావించబడ్డ కార్యక్రమాలను పర్యవేక్షకులు పరిశీలించారు. పొరపాటుగానీ, తొందరలో గానీ దొర్లిన దోషాలేమైనావుంటే సరిదిద్దిచక్కగానమర్థించారు.భరతుని ప్రయాణంనిమిత్తం నియమించినవారినందర్నీ ఆశించినదానికంటే అధికంగా ఇచ్చి సన్మానించారు. కాని, ఆ కార్యనిర్వాహకులు మాత్రం గ్రహించక "ఇన్నిఏండ్లుగా ప్రభువుల ఆశ్రయంలో వుచితంగా తిని, పొట్టలు పెంచుకున్నాం కాని చేసినపని చిన్నమెత్తులేదు. ఈ జన్మకు ఇంతమాత్రమైనా రామదర్శనార్థం ప్రభుపుత్రుడు తలపెట్టిన పనిలో సహకరించి మా కృతజ్ఞతనైనా చూపుకోనివ్వండి" అని బ్రతిమాలుకున్నారు. అందుకు అధికారులు ఎంతో ఆనందించి, ప్రభువులపట్ల ప్రజలకున్న విశ్వాస భక్తిగౌరవాలను ప్రశంసించి "ఇదిఆయనకుతెలిస్తే ఇంకాశోకిస్తారు. అభ్యంతరంచెప్పక పరిగ్రహించం"దని ప్రార్థించి, వారి అభిమతాలను పుష్టిగా, తుష్టిగా పూర్తిచేశారు.

ఆరాత్రి నాందీముఖం సమంత్రంగా సాగిపోయింది. సూతులూ, మాగధులూ, శ్వశ్రేయసోక్తులలో స్తోత్రాలువఠిస్తూండగా కోణాహతాలై, ఢంకాలు నినాదంచేస్తూండగా, యామికుల కరతాడితాలై, కాలసూచిక ఘంటికలుమ్రోగుతుండగా కాహళ, శంఖ, మురజనాదాలు; తూర్యధ్వానాలు దిక్కులన్నీ నిండింపగా, భరతుడే మేల్కాంచిచరచరసౌధోపరితలానికివచ్చి పరమదుఃఖంతో,"మహాజనులారా! ఈసందడి ఏమిటి?

ఈరాజమర్యాదలెవరికి? ఇక్కడ రాజేడీ? నేను నరపతినిగాను. నష్ట జాతకుణ్ని. విధివంచితుణ్ణి. రాజును తెస్తానని మీముందు మోకరిల్లి ప్రార్థించి చెప్పాను. ఈస్థితి నేను భరించలేను. నేను నాతండ్రినిఅనుస రించటం మీకు అంగీకారమైతే మీయిష్టంవచ్చినట్లు మీరు చేయండి. ఏమాత్రం మీదోషం అందులో వుండదు. నేను మీకు అవసరమనుకుంటే అన్నగారిపాలన అభిలషనీయమైతే ఆపండి. ఆయనరాగానే ఆ ఆనందం అందరంపంచుకుందాం" అని వుద్వేగంతో వుపన్యసించాడు. తమ్ముణ్ణి చూచి "సోదరా! ఎంత దుష్కాలం ప్రాప్తించిందో చూశావా? ఎవరీ భోగాలకు, రాజమర్యాదలకు, పౌరపాలనకు అర్హులో వారు అడవుల్లో ఆకులలాలుతింటూ, ఎదనీళ్ళుత్రాగుతూ, పడరానికష్టాలు పడుతుంటే' ఆయన చరణసేవకులమై, అనుగ్రహ పాత్రులైనవారిలో మనంఒకరమై వుండవలసినవాళ్ళం. అటువంటిది తలక్రిందులుకావటం, నేను కర్కశ హృదయంగల కైకమ్మకడుపున పుట్టిన కారణంచేతనేకదా? అధికారి జనకర్ణధారిలేనిఓడలాగా అయోధ్య అల్లాడిపోతూంది. ఎవరినినిందించేది? ఎవరిని దండించేది? కష్టజగత్సృష్టికి కారణంకన్నతల్లేకదా? లోకంలో ఇటువంటి దుస్థితి ఎక్కడైనావుందా? ఇందులో ఆమెను నిందించవలసిన అంశంకూడా ఏమీలేదు. ఆమెను లోకసామాన్యస్త్రీగాభావిస్తే,అనుకూలుడైన భర్తతో ఆత్మజుని అభివృద్ధికి పాటుపడిన మాతృహృదయంగా కనుపిస్తూంది. అసామాన్యగాచూస్తే ఏదో ఒక లక్ష్యంతో, ఇంతజనాపవాదాన్నీ, భర్తమరణాన్నీ భరించినట్లు తోస్తూంది. ఏది ఏమైనా నేను మాత్రం తీరనిబాధకు గురిఅయ్యాను. ప్రజలంతా పట్టంకట్టుకోమని బాధిస్తున్నారు. అది ఎన్నటికీజరుగదు. ఏనాటికైనా జ్యేష్ఠుడేరాజౌతాడు. ఆచంద్రార్కమైన యశస్సు ఆర్జించిన ఇక్ష్వాకువంశపయోనిధిలో నేను హాలాహలబిందువును కాలేను" అని చెప్పి శోకిస్తుంటే, అంతఃపుర శుద్ధాంతజనం అతనిచుట్టూచేరి పలవించింది.

వశిష్ఠులవారు ఆహ్నికవిధులు నిర్వర్తించుకుని శిష్యసమేతంగా కొలువుకూటానికి వచ్చారు. అప్పటికే రాజసభాభవనం రంగురంగుల అలంకరణలతో,రత్నస్థగిత వేదికలతోరమణీయశిల్పచిత్రకళాసంపదతో పరివార బంధుహిత మంత్రిసామంతసేనాపతి పౌరవర్గంతో పూర్వంవలె

శోభ విరియిస్తూంది. సర్వప్రతినిధిఐన మహర్షి ఆసీనుడై, సేవకుల పిలిచి వెంటనే సోదరసహితంగా భరతుని తోడుకునిరావలసిందిగా ఆజ్ఞాపించాడు. వారుపోయి గురుదేవుల సందేశం వినిపించగా, క్షణాలమీద కాల్యాలుముగించి తమ్మునితోకలిసి భరతుడు సామాన్యపౌరుడువలె పాదచారియై సభాస్థలికి వచ్చాడు. దేవతలు ఇంద్రుని ఆహ్వానించినట్లు సదస్యులంతా లేచి అభివాదాలుచేస్తూ సభావేదికపైకి ఆహ్వానించారు. సభలో ప్రవేశించి భరతుడు వేదికప్రక్క నిల్చుండి అందర్నీ ఆసీనులు కావలసిందిగా అభ్యర్థించాడు. ఆవేళశరత్కాల పూర్ణిమాచంద్రజ్యోత్స్నవలె సభామందరం కువలయానందకరంగా గోచరించింది. గురుదేవులు లేచి సభ కలయచూచి, మృగుపదభరితంగా, బహుశాస్త్రసాధకంగా, స్వీయధర్మానుసారంగా, బడబానలత్రైక్ష్ణ్యానికితట్టంకాని సముద్రంలాగా భరతుని లక్షించి, "వత్సా! నాకర్మం నేను నెరవేరుస్తున్నా.

## భరతుని పట్టభద్రుడవుకమ్మని వశిష్ఠుడు చెప్పాడు

నీతండ్రి మరణించటానికి పూర్వం తన మనోగతాన్ని రెండు శాసనాలుగా వెలిబుచ్చి, ఆతర్వాత ఆత్మవికలనంతో దేహం చాలించి దివ్యలోకంచేరుకున్నాడు. అయోధ్యావాసులు, రాష్ట్రపాలితులుఅందరూ కలసి వారికి ప్రతినిధిగా ఎన్నుకుని, నన్నీస్థానంలో వుంచారు. ఆయన శాసనాలు రెండింటిలో రెండవది గుణవంతుడూ, ధర్మపరుడూ, పితృవాక్యపాలకుడూ అయిన రాముడు అంగీకరించి అడవులకుపోయాడు. మొదటిదినీకైనిర్ణయించింది. అందుకే నిన్ను రావలసిందిగా అర్థించాను. నీచేపితృదేవుని శ్రాద్ధకర్మ దోషరహితంగా పూర్తిచేయించాను. మిగిలింది నిన్ను రాజువుకమ్మనిచెప్పటం, నీకు అభిషేకంచేయించటం" అని చెప్పి ముగించాడు. ఆపల్కులకు, అంకుశఘాతానికి అనేకపం(ఏనుగు) ఘీంకరించినట్లు, సభామర్యాదను పాటింపక, గురుగౌరవం మన్నింపక, యుక్తాయుక్తవిచక్షణచేయక, కణతలు అదురుతుండగా, పెదవులు చలిస్తుండగా, బొమలు ముడిపడుతుండగా, కులాచారాన్ని తలంచుకుని, అన్నపై రాగం పెంచుకుని, నిగ్రహించుకోలేని ఆగ్రహంతో చురచుర చూస్తూ, గురువులదిక్కై "ఛీఛీ! ఇది ఏమి సందేశం? ఈమాటల వైఖరి

ఏమీ? గురుకులవాసంచేసి,సర్వవిద్యలునేర్చి, ధర్మాధర్మాలెరింగి,మంచివాడని,మతిమంతుడనీ లోకులచే గౌరవంపొందినవాడెవడైనా, అతనికే గౌరవస్థానమైనవాని హక్కుని అభిలషిస్తాడా? సత్యసంధుడైన పంక్తిరథునిపట్టినై, రామునిసోదరుడనైన ఆయనరాజ్యాన్ని అపహరించేటంత పాపజాతివాడినా? పుట్టుకచేతనేకాక అన్నిట్లో కనిష్ఠుడనైన నేను అన్యాయంగా అడవులకు నెట్టబడ్డ అన్న వారసత్వాన్ని ఆక్రమించమని మీకు నోరెట్లావచ్చింది చెప్పటానికి?

సగరమాంధాతృదిలీపనహుషోపముడైన, రఘువంశ ముక్తాహార తరళం రామచంద్రుడు సహోదరుడై కానల్లో కందమూలాలు తిని గడుపుతుంటే, భర్మహర్మ్యాలల్లో, తేర తేరగ తిని, కాలుపైకాలు వేసుకుని, విలాసాలల్లో విర్రవీగటానికి దాశరథి,అంతదుర్మార్గుడా,కన్నావిడచేసిన కర్మఫలానికి నేను కర్తనుకాలేను. నా అన్నలకు ఇక్కడనుండే నేను నమస్కారాలుచేస్తున్నాను. అనుపూర్వకంగా వచ్చే ఆచారం జరగవలసిందే. సూర్యచంద్రాదుల గతి తప్పినా, భరతుని గతిమాత్రం తప్పదు" అంటూ ఆవేశంలో ఆగాడు. "భరతా! మేం విరాగులం. మాకోరిక లోకకల్యాణం. వాంఛలు మాకులేవు. మేం రాజసేవ అంగీకరించామంటే, అధికారానుభవాలకోసం కాదు మీ పూర్వులు మమ్మర్థించారు. ప్రభువులు సాకారంకొన్న దైవాలు. వారిని కించపరచరాదని సమ్మతించాం. మేం ఎన్నటికీ రాజకీయాల జోలికిపోము. వారు కోరితే అంతవరకే ఆపని చేస్తాం. ప్రజలంతా నన్ను నీకు చెప్పమంటే, వారికోరికా, రాజశాసనం ఒక్కటే కనుక నీకుచెప్పాను. దానికి నీవు అంగీకరించవచ్చు. తిరస్కరించవచ్చు. ఆ అధికారం నీకువుంది. చెప్పమన్నది చెప్పాను. నిర్బంధించలేదు. నీవు కష్టంలోవున్నావు. నా అంతేవాసివి. ఇందులో నేను నిమిత్తమాత్రుణ్ణి. నీ ఇష్టానుసారంగా నీవు ప్రవర్తించవచ్చు. నా పని పూర్తిఅయింది. ఆశ్రమానికి పోతున్నాను" అంటూ వశిష్ఠుడు లేవగానే, తుపానుకు సముద్రంవలె సభ కల్లోలమైంది. భరతునికి, గుండెల్లో కోటి బాకులు దూసినట్లైంది. చేసిన పొరపాటు చెంపపైచెళ్ళున కొట్టినట్లైంది. తలతిరిగినట్లైంది. పైనున్న పంచే నడుముకు చుట్టుకుని గురువుల పాదా

లను కన్నీళ్ళతో కడిగాడు. "గురుదేవా! తల్లిదురాగతం, తండ్రిమరణం,
అన్న అరణ్యవాసం కలసి నన్ను జీవచ్ఛవాన్ని చేసినై. ఏదో అకార్యం
జరుగబోతున్నదన్న ఆవేశంలో, ఒడలు తెలియనివుద్వేగంలో, ఘోరంగా
మిమ్ము అవమానపరిచాను. అనరాని మాటలన్నాను. ఆగ్రహంమానిఅను
గ్రహించండి" అని ఆక్రోశించాడు. "వత్సా! లే! ఇది శోకించవలసిన
సమయంకాదు. నిగ్రహంతో, ఒక వంకరాజ నీతి, ఇంకో ప్రక్క వంశా
చారం, మరోవైపు ధర్మం, వేరొకవైపు ప్రజాభిప్రాయం పరిశీలించే
సమయం. నాకు వేళకావస్తున్నందున వెళ్ళటానికి లేచాను. కాని, నీపై
కోపంతో కాదు. దానికీ, నాకూ చాలాదూరం. వర్తమానంలో రాజ
కుటుంబంలో పెద్దవాడవు నీవే. జరుగవలసిన కార్యం మంత్రులతోఆలో
చించి నిర్ణయించు" అని హితోపదేశంచేసి లేవతీశాడు. లేచిన భరతుడు
"గురుదేవా! ఇందులో మంత్రాంగంతో పనిలేదు. ఈసభా సమక్షంలో,
మీ అంగీకారం కొరకు నేను నిర్ణయించుకున్నది మనవిచేస్తాను. ఎన్నటికీ
నేను అన్న గద్దెపై ఆసీనుణ్నికాను. అన్న సన్నిధానానికిపోయి ఆయన
కాళ్ళపైబడి అయోధ్యకు ఆహ్వానిస్తాను. అక్కడకానీ, ఇక్కడకానీ,
అయోధ్యాపతిగా అభిషేకిస్తాను. సోదరులం ఇద్దరమూ ముందే నిశ్చయం
చేసుకున్నాం. అప్పుడే అయోధ్యనుంచిగంగాతీరం వరకుబాటలన్నీబాగు
చేయించేఏర్పాట్లుచేశాను. ఈ మహాయాత్రకు అందరూ అర్హులే. అన్న
రాకపోతే ఈఇద్దరూ ఆ తమ్మునివలెనే అడవిలో జీవిస్తారు. అంతేకాని
నేను పాలిస్తానని పౌరులు ఏ మాత్రం ఆశించవద్దు. సుమంత్రా! నీవు
నా రథంసిద్ధంచేయి. మహామాత్యులారా! నిన్నటి నిర్ణయం ప్రకారంసర్వం
సిద్ధంచేయండి" అంటూ ఆత్మాభిలాష అందరికీ తెలియపర్చాడు.

అది విన్నప్రజలంతా ఆనంద బాష్పాలురాల్చారు. గురుదేవులు
భరతుణ్ని చెంతచేర్చుకుని ఆశీర్వదించారు. ఆ శుభవార్త ఆనోటా,
ఆనోటా అయోధ్య అంతాప్రాకింది. పోయిన ప్రాణాలు లేచివచ్చినట్లై,
పూబోడులంతా గృహసమ్మార్జనం మొదలుగా అన్ని కార్యక్రమాలు
క్షణాలమీద ముగించి, భర్తలరాకకు ఎదురుచూస్తున్నారు. ఏ వాహనాల
మీద పోవాలో, ఏమేం తీసుకుని పోవాలో, ఏ విధంగా అలకరించు
కోవాలో, ఏఏ పదార్థాలు పచనంచేయాలో, నిలుచుండే నిర్ణయాలు తీసు

కుంటున్నారు. సభ్యులంతా, భరతుడు వెలిబుచ్చిన అభిప్రాయానికి కరతాళ ధ్వనులతో అంగీకారం సూచించారు. దాశరథులు, ఒకరికి మించిన గుణవంతులూ, త్యాగమూర్తులూ, సత్యప్రియులూ, ప్రజారంజకులూ ఒకరని శ్లాఘించారు. రామదర్శనం అయినట్లే భావించారు. మళ్ళీ అయోధ్యకు మహోదయం వచ్చిందని మనసారా నిట్టూర్చారు. ఆరిపోతున్న దీపం ప్రమిదెలో ఆముదం పోసినట్లు అందరి హృదయాలల్లో వుత్సాహ ధైర్యాలు వచ్చినై. అందరివద్దా సెలవుతీసుకుని భరతుడు ఆనాటికి కొలువు చాలించాడు. భరతుని గుణసంపదలను మెచ్చుకుంటూ "అన్నిట్లోనూ అన్న పోలికలు కొట్టవచ్చినట్లుగో చరిస్తున్నై" అనుకుంటూ, విప్పారిన మొగాలతో గృహిణులకు ఈ వార్త చెప్పాలన్న కుతూహులం తొందర పెట్టగా ఇండ్లకు చేరారు.

## శ్రీరాముని తోడితెచ్చుటకు భరతుడు ప్రయాణించుట

ఆ రాత్రి అయోధ్యావాసులంతా సుఖసంతోషాలతో నిద్రించారు. కైకేయి శయనమందిరం చేరింది. చేసిన కార్యాన్ని సింహావలోకనం చేసింది. ఈ పరిణామం, వస్తుందని తాను ముందే వూహించింది. శత్రుఘ్నుడు మంథరను తన్నటమేకాక తనపైకి వచ్చినందుకూ, భరతుడు చూస్తూ నిల్చున్నందుకూ బాధపడ్డది. కనులు మూసుకుంది. కలత నిద్రలో ఒక కల వచ్చింది. ఏదో ఒక తేజం తనలోనుండి వెలికివచ్చి అందమైన స్త్రీ ఆకారం పొందింది. ఆ మూర్తి తన్ను వుద్దేశించి ఏమో చెపుతూంది. "కేలవతీ చింతపడకు. తీగలాగితే డొంక కదిలినట్లు, ఈ జరిగిన సంఘటనకు నీవు నిశ్చయంగా నిమిత్తమాత్రవే. అసలు కారకులు అమరులు. లోకం నిన్ను నిందించినా, ఆ నింద అమరులకే చెందుతుంది కాని నీకు చెందదు. ఇంద్రుని ఆజ్ఞానుసారం వచ్చిన దివ్యశక్తిని. నన్ను "విచిత్తి" అంటారు. నీలో ఆవేశించి ఇంత చేయించింది నేనే. ఇంకో శక్తి చిత్తి. ఆమె మంథరలో వుంది. మా కార్యం ముగిసింది కనుక ఇక మేం దివ్యలోకాన్ని చేరుకుంటాం. నీ హృదయంలో ప్రజ్వరిల్లుతున్న పాతివ్రత్యాగ్ని నన్ను కాలుస్తూనే వుంది. నేను అమరశక్తిని కనుక కాలుతున్నా బ్రదికాను. అసలు నీవు అందుకే జన్మించావు. నీ పూర్వజన్మం దేవగణంలో దే

నీ భర్త నిన్ను పరిత్యజించానన్నా. నీ ఒడ్డ విడిచిన పిండోదకాలు నేను స్వీకరించనన్నా, అవి ఆగ్రహంలో అన్నమాటలే కాని, అసువులు వీడే సమయంలో తనతప్పు తెలుసుకుని పశ్చాత్తాపంతో సదభిప్రాయం కలిగింది. అందుచేతనే భరతునిచేత చేయించినకర్మఫలితం ఆయన్ను ప్రేత రూపంనుంచి దివ్యరూపానికి మార్చింది. ఆ విధంగానే, ఆయన్ను భర్తగా సేవించిన నీకు ఆయన చేసిన సుకర్మల్లో అర్ధఫలం నీకువస్తుంది. దేహత్యాగానంతరం దేవలోకంలో, నీకు దివ్య సుఖాలన్నీ చేకూరుతై. విచారించవద్దు. దేవతలంతా సత్య ధర్మాల ప్రతిమూర్తులే కదా? ఇటువంటి దారుణ కార్యాలకు ఎందుకు పాల్పడతారని శంకనీకురావచ్చు. దాన్నే దేవరహస్యం అంటారు. ప్రజలంతా సుఖజీవనం చేయాలంటే దుష్ట శిక్షణం, శిష్ట రక్షణం జరగాలి. అది భగవంతుడే చేయాలి. చేయాలంటే సాకారుడు కావాలి. ఆ ఆకారం సత్ క్షేత్రంలో రావాలి. పుణ్యవతులు కావటంచేత, పుత్రవతులయ్యే వయోధర్మం మీకు పోయినా, దివ్యశక్తులతోడ్పాటుతో నాల్గుమూర్తులుగా మీకుజన్మించాడు. ఆయనలో అర్ధాంశగల జ్యేష్ఠుడు రాజపాలనలో వుంటే రాక్షస సంహారంజరగదు. లోకాలన్నీ ఇప్పుడు వారల క్రూరకార్యాలతో నిండి పోతున్నాయి.

ఎందుకు అవతరించాడో అదినెరవేరదు. అందుకేపట్టభంగంచేసి అడవులకు పంపాం. ఈపద్నాల్గు సంవత్సరాలలో పూర్తిగాదుష్టరాక్షస సంహారం జరిగిపోతుంది. దేనికైనా కార్యకారణ సంబంధం వుండాలి. అదిశరీరధర్మాలనూ,లోకధర్మాలనూ అనుసరించివుండాలి.దానికికారణ బీజాలు వరరూపంగా నీలోవున్నై. వాటినే వినియోగించుకున్నాం. నేను నిన్నాశ్రయించి ఈ నిందకు నిన్ను పాత్రురాలను చేశాను కనుక, ధర్మ సూక్ష్మం తెలిసిన లోకంలో నీకార్యం ధర్మబద్ధంగా గ్రహించబడి కీర్తి కారణంఅయ్యేలాగా అనుగ్రహిస్తున్నాను" అనిచెప్పి అదృశ్యఅయింది. ఆలకించిన కైకకు నిద్రాభంగం కలిగింది. లేచి కూర్చున్నది. "తనభర్త మరణించాడనీ, తానిప్పుడు విధవ" అనీ గురుతువచ్చింది. మతిచెడిపడి పోయింది మంచంపై. తెల్లవారకముందే సోదరులు లేచి వుచిత విధులు ముగించుకుని కైకేయీ శయనమందిరానికి పోయారు. ఆమె ఇంకా లేవ లేదు. తలుపులుతెరచి చూశారు. భరతునకు పూర్వపు తల్లివలెనే కను

పించింది. ఆమెలో కాఠిన్యంలేదు. కర్కశత్వంలేదు.గయ్యాళితనంలేదు. పెదతల్లి పొందిన ఆవేదనంతా ఆమెలో గోచరించింది.భయంతో ఆమెను పలుకరించారు. ఆమెలేచి కొడుకును చూచిగోలుగోలున ఏడ్చింది. ఎంత మార్పు! తల్లిని ఓదార్చి తానువచ్చిన పని తెలిపాడు. "నాయనా! గత జలసేతు బంధనం కాదిప్పుడు,నేనూ వస్తున్నాను. ప్రయాణ సన్నాహం చేయించు" అన్నది. వెంటనే సోదరునితోకూడి ద్వారంవద్దకువచ్చారు. రథం సిద్ధంగా వేచివుంది. పల్లకీ తెమ్మని పనివాళ్ళకుచెప్పి మెట్లు దిగుతుండగా, తెల్లని గుడ్డలుదాల్చి, తలపైముసుగుదాల్చి కైకేయివచ్చింది. ఆలంబనంతో క్రిందికిచేర్చి, పల్లకీ ఎక్కించి, తాను తమ్మునితో రథం అధిరోహించాడు. రథం రాజవీథి చేరింది. జనసముద్రం పొంగింది.

రాముడు అడవికి పోయేటప్పుడు రమణులే వెంటపోయారు. భరతుడు పోయేటప్పుడు రమణీమణులుకూడా వెంట నంటారు. ముందు కరిఘట (ఏనుగుగుంపు) నడిచింది. తరువాత అశ్వికదళంవెన్నంటింది. రథికులు తొమ్మిదివేలమంది,అరువదివేలమందికాల్బంటులూ,నడిచారు. ముగ్గురు రాణులూ పల్లకీలలో ప్రయాణించారు. మంత్రిమండలి, సేనానాయకులు, వశిష్ఠవామదేవాదిమహర్షిశ్రేష్ఠులు, భూసురోత్తములు, కళాకారులు, విద్వాంసులు,గణకులు మొదలైనవారు తమకు ఏర్పాటుచేసిన వాహనాలపై బయలుదేరారు. వారివెనక భాగంలో, వైశ్యులు, రత్నకారులు, కుమ్మరులు, కమ్మరులు, కంసాలులు, కంబళకులు, సాలీలు, రంపగాండ్రు, గందవొడివారు, ఛేద్గాష్ల,వినతక్రవారు,సంవాహకులు, రజకులు, క్షురకులు, కుట్టుపనివారు, యాదవులు, వైద్యులు, మల్లులు, బెస్తలు మొదలైనవారుసాగారు.దారిపొడుగునా,సీతారామలక్ష్మణభరతశత్రుఘ్నుల గుణగణాలను, కథలు కథలుగా అల్లుకుని ముచ్చటలాడుకుంటూ, నడుమ నడుమవిశ్రాంతిని కైకొంటూ, కతిపయదినాలకు,గుహపాలితారణ్య రాజధాని శృంగిబేరం చేరారు.

అక్కడ గంగాతీరంలో విడిదిచేశారు. భరతుడు, "ఈదినం ఇక్కడ విశ్రాంతి కొందాం. నాపితృదేవునికి గంగానదిలో అస్థినిమజ్జనం చేసి నివాసం ఇస్తాను. మీమీ అనుకూలస్థానాల్లో విశ్రాంతిని పొందండి." అని యాత్రికులందరికీ ఆదేశం ఇచ్చారు. తనకై నిర్మించిన గుడారంలో

ముగ్గురు తల్లులతో ప్రవేశించాడు. పిమ్మట గంగకువెళ్ళి సమంత్రకంగా అస్థిమజ్జనంచేసి, పిండ తిలోదకాలు ఇచ్చాడు. స్నాతుడై, తమ్మునితో విడిది గృహానికి చేరి విశ్రాంతి పొందాడు.

## గుహుడు భరతుని రాకను అనుమానించుట

కొందరు బోయలు శృంగిబేరాధిపతియైనగుహుని సన్నిధికివచ్చి, "నేల ఈనినట్లు సైన్యంతో ఎవడో రాజు మన పొలిమేరల్లో దిగాడు" అని వార్త చెప్పారు. గుహుడు కొంతసేపు ఆలోచించి, ముఖ్యుల వెంట బెట్టుకుని, ఉపాయనములతో, విడిసినప్రదేశానికి వచ్చాడు.దూరంనుండి పారచూశాడు. ఆకాశం ఎత్తున ఎగురుతున్న కోవిదార కేతనం (కొండ గోంగూర పువ్వు లేక, కాంచన పుష్పం) కనుపించింది. అడవి అంతా సేనామయంగా వుంది. "మంత్రీ! చూశావా భరతుని దుర్బుద్ధి? ఈ రాకకు కారణం ఏమిటో ఎరకచేస్తావా? నేనెరిగినంత సెపుతుండాను. మనం రామయ్యకు ఆయినవోళ్ళం.ఆళ్ళను గంగ దాటించిదారిచూపాం. అందుకని మనమీద కత్తికట్టైనావుండాలె, కాకపోతే,రాజ్యంతీసుకున్నా, గడువుదాటాక, కయ్యానికి దిగొచ్చునని రామయ్యను ఈడనే కందనం సేయాలనసైనా వుండాలె. లేకుంటే ఇంత బలగందేనికి? ఏమైనామనం ముందుగా మంచిగాపోయి మర్యాదలు నడుపుదాం. అంత అవసరమైతే ఆపై సూసుకుందాం. ఏమంటవ్?" అని గుహుడు అడిగాడు. "దొరా! నాకుసూడగా ఈ దొర అందుకు వచ్చినట్టులేదు. సెప్పకుండా, సేయకుండా,తప్పులేకుండావందు తెత్తాడా? పెజలంతాఏడుకుంటే పెద్దదొరను సూడ్డానికేమైనా పోతుండాడేమో"అని మంత్రి సమాధానం చెప్పాడు.

"మంత్రీ! నీవుసెప్పిందాంటో కూడా కొంత సత్తెంవుంది. ఎందుకైనా ఆయనకాడికి పోవటమే అన్ని ఇసయాల్లోనూ మంచిది" అంటూ భరతుని విశ్రాంతి మందిరానికి వచ్చారు. వీరి రాకను దూరంనుండే గుర్తించిన సుమంత్రుడు ఎదురుగాపోయి.గౌరవమర్యాదలతోతోడ్కొని వచ్చి,భరతునకు ఈ సంగతి చెప్పాడు. భరతుడు "ఈతడు శృంగిబేరం రాజా? నన్ను చూడవచ్చాడా? మనం వచ్చినట్లు తెలుపలేదు గదా? ఆయనకు ఎలా తెలిసింది?" అని మంత్రిని ప్రశ్నించాడు. "ఈయన

మీ అన్నకు మిత్రుడు.అడవికి పోయేముందు ఆతిథ్యం తీసుకుని,జడలు దాల్చింది ఇక్కడే. ఈ అరణ్యంలో అతనికన్నుగప్పి ఏ ప్రాణీ ప్రవేశించలేదు. ఈతనికి నీవుదర్శనమిచ్చి ఆప్యాయంగా అడిగితే అన్నవున్న చోటు శ్రమలేకుండా చెపుతాడు. అవసరమైకోరితే అనుచరులనుమనతో పంపుతాడు. ఇతని సాయంలేకుండా గంగానది దాటటం కష్టం"అని మంత్రి ప్రత్యుత్తరం ఇచ్చారు.

## గుహుడు భరతుని చూచుట

"నీవుపోయి వుచిత మర్యాదలతో లోనికితీసుకునిరా"అనిచెప్పగా సుమంత్రుడు గుహుని సబాంధవంగా విడిదిలోనికి కొనివచ్చాడు.బోయ రాజు రాగానే భరతుడు లేచి ఆహ్వానించాడు. గుహుడు వెంట తెచ్చిన పసదనం సమర్పించి, నమస్కరించాడు. కుశలప్రశ్నానంతరం గుహుడు "అయ్యా! రాక రాక మా ప్రదేశానికి వచ్చారు. ఇక్కడ చూడదగిన విశేషాలెన్నోవున్నై. అయన్నీ సూసి ఆయాసం తీర్చుకుని పోవచ్చు. ఏ ఇశేషం లేకుండా ఇంత దూరంరారు. తమరు దయసేసిన పనేమిటో సెలవిత్తారా?"అని అడిగాడు. అందుకు భరతుడు తన రాకను గూర్చి ఇలా తెలిపాడు. "మిత్రుడా! గతం అంతా నీకు తెలిసిందే. ఇప్పుడు నా అన్నలను అయోధ్యకు ఆహ్వానించటానికే వెళ్ళుతున్నాను.అందుకు నీ సహాయంకూడా కావాలి" అని. ఆ మాటలు విని "ఎంతమాట దొరా! మేం ఎప్పుడూ మీ వోళ్ళమే, మా సేతనయింది మీ కెప్పుడూ వున్నట్టే. సెప్పు దొరా. తలతో సేత్తా" అని బదులు గుహుడు చెప్పాడు. చూచే వాళ్ళకు వారి కూడిక రామ గుహుల కూడికలాగే కళ్ళపండుగ్గావుంది.

"రేపు వుదయం మేం గంగదాటిపోవాలి. అందుకుతగినఏర్పాట్లు చేయించు"అంటూ భరతుడు ముక్తసరిగాఅన్నాడు. "సరేదొరా!తమర్ని మళ్ళీ కలుసుకుంటా" నంటూ గుహుడు బంధువులతో వెళ్ళిపోయాడు. "ఏమయ్యా! మంత్రీ! ఇది నిజమేనంటావా? ఎటొచ్చినా ఇబ్బంది వుండదు.నీవుపోయి మనబలగాన్ని ఈ తీరంపొడుగునానదిలో కాపుండమని చెప్పు. అయిదొందల పడవలలో, మాంసం, పళ్ళు, తేనె, ఎదురు బియ్యం, కట్టెలు ఎక్కించి పడవ పడవకూ వందమంది పోటుగాళ్ళను

వుంచి సిద్ధంగా వుంచు. పో. నేనేదైనా గురుతు సూపిత్తే వాళ్లు నడిగంగ లోకి రాగానే మీపని మీరు చూసుకోండి. నేను మళ్ళీ భరతయ్యను కలుసుకుంటా" అని చెప్పి ఆవాసానికిపోయి, భోజనాదులు పూర్తి చేసుకుని, దాశరథి దర్శనార్థం వెళ్ళాడు. భరతుడు, తమ్మునితో, సుమంత్రుడితో, అడవిరాజు రాకకు నిరీక్షిస్తూ వున్నాడు. ఇంతలో ప్రతీహారి గుహుడు వచ్చిన సంగతి చెప్పగా, లోనికిపిలిపించాడు. రాగానే భరతుడు "పూజ్యుడా! మా ప్రయాణం గూర్చి ఆలోచించావా?" అని అడిగాడు. గుహుడు "ఈయన తొందర సూత్తే అంత మంచిగా తోసటంలేదు. ఎంత గొప్పోరైనా, నాజాగాకువచ్చి, నన్ను సుల్కనగా సూత్తుండదు. నేసిరికిందోడినా? అడుగుతా. సరిగా జవాబు సెపుతాడా సరే, లేకుంటే, నేనెంతోడినో ఒక సేయి సూపుతా" అని మనస్సులో అనుకుని, గంభీరంగా-

## గుహుడు భరతుని అనుమానించి అడుగుట

"దొరా! మీమాటకుముందు నామాటికి జవాబు సెప్పండి. మీరు నాతో సెప్పినమాట నమ్మదగినదేనా? నిజంగా సెప్పండి. లేక మా రామయ్య, నీపాలనకి ఎప్పుడైనా అడ్డొత్తాడేమోనని ఆయన మీదకి పోతూండావా? ఆయనకోసం పోతూంటే ఇంతమందీ, మార్బలందేనికి? నూ సేవాళ్ళకి కయ్యానికిపోయేవోడిలాకనపడుతుందవు. ఎంతోదొచ్చినా, నన్నుకాదని గంగమ్మ తల్లిని గడిసిపోలేదు. మా పేణా లిచ్చైనా మా దొరని కాపాడుకుంటాం. నాకు ఈ లోకంలో రామయ్య ఒక్కడే దిక్కు. మంచి బుద్ధితో వచ్చావో మాయంత మంచోళ్ళులేరు. నీబలగానికి ఈడ ఏలోపంరాదు. అన్నీ ఈడవున్నై. సిటికెలో అన్నిసిద్ధం అవుతై, దొరా: నీవూ, నీవోళ్ళు కడుపునిండా సంజి, కళ్ళనిండా నిదరపోండి. పొద్దుపొడిసేసరికల్లా మీరంతా గంగమ్మ వొడ్డున వుండండి. సూరయ్య నెత్తినెక్కి ఏలకుఅతలవొడ్డునదిగుతారు. మాకుమనుసే కాని మాటలు రావు. అనుమానం పడ్డందుకు ఆగ్రంవొద్దు" అన్నాడు. భరతుడు లేచి గుహుని రెండుచేతులూ పట్టుకుని "మిత్రుడా: నిజంగా నీవు ధన్యులలో ధన్యుడవు. నీసంగతి మామంత్రి చెప్పాడు. కఠిన కర్కశ హృదయం గల జాతిలోపుట్టి అడవుల్లో క్రూరమృగాలతో కూడివుండే అడవిదొరకు

నీకే రామయ్యమీద ఇంత మిత్రభావం, భక్తివిశ్వాసాలూ వుంటే, ఒక పాయస భక్షణంవల్ల ఒకే తండ్రికి జన్మించిన వాళ్ళకు శత్రుభావం ఎలా వుంటుందీ? ఆ పాపభావం జన్మజన్మాంతరాలకు నాకే కాక ఎవరికి కూడా రాకుండు గాక. మా రెండో అన్ననే అనుమానించి, అతనితో పాటు ఆ రాత్రంతా అన్నరక్షణ చేసిన నీవు నన్ను అనుమానించటంలో ఆశ్చర్యంలేదు. అన్న దర్శనంకోసం అయోధ్యావాసులంతా అల్లాడి పోతున్నారు. నా తండ్రిమాట మన్నించి నాకోసంఆగారు. నాసంకల్పం తెలుసుకోగానే అందరూ ఆనందంతో వచ్చారు. మేం అగ్రజుని వియోగాగ్నిలో కాలిపోతున్నాం. ఆయన్ను అక్కడే అభిషేకించి, అయోధ్యా పతిగానే తీసుకుని వెళ్ళాలని అందుకు వలసిన సర్వసంభారాలూ వెంట కొని వచ్చాం. నన్ను పునఃపూర్వకంగా విశ్వసించు" అని కౌసల్య విశ్వసించటానికి చేసిన ప్రతిజ్ఞలన్నీ చెగాడు. తర్వాత—

"అరణ్యపతీ! అతి వేలంగావున్న ప్రజాసమూహానికి ఆతిథ్యం ఇస్తానన్న నీ ఆదరణే చాలు. "అన్నం జాములో జీర్ణం అవుతుంది. ఆదరం శాశ్వతంగా వుంటుం"దని ఆర్యోక్తి. మేం ఈ ప్రదేశానికి క్రొత్త వాళ్ళం.నీసాయంలేకుండా నిజంగా గంగావతరణం మాకుసాధ్యంకాదు. అడవి దారులకు అపరిచితులం, అందులో భయంకరారణ్యం. భరద్వాజాశ్రమంవరకు మాకు దారిచూపు" అని అడిగాడు. కొండెక్కినంత సంతోషంతో గుహుడు భరతుణ్ణి పొంగివస్తున్న ప్రేమతో గాఢంగా కౌగిలించుకుని"దొరా. నేగాదు నీవే అదృష్టవంతుడివి. కడుపులో నీల్లు కదలకుండా ఇంత భూమండలం సేతికి సిక్కితే ఎవడిడిసి పెట్టులాడు? దొరా! నేను లోకంబుద్ధితో సూసినందుకు బాగా బుద్ధి సెప్పినావు. నీవు మనసులో ఏం పెట్టుకోకు. నాసంతోసం సెప్పేందుకుశాతకావటంలేదు". అని అగ్గించాడు. సూర్యాస్తమయం అయింది. యామిని వచ్చింది. గుహుడు, సైన్యసమేతంగా ఆతిథ్యం అందరికీ ఇచ్చాడు. భరతుడు తన మందిరంలోనేమిత్రుణ్ణి వుండమనికోరాడు.ప్రక్కచేరాడే కాని భరతుడు స్థిమితపడలేదు. ఒయటి కారుచిచ్చు కాలుస్తుంటే, కోటరంలోవృద్ధ వహ్నిశకటం రాజి రాజి లోపల కాలుస్తున్నట్లువున్న వృక్షంలాగా కుమిలి పోతున్నాడు. సూర్యకిరణాలు సోకి మంచుకరిగి ప్రవహించినట్లు శోక

తప్తమైన శరీరం స్వేదజలాన్ని పారిస్తున్నది. రాముడు తన రాకసు హరిస్తాడా? అన్న శంక రాళ్ళగుట్టలుకాగా, వూర్పులు ధాతువులుకాగా, దైన్యం తరువులు కాగా, దుఃఖం సారంగ సముదయంకాగా, మోహం మృగసంతానం కాగా, అసహనం ఓషధులు కాగా పర్వత మధ్యంలో పడ్డ ప్రాణివలె, దిక్కుతెలియక, దీర్ఘ నిశ్వాసాలుచేస్తూ, తోటి పశువుల దూరంచేసుకున్న వృషభంలాగా దుఃఖించసాగాడు.

## గుహుడు భరతునకు సౌమిత్రి వృత్తాంతం తెలుపుట

మిత్రుని శోకం చూడలేక, గుహుడు పూర్వాపరాలు సమీక్షిస్తూ, యథాలాపంగా లక్ష్మణవృత్తాంతం మొదలుపెట్టి "నేనుముగ్గురికీపడకలు ఆకుల్తోకూర్చాను. పడుకోమంటే, లచ్చుమయ్య ఏమన్నాడో తెలుసా? మిత్రుడా! కంటికి కూర్కెట్లా నాకు వత్తది? ఈలోకాల్నే ఏలేవోర యీద రాలమీద పడుంటే, నేను కులాసగ నిదరపోతానా? ఎందంటే యెరగని అమ్మోరు ఇంత కట్టంలో అయ్యతో అడవుల్లో వుంటే, సూద్దానికే ఇదిగావుంటే, ఏంనిబ్బరం సూసుకుని పడుకుంటాను?మనం ఒకర్నొకరు నమ్మలేకుండావున్నాం. అందులో ఏం తప్పులేదు. ఆయన మనిద్దరికీ ప్రాణం. అమ్మోరు సరేసరి. ఆయనమళ్ళీ ఇంటికి సేరుకునే లోపల అయ్య బతకటం అబద్దం. తమ్ములిద్దరూ సావుపనులు ముగించి ఆయిగారాజ్జెం అనుబవిత్తారు. మాఅన్నకూ, వదినకూ, ఎప్పటికి మంచి కలుగుద్దో తెలవదు." అనిచెప్పి ముగించాడు. తెల్లవారినతర్వాత జడలు ధరించి తను ఎక్కించిన నావపై నది దాటాడని కూడా చెప్పాడు. తన పనివాళ్ళు శ్రమలేకుండా వారినిచూసుకుంటూ,ఒడ్డుచేర్చి,తరువాత ఎటు వెళ్ళిందీ, ఏమిచేసిందీ కూడవారికి తెలియకుండా తెలుసుకునివచ్చారని వాక్రుచ్చాడు. సీతారాముల రక్షణలో,పరిచర్యలో,లక్ష్మణుడుచూపించు తున్న శ్రద్ధ అసామాన్యమనీ, అసలు నిద్రాహారాలే మానేశాడనీ, నీరు మాత్రం ప్రాణరక్షణకు త్రాగుతున్నాడనికూడా వివరించాడు.అతనిలో, తన్నుకూర్చిగానీ,తనతల్లిని కూర్చిగానీ భార్యను గూర్చిగానీ ఆలోచనే లేదనీ, అంతా రామమయమని భావిస్తున్నాడనీ విశ్లేషించాడు. ఆలోచిస్తే

ఆయన లౌకిక భావానికి అందే స్థితిలో లేదన్నంతగా తన భావం తెలుపుకున్నాడు.

## గుహుని మాటలు విని భరతుడు సంతపించుట

మిత్రుడు చెపుతున్న మాట మాటకూ భరతునిలో ఆ దృశ్యాలు రూపుకట్టి ఇంకా శోకం అధికం కాజొచ్చింది. అయోధ్యలో తండ్రి తమపై మమకారంకొద్దీ కూర్చిన సుఖాలూ, అందులో అన్నకు అధికారికంగా కల్పించిన భోగాలూ, వివాహానంతరం ఆయనగార్హస్థ్యధర్మాలకూ, సంసార సుఖాలకూ అనువుగా నిర్మించిన హర్మ్యాలూ, పుష్పవనాలూ, అందులోవారు అనుభవించిన రీతులూ, అన్నీ ఒక్కసారి హృదయంలో మెదిలి కుప్పకూలిపోయాడు. బరువు బండిలాగే వృషభం కాలుపట్టు దొరకక బురదలో పడ్డట్టుపడి మూర్ఛిల్లిన భరతుణ్ణి కౌగిలించుకుని శత్రుఘ్నుడు ఘోరంగా వాపోవసాగాడు. ఆ శోకానికి శిబిరం లోపల వున్న ముగ్గురు తల్లులు గబగబవచ్చి మూర్ఛిల్లిన భరతుణ్ణీ, ఒడలు తెలియక ఏడుస్తున్న శత్రుఘ్నుణ్ణీ చూచి సహింపలేని బాధతో సంతాపించారు. ఎట్టకేలకు కౌసల్య తెలివి తెప్పించుకుని, భరతుణ్ణి తన ఒడలికి గట్టిగా చేర్చి పట్టుకుని "బిడ్డా! నీమీద ఆశలు పెంచుకున్న మమ్మల్ని ఏమి చేయతలిచావు? అకస్మాత్తుగా శరీరారోగ్యం చెడిందా? లేక నీ అన్నయ్యల గురించి కాని, నీ వదినను గురించి కాని ఏదైనా శంకావహమైన వార్త వచ్చిందా? అయోధ్యకు వచ్చిందగ్గరనుంచీ వేళకు అన్నపానాలులేక, నిద్రలేక కృశించిపోయావు. అన్నలను తీసుకునిరావాలనే కదా వచ్చావు. ఇంతలోనే అనర్థం ఏమి వచ్చింది? పరమేశ్వరా! నిండు నీటి కుండకు ఎన్ని రంధ్రాలు కొట్టావు? ఇంకా తృప్తి కలగలేదా? తండ్రీ! నీ జనకుడు స్వర్గంచేరాడు. అన్నలు అడవిలోవున్నారు. వున్న మీరిద్దరూ ధైర్యంచెడి, కర్తవ్య హీనులైతే మా గతి ఏంకావాలి? మమ్మల్ని ఓదార్చేవారెవరు? మేంఎవర్ని చూసుకుని బ్రతకాలి? లే, నాయనా! లేచి, మమ్మల్ని మళ్ళీ ప్రాణాలతో వుండేట్లు చూడు" అని భర్తృశోకార్దితా, ప్రవాసకృశా, పుత్రవియోగకౌసల్య ఆదరణవాక్యాలతో బుజ్జగించగా భరతుడు సేదదేరి, తల్లుల సముదాయించి, గుహుణ్ణి చూచి-

## భరతుడు గుహుని చూచి రామాదుల నిద్రాహార విషయాలను గూర్చి అడుగుట

''నివాసిత నిరంతర రామహృద్గుహా! గుహా! వనపతీ! అన్న
దైనందిన చర్యలు వినాలని ఆతురతగా వుంది. ఆ రాత్రి ఆయన ఏ
భుజించాడు? ఎక్కడ శయనించాడు? ఏం అన్నాడు? పరమసుకుమా
మా వదినె పరుండిన దెక్కడ? చిన్నన్న ఏంచేశాడు? ఆ సంగతుల
వింటూ రాత్రిగడుపుతా. విడువకుండావివరించు''మని వేడుకున్నాడు
గుహుడు ఆనందంతో,''అంతకంటెనా కేంకావాలెదొరా!మారామయ్యన
గురించి ఎంత సెప్పినా, ఏం సెప్పినట్లవుద్ది. ఇంకా వుంటది. సెబుత
యిను'' మంటూ, ''ఆదర్శ సోదరా! అగ్రజ చరణవినీతా! భరతా
రాక రాక వచ్చిన మిత్రునకు, మధుర ఫలాలూ, మధువూ, మాంస
పిండివంటలూ, భోజన పదార్థాలూ తీసుకునిపోయి సమర్పిస్తే, అన్న
ఆదరించేడేగాని ఆరగించలేదు."తాను వ్రతస్థుడననీ, అవి కావాలె న
కుంటే అయోధ్యలోనే వుండేవాడిననీ. అక్కడ పరిత్యజించి ఇక్క
గ్రహించటం ఆత్మవంచన అవుతుందనీ, ''అందుకు కారణం చెప్పి
ఆ రాత్రి కేవలం జలపానంచేసి వుపవాసం చేశాడు. లక్ష్మణుడూ,సీత
ఆయన్నే అనుసరించారు. సంధ్యా సమయాహ్నికాలు నవరించే లోపల
సౌమిత్రి దర్భలతో, ఆకులతో పడకలు కూర్చగా, ''మాకు ఈయట
ధర్మం. పుచ్చుకోవటంతగదు. ఇందుకు నీవేమీ విచారించవద్దు. తిరుగ
ప్రయాణంలో నీ అభిమతంతీరుస్తా"నని నాతోచెప్పి,మధ్యగా దర్భలతో
రెండుభాగాలుగావిభజించిన ఏకశయ్యపై సీతారాములు శయనించా
వారి చరణాలు కడిగి ఆ జలం శిరస్సుపై చల్లుకుని, తీర్థంగాగ్రహించి
కొంత దూరంగాపోయి సౌమిత్రి సజ్యశరాసనుడై సంరక్షిస్తూ ప్రద
క్షిణం చేస్తుంటే, నేనూ, నా పరివారం ఆయన వెనుకగా తిరుగుతూ
కావలి కాచాం. వారు శయించిన పడకలు ఇవే. ఆ గారచెట్టు మూల
కాంచండి. అని చెబకుంటా, నా అదృష్టం ఫలంగా అర్పించ
కుంటున్నా"ననే అర్థంవచ్చేటు ఆ రాత్రి సంగతి తెలిపాడు.

